పూజ్యులయందు అనురాగము గలిగియుండుట భక్తి యని 'విద్యానాథుడు' వక్కాణించెను.

"సాకస్మైచిత్ పరమా ప్రేమ రూపా" ఎవరిమీదనైనను నిర్మలమైన ప్రేమ గలిగి యుండుటయే భక్తియని నారద భక్తిసూత్రముల యందును, "సాపరానురక్తిరీశ్వరే" యీశ్వరుని యందు అంతములేని ప్రేమ కలిగి యుండుటయే శ్రేష్ఠమైన భక్తి యని శాండిల్య సూత్రముల యందును, వాసుదేవుని యందలి ప్రేమయు, సర్వభూతముల యందు భగవంతుం డాత్మ గలండని విశ్వాస ముంచి, సన్మానము చేయుటయు, భక్తియని భాగవతాది గ్రంథముల యందును నిర్వచింప బడియున్నది.

పాశ్చాత్యులు సయితము పైఅర్థమునే ప్రతిపాదించి యున్నారు. భగవంతుడు ప్రేమస్వరూపుడు, ప్రేమ భగవత్స్వరూపము, ప్రేమ యొక్కటియే సృష్టి సింహాసనము నధిరోహించి పాలించుచున్నది. పాలింపగలదు!

యే మానవుని హృదయమున ప్రేమ నిమగ్నమై యుండునో, ఏమానవుని హృదయమున ఈశ్వర విశ్వాసము

తాండవించు చుండునో వారిముఖమున దివ్యతేజస్సు మూర్తీభవించి యుండును. వారి మాటలు అమృత తుల్యములై యుండును. హృదయమున శాంతము నెలకొల్పబడియుండును.

ప్రేమ లేనివాడు పరుల నేరములనే యెంచుచుండును గానీ- ఓర్పన నేమొ నెరుగడు. మనోధైర్యము వాని హృదయమున నిలువజాలదు యిట్టివానికి ఈశ్వర విశ్వాస మరుదు.

ప్ర. విశ్వాసము లేనివాడు భక్తిమాధుర్యము నెరుంగగలఁడా?

'శ్రీకృష్ణ చైతన్యావతారము, నిర్మల ప్రేమా వతారము' వీరు బంగాళా దేశమున జన్మించిరి. పాపులను సయితము క్షమించిన ప్రేమమూర్తి. వర్తమానకాలమున మహాత్మ గాంధి 'సత్యాగ్రహం'మను పేరున శాంతిని, తన ప్రేమను స్థాపించు చున్నారు గదా.

సీ. వైరి పట్లను ద్వేష భావంబు వలదన్న
న్యాయంబు దెలుపు సత్యాగ్రహంబు
ప్రాణమేగినను దౌర్జన్యంబు వలదంచు
ఆదరించెడును సత్యాగ్రహంబు

కష్టంబు లెన్నైన యిష్టంబుతో సైచు
ఆత్మశక్తిచ్చు సత్యాగ్రహంబు
ప్రతికూల మభివృద్ధి పరచుకోలంది తా
నభివృద్ధిగాంచు సత్యాగ్రహంబు

గీ. ధర్మ సమరంబు బోలు సత్యాగ్రహంబు
ఆయుధములంట బోదు సత్యాగ్రహంబు
అపజయము నొంద దెపుడు సత్యాగ్రహంబు
అట్టి సత్యాగ్రహమె దిక్కు హైందవులకు

ఆకాలమున చైతన్యస్వామి చేసిన త్యాగము చూడుడు. ప్రభువు.

సీ. కరకులై మొరకులై కరవాలములు బూని
పడనిండు మీపైన భక్తులార
దుడుకులై వెడగులై దుండగీండ్రను బూని
పడనిండు మీపైన భక్తులార
తులువలై పలువలై దోర్దర్పమును బూని
పడనిండు మీపైన భక్తులార
విరసులై దురుసులై విప్రవర్షము బూని
పడనిండు మీపైన భక్తులార

గీ. కష్టలే పరిధానమ్ములు గాగ మూర్ఖ
పాళి పడనిందు మీాపైన భక్తులార
శాంతమే పరిధానంబుగా చల్లనైన
భక్తిరసదార జల్లెడు భక్తులార

కావున పరమ ప్రేమ స్వరూపమగు యిట్టి శాంతిలేక యెట్టి మతావలంబకు లైనను పరమేశ్వరుని పొందజాలరు.

సీ. క్రీస్తుమతంబె బల్ శ్రేష్ఠమంచనియెడు
క్రైస్తవ సోదర ఘనుడు గానీ
యిస్లాము సుమతంబె యెక్కుడం చనియెడు
వరమహమ్మదు జాతి వరుడుగాని
శాక్తేయ మతమె స శాస్త్రీయ మనియెడు
శక్తి పూజను జేయం జనుడుగాని
పరగ శైవ మతంబు పరిశుద్ధ మనిదెల్పు
తనరెడి వరలింగ ధారిగాని

గీ. మధ్వయైనను మరియు రా మానుజీయు
డైన నద్వైతి యైనను నాధ్యుడైన
శాంతిరసమును బొందగ జాలకున్న
నిన్ను గాంచుట సున్న ఆ పన్నరక్ష.

యిట్టి శాంతి రసమును వెదజల్లు ప్రేమ రస పూరిత భక్తియే శ్రీరామకృష్ణ పరమహంస గారి జీవితమున వారు దేవిని ప్రార్థించినది చూడుడు.

ఓయమ్మా! నీ దయా దాక్షిణ్యముల పైననే ఆధారపడియుంటిని. నిత్యమును నిన్ను తలంచునట్లు చేయుము. ఇంద్రియ సుఖములను గాని, కీర్తిసిగాని, గొప్పగొప్ప శ... లనుగాని, సిద్ధులను గాని నేను కోరుట లేదు. నీ యందు శుద్ధమగు ప్రేమ కోరికలచే కలుషితముగాని ప్రేమ, ప్రపంచ సుఖములపై వాంఛలేని ప్రేమ, అట్టి ప్రేమయే నాకిచ్చుటకు ప్రార్థించు చున్నాను. ప్రపంచ వ్యామోహములలోబడి నిన్ను మరచునట్లు చేయకుము. కామినీ కాంచనములను నాదగ్గఱకు రానీయకుము. అమ్మా! నీకంటె నాకెవ్వరును లేరని నీవే యెరుగుదువు. నీ నామము నెట్లుచ్ఛరించ వలయునో తెలియదు. జ్ఞానహీనుడను. నీదయచే నీయందు శుద్ధమగు ప్రేమ గలుగు నట్లాశీర్వదింపుము. అని వేడిరి.

ప్ర. యిట్టి పవిత్ర భావపూరిత భక్తి ప్రథమముననే మానవున కెట్లుగలుగును?

ఉ. కలుగుట దుస్తరము. సోపాన పంక్తివలె క్రమ క్రమాభి వృద్ధి కావలసియున్నది.

ప్ర అభివృద్ధికి మార్గమేమి?

ఉ. మహా భక్తులగు ప్రహ్లాదాదులు భక్త్యభివృద్ధి మార్గములను తెలిపి యున్నారు.

మ. తను హృద్భాషల సఖ్యముం
శ్రవణముం, దాసత్వముం,
వంద నార్చనముల్, సేవయు,
నాత్మలో నెరుకయుం, సంకీర్తనల్,
చింతనం బను నీతొమ్మిది భక్తి మార్గముల
సర్వాత్మున్ హరిన్నమ్మి
సజ్జనుడై యుండుట భద్రమంచు
దలతున్ సత్యంబు దైత్యోత్తమా.

పై చెప్పబడిన తొమ్మిది మార్గములే గాక—ఇంకను అనేక మార్గములు కలవు. యివన్నియు భక్తి సౌధము చేర సోపానముల వంటివి. మార్గములు వేరు వేరున్న మాత్రమున నే ఒకటితో నొకటి కెట్టి సంబంధము లేదనుటకు వీలు లేదు. పరంజ్యోతి స్వరూప మొక్కటి యైనను వివిధాకృతులు జెందునట్లును, వివిధముల చెప్పను నట్లును భక్తి సహితము వివిధ నామంబుల చెల్లు చున్నది.

1 అహేతుకభక్తి
2 రాగాత్మక భక్తి
3 వైధ భక్తి
4 సహేతుక భక్తి
5 జిజ్ఞాసా భక్తి
6 మాతృ భక్తి
7 పితృ భక్తి
8 పతి భక్తి
9 దాస్య భక్తి
10 సేవా భక్తి
11 గౌణ భక్తి
12 ఆర్త భక్తి

యిట్లు భక్తి సోపానము లెన్నియేని గలవు. భక్తి యన భగవానుడు ఆరాధనము నందే గాక సర్వత్ర చెల్లుచున్నది.

ప్ర. యీ చెప్పిన అన్ని మార్గములను ఒక్కడు అనుకరింప సాధ్యపడునా?

ఈ సంపూర్ణ భక్తివిశ్వాసములు గలవారై ఒకమార్గము ననుసరించినను మానవజీవిత యాత్రాగమ్యస్థానమగు యా పరమేశ్వరుని చేరగలరు. చేరియున్నారు.

పూర్వము భారత దేశములో భరతవంశ సంజాతుడగు పరిక్షిత్తనురాజు శాపగ్రస్తుడై ఆకారణమున విరక్తుడై శుకయోగివలన మహాభక్తుల జీవిత చరిత్రమగు భాగవతమును, ఏడహోరాత్రములు సంపూర్ణ విశ్వాసముతో శ్రవణముచేసి, తద్వారా మహాభక్తి హృదయమున పాదుకొనగా కైవల్యము చూరకొనియెను. కీర్తనముచేత కట్వాంగుడు, ప్రహ్లాదుడు మొదలగు మహాభక్తులు తరించిరి.

తే. ఏదిజపియింప నమృతమై యెసగుచుండు
నేది సద్ధర్మపదమని యెరుగదగిన
దదియె సద్భక్తి యోగంబు నావహించు
మూర్తిమంతంబు దా హరి కీర్తనంబు.

[భాగవతము]

పరమ భాగవతు డగు ప్రహ్లాదుడు కీర్తనా పరత్వమున ఇట్లు వర్ణించి యున్నాడు.

సీ. దనుజారి లీలావతారంబు లాతని
    శౌర్యకర్మంబులు సద్గుణములు
విని భక్తుడగువాడు వేడ్కతో పులకించి
    కన్నుల హర్షాశ్రుకణములొలుక
గద్గదస్వరముతో గమలాక్ష సైంధవ
    వరద నారాయణ వాసుదేవ
యనుచు నొత్తిలి పాడు నాడు న్నాక్రోశించు
    నగుఁజింతనముసేయు నతిఁడునన్ను

గీ. మరలుగొనియుండు దనలోన మాటలాడు
వేల్పుసోకిన పురుషుని వృత్తి దిరుగు
బంధములబాసి యజ్ఞానపటలి గాల్చి
విష్ణు బ్రాపించు తుది భక్తి వివశుడగుచు.

ఇట్లు కీర్తనలచే పండరిభక్తులు, శ్రీ త్యాగరాజు, జయదేవులు, శ్రీ నారాయణ తీర్థులు మొదలగువారు తరించిరి. కీర్తించువారి నుద్దేశించి గీతామాత యిట్లు చెప్పుచున్నది.

గీ. 9 అ. 14 శ్లో.

శ్లో. సతతం కీర్తయంతోమాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చమాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే.

సంకీర్తనము, నృత్యము, అర్చన, వందనము, ఉపాసనాది దృఢవ్రతములు, ఈ మొదలయినవానిచే కొందరు మహాత్ములు నన్ను సేవించుచున్నారని భగవానులు సెలవిచ్చిరి.

శ్రీకృష్ణచైతన్యస్వామివారు, శ్రీశంకరాచార్యులు, ఉడయవర్లు మొదలగు మహాత్ములు సంకీర్తనా కాండము నుజ్జ్వింప జేసిరి.

భగవానుడు గీతయందు భక్తియోగమున చెప్పిన భక్తునిలక్షణములు వీర్లయందు మూర్తీభవించినవి.

గీ. 12 అ. 13 శ్లో.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ యేవచ
నిర్మమో నిరహంకార సమదుఃఖ స్సుఖక్షమి.

గీ 12 అ. 14 శ్లో.

శ్లో. సంతుష్ట స్సతతం యోగి యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పితమనో బుద్ధి ర్యోమద్భక్త స్స మే ప్రియః.

తా. ఎవ్వారిని ద్వేషింపనివాఁడును, సర్వభూతములయం దును మంత్రభావముతో సంచరించువాఁడును, మమత్వబుద్ధియు, అహంకారము లేనివాఁడును, దయగలవాఁడును, సుఖదుఃఖముల యందు సమానబుద్ధి కలవాఁడును, క్షమగలవాఁడును, ఎల్లప్పుడు సంతుష్టుఁడును, మనోనిగ్రహము కలిగినవాఁడును, దృఢనిశ్చయము అనఁగా ఆత్మనిశ్చయము గలవాఁడును, నాయందు స్థాపబడిన మనోబుద్ధులు గలవాఁడును, నాకత్యంత భక్తుఁడును అగు యోగి, నాకుమిక్కిలి ప్రియుఁడు.

లోకులవలన యెవరికి భయములేదు అనఁగా, వ్యాకులపరుపబడఁడో, లోకమును తాను వ్యాకులపరుపఁడో, అట్టివాఁడును, హర్షము, భయము, క్రోధము, అను వానిచే వికారము నొందఁడో, వాఁడు, నాకు ప్రియుఁడు. నిరపేక్షుఁడు, ఒకపదార్థము కావలయునను ఆశ లేనివాఁడు నాకుచాలాప్రియుఁడు. ఇట్టి గుణములే ప్రతిమానవుఁడు సాధనచేయవలయును.

రామకృష్ణపరమహంస గారి సలహా చూఁడుఁడు.

హరి నామము; చెవిని బడఁగానే,— వెల్లివిరియు బాష్పములును, గగుర్పాటు చిహ్నములును, స్వామి పేరు

వినినంతనే, కండ్లనుండి నీరు ప్రవహించెనా? రోమము నిక్కబొడుచుకొనెనా? అట్టి భక్తుడు నిజముగా జ్ఞాని యైనట్లె.— జ్ఞానమె వేదాంతి సారమని రామకృష్ణులు సెలవిచ్చిరి.

వేదాంతమునకు 'శంకరాచార్యులవారు' చేసిన అర్థము సత్యమైనదే. దానిం గూర్చి 'రామానుజాచార్యులవారు' చెప్పినది వారి విశిష్టాద్వైతమును సత్యమే. నరునందలి అంతరాత్మ ప్రబోధము గాంచినగాని వానికి బ్రహ్మసాక్షాత్కారము కాదు.

తర్కద్వారమున గలుగు జ్ఞానము ఒకరకము, ధ్యానమువలన గలుగు జ్ఞానము వేరొకరకము, మఱియు భగవత్ప్రసన్నముచే గలుగు జ్ఞానము ఒకరకము. మనుజునందు శుద్ధసత్వము ప్రధానముగ నున్నపుడు అతడు కేవలము భగవద్ధ్యానమున కాలముగడుపును. ఏయితర వ్యాపారమునందును వానికి తీఱిక ఉండదు.

ప్రారబ్ధవశమున కొందరు యిట్టి శుద్ధసత్వగుణము గలవారై పుట్టుదురు. కాని, నిష్కామకర్మలను పూనికతో చేయుచుండినయెడల శుద్ధసత్వగుణము అలవడగలదు. రజోగుణ

ముతో మిశ్రమమైన సత్వగుణము గలవాని మనస్సు వేరు వేరు దిశలకు లాగబడును. నేను ప్రపంచమునకు మేలుగూర్చుదును అహంభావము తెచ్చిపెట్టును. కావుననే సామాన్య "జీవులు" లోకోపకారమునకు పూనుట చాలాఅపాయకరము.

కానీ— ఇతరుల క్షేమమునిమిత్తము అపేక్ష యేమియు లేకుండా పనిచేయు నెడల అపాయ ముండదు. నిష్కామ కర్మము నగా యిటువంటిదే. అటువంటి కార్యము చేయుట వాంఛనీయమే? కానీ, అందరు చేయజాలరు చాలాకష్టము.

భక్తిమార్గ మందుగల గొప్పదనము యింకనొకటి గలదు స్వభావముననే యింద్రియనిగ్రహము, కామ క్రోధ రాహిత్యము కలిగి బ్రహ్మ సాక్షాత్కార లక్షణములు భక్త్యావేశమునందు కానుపించును.

కనుకనే భక్తిని ఒక పెద్దపులిగాఁ బోల్చినాడు పెద్దపులి మృగములను దిగమ్రింగులాగున, భక్తి నరునిశత్రువగు మను కామ క్రోధాది దుష్టగుణములను మ్రింగివేయును.

ఒక్కసారి భగవద్భక్తికి పూర్ణబోధమును పొందెనా, కామము, క్రోధము, మున్నగు దుర్వ్యసనము లన్నియు నిర్మూలము లగును.

యిట్టిభక్తి పరవశత్వము పొందినవారికే హృదయము ప్రేమమయ మగును. ఆసమయమున ఇది లోకసేవ, మానవ సేవ, ఇది భగవంతునిసేవ అను భేధభావములేక సేవ స్వధర్మ మని తలంచును. అట్టిసేవయేకదా! తన్మయత్వమును గలిగించును.

మనస్సు యెట్టిదశయందున్నప్పుడు యిట్టి తన్మయత్వము గలుగును? అనిప్రశ్న. శ్రీ రామకృష్ణపరమహంసగారిని కొందరు ప్రశ్నించి నపుడు, మనస్సు ప్రశాంతముగా నున్నపుడు, భగవంతుడు సాక్షాత్కరించును. మనోజలధిని వాంఛలనెడు గాడ్పులు కల్లోల పరచుచో— అందు దేవుని ప్రతిబింబము గోచరించదు భగవత్సాక్షాత్కారము అట్టి దశయందు అసంభవము. హృదయ మెప్పుడును నిరాశ ననుకరించ వలయునే గానీ ఆశనుబెంచరాదు. ఆశయనునది పురోగమనమునకు ప్రబలశత్రువు. మనుజుడు తాను మననముజేయు రూపమునుపొంది తన్మయు డగును. పెద్దపెద్ద ధాన్యపుకొట్ల ద్వారములకడ పే

లాలు మూటలుగల స్థలమునందు యెలుకబోనులు పెట్టుదురు. ఆ పేలాల వాసనచేత లాగబడి యెలుకలు ధాన్యపుగింజల రుచినివిడిచి బోనులోనికి పోవును. అందు అవిచిక్కుకొని చచ్చును. జీవునిగతి అట్లగుచున్నది. కామాదులను తృప్తిపరచుకొనుటచేత గలుగును. అల్పసుఖములకంటె యెన్నిసహస్రకోట్ల రెట్లు సుఖప్రదమగు తన్మయానందము అనగా, బ్రహ్మానందమునకు చేరువనే జీవుడున్నాడు. కాని- ఆబ్రహ్మానందమును యనుభవించుటకు మారుగా, ప్రాపంచిక విషయసుఖముల వాసనచేత లాగబడి భ్రాంతుడై యందే మరణించుచున్నాడు, అని నుడివిరి. యిట్టివాడు భగవంతుని సేవించి తరింప జాలడు. కావున సేవాభక్తియు చక్కని సోపానము.

సుగ్రీవ, నల, నీల, అంగద, జాంబవదాదు లందరు శ్రీరామదాసులే. అయినను అంజనేయుడు, వీరలయందు ముఖ్యుడు. నూరామడ విస్తీర్ణముగల సముద్రమును గోష్పాదమువలెదాటి లంకప్రవేశించి సీతాన్వేషణము గావించి వీరాతివీరులగు రాక్షసుల సంహరించి లంకను అగ్నికి ఆతిథ్యముగా నొసంగి శ్రీరామ సాన్నిధ్యముచేరి, జానకి క్షేమములు ప్రభునకెరింగించిన దాసుడు.

ప్రభుదాసన్యాయము. ఆంజనేయుడు చక్కగ నెఱింగిన పండితుడు.

సీ. రఘురాము పంపున లంకాపురంబుపై
చెంగున వారధి చొకళింప
జానకిఁ గనుగొని జననాథు డిచ్చిన
ముద్రిక గురుతుగా ముదిత కొసగి
వనజాక్షి యిచ్చిన ఘన శిరో మణిదెచ్చి
భీకరాకారుడై పెరిగి నిలిచి
వనమెల్ల పెకలించి వనపాలకుల జంపి
అక్షయ కుమారుని హతము జేసి

గీ. జలధి లంఘించి రాక్షసుల క్షయము జేసి
పట్టణముగాల్చి రఘురాము పాలికేగి
వినుతికెక్కిన కపులలో వెలసినట్టి
శత్రు సమవర్తి హనుమంత చక్రవర్తి.

కావున,— ఆంజనేయాదులు దాస్య భక్తి మాధుర్యము నెరింగి తరించిరి.

'శబరి'యను బోయత శ్రీరాముని పూజించి తరించెను కావుననే,— 'త్యాగరాజు' "యెంతని నేవర్ణింతు శబరి భాగ్యము" అను గానముఁ జేసిరి.

వీరందరు ప్రతి ఫలముఁ గోరక పరమేశ్వర ప్రీతిగా నాచరించుటచే అహేతుక భక్తిగాఁ జేసినది.

ఉత్తమ భక్తుడెన్నటికిని ఐహికముల నపేక్షింపఁడు.

శ్లో. నిత్యానందరసాలయంసురమునిస్వాంతాంబుజాతాశ్రయం
స్వచ్ఛం సద్విజ సేవితం కలుష హృత్సద్వాస
నావిష్కృతమ్
శంభుధ్యాన సరోవరం వ్రజమనో హంసావతం సస్థిరం
కిం క్షుద్రాశ్రయ పల్వలభ్రమణ సంజాతశ్రమం ప్రాప్స్యసి.
శివానందలహరి.

తా. ఓ మనోరాజహంసమా! క్షుద్ర దేవతల నాశ్రయించుటవల్ల కొన్ని పాపములు తొలగిన తొలగుఁగాక, శాశ్వతానందము చేకూరదు. అది కేవలము నీవు నిలచెదు

చిన్నచిన్న గుంటలకెల్ల బోయి శ్రమజెందుటగాని వేరుకాదు అట్టి వట్టియాయాస మేలపడియెదవు? శంభుధ్యానము చేయుము. అది మహా సరోవరము, అందు శాశ్వతానందము, జలము గను. దేవతలు, మునులు మున్నగువారి చిత్తములు— కమల ములుగను స్థిరముగా నిండియుండును. బ్రాహ్మణ క్షత్రి యాదులగు పెద్దలెల్లరును, హంసాది పక్షులుగా నిత్యము సేవించుచుందురు. అది పాపము లెల్లఁ బాపును. సత్కర్మ సంస్కారమునగాని లభింపదు. మంచిమంచి వాసనలను వెద జల్లుచుండును. తక్కిన చెరువులవలె నది యొకప్పుడునుతరుగు నది కాదు. బహిరంగ సాధనములను విడిచి, యంతరంగ సాధ నము నవలంభింపు మని ముఖ్యాభిప్రాయము.

కావున,— ఉత్తమ భక్తుడు తన మానసరాజ హంసంబును పరమేశ్వరుని పాద కమలముల నివాసమైయుండు భక్తి సరోవరంబుననే విహరింపఁజేయును.

భగవానుడే నుడివి యుండుట గనుడు?

శ్లో. నపారమేష్ట్యం న మహేంద్రధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యం

న యోగసిద్ధీ రపున ర్భవంహి
మయ్యర్పితాత్మే చ్ఛతి మద్వినాన్యత్.

తా. నాకంతరాత్మను సమర్పించినవాడు బ్రహ్మపదంబును, ఇంద్రపదంబును, సార్వభౌమ పదంబును, రసాధిపత్య పదంబును వెయ్యేల తుదకు యోగసిద్ధిని. మోక్షము నైనను కోరడు. అట్టి భక్తాగ్రగణ్యునకు నాపైదప్ప, లాతివానిపై కోరిక యుండదు.

మ. నీతో నవ్వులు, నర్మగర్భితములున్
నీతోడ సల్లాపముల్,
నీతో ముద్దులు, ముచ్చటల్, మురిపముల్,
నీతోడ విజ్ఞాపనల్.
నీతో నాటలు, పాట, లేకతములున్
నీతో జగం బంతయున్
నీతో నేను నీ? నీవు భక్తునకు
తండ్రీ! భక్తచింతామణీ.

ప్ర. అయిన భక్తుని లక్ష్యమేది?

ఉ. భక్తుని లక్ష్యము ముక్తియే కాని,- వాడద్దాని సయితము ఆసింపడు. ముక్తి కాంతయే భక్తున కభిముఖియై పాదములంటి తన్ను గైకొమ్మని బ్రతిమాలుకొనును.

శ్లో॥ యది భవతి ముకుందే భక్తిరానందసాంద్రా
విలుఠతి చరణాబ్జే మోక్ష సామ్రాజ్యలక్ష్మీః॥

శుకయోగి మొదలగు వారిని మోక్షకాంత వెంబడించినదని భాగవతము నందు తెలుపబడి యున్నది.

సీ. ప్రతి నిమేషము పర బ్రహ్మంబు నీక్షించి
మదిఁజొక్కి వెలుపల మరచువాఁడు
కమలంబుమీఁది భృంగముల కైవడి మోము
పై నెరసిన కేశ పటలివాఁడు
గొఱవాఁసి మాఱు నంగీకరించిన భంగి
వసనంబు గట్టక వచ్చువాఁడు
సంగిగాఁడని వెంట జాటు భూతములు నా
బాలుర హాస శబ్దములవాఁడు

తే. మహిత పదజాను జంఘోరు మధ్యహస్త
బాహు వక్షో గళానన ఫాల కర్ణ
నాసికా గండ మస్తక నయన యుగళు
డైన యవధూత మూర్తి వాడరుగుదెంచె.

ఉ. ఈరసి లోకులం గినిసి యెగ్గులు వల్కనివాడు
గోరికల్ గోరనివాడు గూటువల గూడనివాడు వృథా
ప్రపంచముం
జేరనివాడు దైవగతి జేరిన లాభముజూచి తుష్టుడై
నేరనివాని చందమున నేర్పులు చూపనివాడు వెండియున్.

ఆ. అమ్మహాత్ము షోడశాబ్ద వయోరూప
గమన గుణ విలాస కౌశలములు
ముక్తికాంతసూచి మోహిత యగునన
నితర కాంత లెల్ల నేమిసెప్ప.

భాగవతము.

'శ్రీ శంకరాచార్యులు' స యి త మీ యీలాగున నే
నుడివి యున్నారు.

శ్లో. నమోక్షస్యాకాంక్షా భవ విభవ వాంఛాపిచ నమే
నవిజ్ఞానాపేక్షా శశముఖి సుఖేచ్ఛాపిన పునః
అతస్త్వాం యాచేహాం జననీ జననం యాతు మమవై
మృడాని రుద్రాణి శివశివ భవానీతి జపతః.

తా. హే జననీ! నాకు మోక్షమువలదు. విభవములు వలదు. విజ్ఞానము వలదు. శారీరక సంబంధ సౌందర్యము వలదు జన్మమెత్తినది మొదలు నీ అనంత నామములు జపించునట్లు వరము దయచేయు మని శంకరిని వేడుకొనిరి.

ముక్తి; పూర్ణ వైరాగ్యము గలిగిన భక్తునే వరింప గలదు.

శ్లో. భోగే రోగభయం, కులే చ్యుతి భయం,
విత్తే నృపాలాద్భయం,
మానే దైన్య భయం, బలే రిపు భయం,
రూపే జరాయా భయమ్,
శాస్త్రే వాదభయం, గుణే ఖలభయం,
కాయే కృతాంతాద్భయం.

సర్వం వస్తుభయాన్వితం భువి నృణాం
వైరాగ్య మేవా భయమ్.
భర్తృహారి.

అ. సంపూర్ణ భోగము లనుభవించుచో రోగము లెక్కడ వచ్చునో యను భయముగలదు. పేరు ప్రతిష్ఠలుగల సత్కులమందు పుట్టితి మనుకొను నపుడే యకార్య కరణము వలన యెప్పుడు అప్రతిష్ట వాటిల్లునో యను భయము కలదు, ఐశ్వర్యవంతుల మనుకొను నపు డే రాజు గైకొనునో యను భయము గలదు. అభిమానవంతుల మనుకొను నపుడే దైన్య మెప్పుడు అనగా దీనత్వమెప్పుడు సంప్రాప్తమగునో యను భయము గలదు, బలవంతుడనుగదా యని యనుకొనినప్పుడు శత్రువు లోడింతురో యను భయము గలదు. చక్కదనము గలదుగదా యను కొనునప్పుడు ముసలితనము వచ్చునో యను భయముగలదు. శాస్త్రజ్ఞు డనుకొను నప్పుడు ప్రతి వాదమువల్ల భయము గలదు. సద్గుణము గలదుగదా యను కొను నప్పుడు దుర్మార్గుల వలన భయముగలదు. శరీరవృద్ధిష్టి యెక్కువ అయినప్పుడు చావు భయము యెక్కువగా కనబడు చున్నది. చక్కగా విచారించిన సర్వ వస్తువులును భయాన్వితములై వైరాగ్య మొక్కటియే నిర్భయమైనది.

శ్లో. భోగాస్తుఙ్గ తరఙ్గ భఙ్గతరళాః ప్రాణాః క్షణధ్వంసినః
స్తోకాన్యేవదినాని యౌవనసుఖ స్ఫూర్తిః ప్రియాసుస్థితా
తత్సంసార మ సారమేవ నిఖిలం బుద్ధ్వాబుధా బోధకా
లోకానుగ్రహ పేశలేన మనసాయ త్నస్సమాధీయతామ్.

ఉ. తుంగ తరంగ భంగముల లోఁ
దులదూగు విలోల భోగముల్
భంగపడుఁగ నిమేషమున
బ్రాణము కొన్నిదినంబులే సుఖం
బంగనలందు నిట్లు మది నారసి
బ్రహ్మవిచార యత్న ము
పొంగుచు జేయగా వలయు
భూరిజగద్ధిత బుద్ధిఁ బండితుల్.

చ. జలదములోని క్రొమ్మెరుఁగు
ఛాయలు భోగ పరంపరల్ మహా
నిల పరిఘట్టితాబ్జ దళనీర
తుషారము జీవితంబు చం

చలతరముల్ వయోభి మత
సౌఖ్యము లీగతి నాలకించి స
భ్యులు పరమాత్మ యోగమున
బుద్ధి ఘటింపుడు సత్వరంబుగన్.
భర్తృహరి.

ఉ. ఎందు వసించి ధన్యుడు విధీంద్ర
ముఖామర కోటినెల్ల నెం
చుం దృణమట్లు దేని జవిజూచుటచే
రసహీన భావముం
జెందు జగత్ప్రభుత్వమును
జెప్పగరాని యనంత కేవలా
నందము దానియందు మది
నాటుము మానుము నీచ భోగముల్.

వైరాగ్యము నుద్దేశించి 'పతంజలి మహాఋషి'—

సూ. "బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః"

బ్రహ్మచర్యము నభ్యసించుట వలన బ్రహ్మవర్చస్సు గలుగును. బ్రహ్మమును ధారణచేయుటకు తగిన శుద్ధమైన తేజస్సు ఉదయించును. దీనివల్ల ఆత్మజ్ఞానము చేకూరును. యింద్రియమును నష్టపరచక కాపాడుచుండ వలయును. తైలము గల జ్యోతి; చీకటిని పారద్రోలి, గృహములో గల అన్ని వస్తువులను ప్రకాశింప జేయునట్లు— బ్రహ్మచర్యము దివ్య ప్రకాశమగు ఓజస్సుగా మారుచుండును. అట్టి వానికి ప్రకృతియందు గల సమస్త సూక్ష్మతత్వములును మనో దృష్టికి గోచర మగును.

ప్ర. గృహస్తునకు ఇట్టి తేజము పొందుటకు వీలులేదా?

ఉ. పొందవచ్చును. గాని,— ఓజశ్శాలియై మనస్సు సంపూర్ణముగా పరమేశ్వరుని యందు లయమైనప్పుడు బ్రహ్మచర్యము వైరాగ్యమునకు దారిజూపును. వైరాగ్యము జ్ఞాన భక్తిని ప్రసాదించును. రామకృష్ణ పరమహంస సలహాయందు:—

సంసార లంపటవు చేరగాండ్రు తుచ్ఛ భోగములపై పుచ్చు పప్పులకునై దేవులాడు చున్నారు. సంసార కల్మష మంటని అమలజీవులకు మాత్రమే భగవద్భక్తి దొరకగలదు. వానికి ఒకేదృష్టి, స్వామి పాదారవిందములపై నిశ్చలముగా మనస్సును నిలువుచే.— ఏకైక వాంఛ. భోగవాంఛ తగ్గిన కొలది భగవద్భక్తి పెంపొందు చుండును. అతడు భగవంతుని యందు నిలయ మేర్పరచుకొని వానియందు ఆనంద మనుభ వించు. లజ్జా భయములను విడనాడును. ఇట్టి భక్తునకు వైరాగ్యము తానుగా లభించును. మొత్తముపై జ్ఞాన భక్తి వైరాగ్యములు అన్నియు నొక్కచోట పరిపూర్ణత నొందిన జ్ఞాని యన్నను, భక్తుడన్నను, యోగియన్నను సరియె.

దేవమౌనియగు నారదులవారును తన భక్తి సూత్రములయందు:—

సూ. 3. "అమృత స్వరూపాచ"

తా. భక్తి జనన మరణరూపక మైన సంసారమును

దుదముట్ట జేయును. గాన,— అమృత స్వరూపము గలదని చెప్పబడినది.

భాగవతము:

మయిభక్తిర్హి భూతానా మమృతత్వాయ కల్పతే.

తా. ప్రాణికోట్లకు నాయందు నిర్మల భక్తి జనించిన జనన మరణముల నుండి తొలగించి, అమృత తత్వమును పొందించును.

ఒకానొక 'పారసీక కవి' వ్రాసిన దాని కనువాదము.

గీ. ఖనిజ ముల నుండి అంకురం బునకు ప్రాకి
అంకురము నుండి జంతువై యంతమీద
మానవుడనైతి భయమేల మాను దింక
మరణమున నున్న తత్వమే యరయుచుంటి
మానవత్వము వీడి యే దేని దేవ
యోనుల జనింతు నచ్చోట నుండరాదు

నిత్యుం డీశ్వరు డితర మనిత్యమె గద
దైవిక స్వరూపమును గూడ ధారవోసి
ఆ యహాజ్ఞానస ప్రీత్య గాత్ముఁడైన
ఏక మేవా ద్వితీయ మం దైక్యమౌదు.

సూ. 4. యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవ త్యమృతో భవతి తృప్తో భవతి.

తా. భక్తిని పొందిన మానవుడు పరిపూర్ణుడు మగణ రహితుడు, తృప్తుడు, వీడే స్వార్థత్యాగి.

గీ. భవ మహారోగ లోప హం భావములకు
దైవ భక్తియె దివ్యౌషధంబు చూవె
భక్తి తీవ్రత మానావ మానముల క
తీత మగుటనె స్వార్థపు త్యాగ మనిరి.

దైవభక్తిచే యిట్టివి సహజముగనే కలుగు చుండును

ఒక పుష్పము వికసింపగనే మానవున కానంద మొదవును. కాని,- వాని నానందపరచుట కది వికసింపదు. దాని నైజమది.

ప్ర. యెట్టి దశయందు యిట్టివి సహజము లగును? అట్టిభక్తి యెట్టిది?

ఉ. భగవంతునిపై అత్యంత గాఢానురాగమున. ఇయ్యది మహా భావముతో గూడి లభించుచుండు. దీనినే 'రాగాత్మక భక్తి' యని చెప్పుదురు.

శ్లో. ఇష్టే స్వారసికో రాగః పరమా నిష్కృతో భవేత్
తన్మయా యాభవేద్భక్తి స్సాత్ర రాగాత్మ కోదిత.

అ. అభిలషిత వస్తువులపై మానసము నిబిడా వేగము గలిగియుంట రాగము. రాగ మయమగు భక్తి రాగాత్మక భక్తి సరిల్లలామములు (నదులు) సాగరము నుద్దేశించి పరు విడుటయు భృంగ గణములు (తుమ్మెదలు) మధుపానాభిలాషులై పుష్పముల నాశ్రయించుటయు ప్రాభాతకాలమున

(తెల్లవారు సమయమున) మలయ సమీరము పుష్పిత లతా కుంజమును కదలించి పుష్పాదిని రాల్పుటయు, సంధ్యారాగము తన సంజ కెంజాయలను నలు దిశల ప్రసరింపఁ జేయుటయు యిత్యాదులు ప్రకృతి సహజములు. అయ్యవి ప్రయత్న పూర్వకముగా అట్లు చేయుట లేదు.

ఆలాగున భగవానుని స్వభావంబుగనే ప్రేమించుట రాగాత్మక భక్తి యనబడును.

యిట్టి భక్తి నిష్కాపట్యము.

ప్రపంచక వ్యావృత్తులు గల వారి భక్తి సాధనా ఫలితము. తాత్కాలితము. అసంస్కారములు చాలాకాలము నిలువవు. కాని నిరంతరము భగవద్భక్తి సలువువారు ప్రతి శ్వాసముతోనూ యీశ్వరు నామోచ్చారణము చేయుదురు.

సర్వ విషయము లందును విరాగమున్ను, యీశ్వరుని యందురాగముగలవాడు రాగాత్మకభక్తి గలవాడని 'శ్రీరామ కృష్ణుడు' సలహా యిచ్చినాడు.

అట్టి భక్తియందు మధురము గలదని 'గోపికలు' శ్రీ కృష్ణ పరమాత్మను చేరి తరించిరి.

మ, అకటా! నమ్మితిమేము క్రూరుడవె
నిన్నాశించి మాయిండ్లలో
సకల వ్యాప్తుల డించి నీపద
సరోజాతంబు లర్చింప చి
క్కక యేతెంచితి మీశు
డాఢ్యుడు ముము తొసక్తులం గాంచు పొ
లిక గావందగు గావవే విడవ
మే లే కాంతలం బ్రాంతలన్.

మ. పతులం బిడ్డల బంధుల న్సతుల
నున్నాటించు చే ధర్మ
పద్ధతియానంటివి దేవా ధారిణులకున్
ధర్మజ్ఞ! చింతింపుమా?
పతి పుత్రాదిక నామ మూర్తివగుచు
న్భాసిల్లు నీయందు ద

తృతి పుత్రాధిక వాంఛలన్నలిపి
సంభావించు టన్యాయమే? [భాగవతము.]

## భక్తిసూత్రము.

సూ. 2. "యథా వ్రజ గోపికానారి."

బృందావన మండలి గోపికల ప్రేమ యట్టిదే.

సీ. నీపాదకమలంబు నెమ్మి డగ్గరగాని
తరలిపోవంగ పాదములు రావు
నీకరాబ్జంబులు నెఱి నంటితివగాని
తక్కిన పనికి హస్తములు సాగవు
నీవాగమృతధార నిండ గ్రోలగగాని
చెవు లన్య భాషలు చేరి వినవు
నీసుందరాకృతి నియతి జూడగగాని
చూడ వన్యంబుల చూడ్కి కవలం
గీ. నిన్నెకాని పలుక నేరవు మాజిహ్వ
లొల్లననుచు బలుక నోడవీవు

మా మనంబులేల మరలించి దొంగిలి
తేమి సేయువార మింక కృష్ణ.

ఇట్టి మధురభక్తి రసావేశమున పరవశలైరి. ఆ సమ
యమున గోపికల భక్తిని పరీక్షించ దలచి కృష్ణు డదృశ్యుడై
న సమయమున గోపికలు ప్రతి వృక్షమును, ప్రతి లతను,
ప్రతిపక్షిని ప్రతిజంతువునుతమ యిష్టమూర్తి నుద్దేశించిప్రశ్నిం
చిరేగాని, అన్యప్రశ్నలుగాని, అన్యసంభాషణగాని వారికిలేదు

సీ. పున్నాగ! కానవే పున్నాగ వందితు
దిలకంబ! కానవే తిలక నిటలు
ఘనసార! కానవే ఘనసార శోభితు
బంధూక! కానవే బంధు మిత్రు
మన్మథ! కానవే మన్మథాకారుని
వంశంబ! కానవే వంశ ధరుని
చందన! కానవే చందన శీతలు
కుందంబ! కానవే కుంద రదను

గీ. ఇంద్రభూజమ! కానవే యింద్రవిభవు
కువలవృక్షమ! కానవే కువలయేశు
ప్రియకపాదప! కానవే ప్రియవిహారు
ననుచు కృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.

సీ. అదె నందనందనుం డంతర్హితుం డయ్యెఁ
పాటలీతరులార! పట్టరమ్మ
హేలావతుల కృష్ణు డేల పాసితివని
మైలేయలతలార! యడుగరమ్మ
వనజాక్షు డిచటికి వచ్చి డాగడు గదా
చూతమంజరులార! చూడరమ్మ
మానినీ మదనుతో మారాక యెరిగించి
మాధవీలతలార! మనుపరమ్మ

ఆ. జాతి సతులబాయ నీతియె హరికని
జాతులార దిశల జాటరమ్మ
కదళులార! పోయి కదలించి శిఖిపించ
జూటు దెచ్చి కరుణ జూపరమ్మ.

ఇట్లు ఆ పరమేశుని అత్యంత మధుర స్వరముతో పిలుచుచూ, పాడుచు నేడ్వగా,— ఆ జగధీశ్వరుడు ఆయోగేశ్వరేశ్వరుడు ఆప్రేమ మూర్తి సర్వాలంకార శోభితుడై మోహనాకారుడై వారికి సాక్షాత్కరించినాడు.

ఇట్లు మానవ జీవితములో యెవని హృదయము రాగమయ మగునో వాడు ధన్యుడు.

ఒక 'గోపిక' యిట్లు గాఢాను రాగము భగవానుని పై నుంచి,—

ఉ. ఒక్క లతాంగి మాధవుని
యుజ్జ్వల రూపము చూడ్కి
తీగెలం జిక్కగబట్టి హృ
ద్గతము జేసి వెలిం జనకుండ నేత్రముల్
గ్రక్కన మూసి మేన బుల
కమ్ములు గ్రమ్మగ గౌగలించుచున్

చొక్కములైన లోచనవుల
జొక్కుచు నుందును యోగినై నడిన్.

ఇట్లు మధుర భక్తియందు మునిఁగి, లీలాశుకులు

కరుణను పాదుకొల్పిన జగంబు
కటాక్ష సుధాగసాప్తిచే
పరిణత పల్లవ ప్రసవ పక్వ
ఫలంబునుగా నొనర్చుచున్
చిరుత మిఠారి పాయమున
చెల్వగు చక్కదనాల పంట న
మ్మురవారు బూనిన చంద్రముఖు
మోహన పల్లవ మేఘు గొల్చెదన్.

కావున,— ఇట్లు రాగ మయమగు భక్తిచే కలుగు లాభము, భగవంతునితోటి అమిత సఖ్యము చేకూరుటయు, సఖ్యభక్తిచే అనేకమంది మనోలయము గావించు వారు గలరు.

'అక్రూరుడు, యుద్ధవుడు, అర్జునుడు, గోపాలురు' మొదలగువారు భగవంతుని యందు సఖ్య భక్తిచే విశ్వరూపము దర్శనము చేయ గలిగిరి.

'అక్రూరుడు' శ్రీకృష్ణుని తోటి మధురకు వెళ్లు సమయమున భగవంతుని విశ్వరూపమును చూచి ఆ మహానందములో లీనమై ప్రార్థించెను.

క. నీలోన లేని చోద్యము
లే లోకములందు జెప్ప రీశ్వర నీట
న్నేలన్ నింగిని దిక్కుల
నీలో చోద్యంబు లెల్ల నగడె మహాత్మా.

యీలాగుననే అర్జునునకు గీతోపదేశ కాలంబున శ్రీకృష్ణ పరమాత్మ విశ్వరూప దర్శనము చేయించి, అతనికి గలిగిన సంశయము లన్నియునుతీర్చి మిక్కిలిదయతో అర్జునా!

గీ. 11 అ. 52, 53, 54 శ్లో.

శ్లో. సుదర్శన మిదం రూపం దృష్టవా నసియన్మమ
దేవా అప్యస్యరూపస్య నిత్యం దర్శన కాంక్షిణః.

శ్లో. నాహం వేదైర్నతపసా నదానేన చేజ్యయా
శక్యఏవం విధోద్రష్టుం దృష్టవానసి మాంయథా.

శ్లో. భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోర్జున
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప.

అర్జునా! నీచే చూడబడిన నాయొక్క స్వరూపమును చూచుట మిక్కిలి కష్టము. దేవతలు సహితము యీరూపమును జూడవలయునని కోరుచుందురు. నీవు నన్ను చూచినటుల వేదములచేత గాని, దానములచేత గాని, యజ్ఞముల చేత గాని యెవ్వరును నన్ను చూచుటకు వీలులేదు.

ప్ర. అయిన,— వేదశాస్త్ర. దానము, యజ్ఞములు అప్రశస్తములా?

ఉ. ఊరక చిలుక వలె పలికెడు వేద శాస్త్రములు గాని, కీర్తికోర కాచరించెడి దానములు గాని, ప్రతిఫలాపేక్షతో చేసెడి దానములు గాని, పాత్రాపాత్రల నెరుంగక చేసెడి దానములు వ్యర్థములనిరి.

కానీ,— అర్థము తోను, భావము తోను కలిసి, తన ఉత్తీర్ణతకు దైవ భక్తి కాస్పదమైనచో వేదశాస్త్రములు ప్రమాణములె.

గీ. 6 అ. 4 శ్లో.

శ్లో. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి.

కార్యా కార్య వ్యవస్థ యనగా,— కర్తవ్య మిది, అ కర్తవ్య మిది అనగా,— చేయగూడనిది ఇది యనిన్ని చేయవలసినది యిది అనిన్ని, నీకు తెలియక పోయినప్పుడు తెలియుటకు శాస్త్రము వుండ వలయును. అని ప్రభువు సెల విచ్చియున్నారు.

ప్ర. మానవుని కర్తవ్య మేమి?

ఉ. శ్లో. నీచాశ్రయం న కర్తవ్యం కర్తవ్యం మహా దాశ్రయం.

అన్నట్లు సర్వ జగదాశ్రియుడగు పరమేశ్వరు నారాధించి ఆశ్రియించ వలయును గాని, దేహ జన్య విషయముల నాశ్రియించుట తగదని చెప్పిరి,

ఇదియే మానవుని కర్తవ్యము.

ఈశ్వరుడు కర్తవ్యములకై కాలము వేచియుండుమన లేదు. కానీ,— కాలమునకు తగు కర్తవ్యముల నిర్వర్తింపమనుచున్నాడు.

అట్లు గానిచో, యీ వేదములుగాని, యీ శాస్త్రములు గాని, యీ భూదేవత్వ శాంతత్వముగాని చాలవు.

కావున నే,— ప్రహ్లాదుడు,—

కం. చాలదు భూదేవత్వము
చాలదు దేవత్వ మధిక శాంతత్వములున్
చాలదు హరి మెప్పింప వి
శాలోద్యములార! భక్తి చాలిన భంగిన్,

కం. చిక్కడు వ్రతముల గ్రతువుల
చిక్కడు దానముల శౌచ శీల తపములన్
చిక్కడు యుక్తిని భక్తిని
చిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ.

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు
రక్షోనాధ వెయ్యేటికిన్
గాధల్మాధవ శేముషీ తరణి
సాంగత్యంబునన్ గాక; దు
ర్మేధం దాటగవచ్చునే సుత వధూ
మీనోగ్ర వాంఛా మద
క్రోధోల్లోల విశాల సంసృతి మహా
ఘోరామితాంభోనిధిన్.

కావున.— పూరక శాస్త్ర పరిశోధనా తర్కముల కై కాలము వృధచేయక, వాదనలకునై గడంగక మానవుడు తన స్వ ధర్మమగు భగవంతు నారాధన చేయవలయును.

గీ. అ. శ్లో.

శ్లో. తద్బుద్ధ యస్తదాత్మానా స్తన్నిష్టా స్తత్పరాయణాః.

మనో బుద్ధులు పరమాత్మ యందుంచి, ఆయనయందే నిష్ఠ గలిగి, వస్తు పారాయణము మాని. భగవన్నామము పారాయణము చేయవలె

భగవానుని యందు నిష్ఠ గలుగుటకు మన పూర్వులు కొన్ని సులభోపాయముల నుడివి యున్నారు.

భగవానునిపై కవనము లల్లుట, గ్రంథములు వ్రాయుట, గానముసేవించుట, నామములు చెప్పుట యిత్యాదులు.

'బమ్మెర పోతన' గారు చూడుడు, తన భాగవతము వ్రాయునపుడు,

కం. పలికెడిది భాగవత మట

పలికించెడువాడు రామ భద్రుండట నేఁ

బలికిన భవహార మగునట
పలికెద వేరొండు గాథ పలుకగ నేలా.

అని భగవానుడు తనయందు ఆవేశించి గ్రంథము వ్రాసినట్లు భావించినాడు.

ఆలాగుననే 'త్యాగరాజు' గారు (నీవే బలుకుట నే బలుకుటగాదు రామ) అని గానము చేసిరి.

'శ్రీకృష్ణ చైతన్య స్వామి' భగవన్నామములు పలుకుచు, ఆ నామాధిష్ఠాన మూర్తిః తానై పోయెడువాడు.

కావున,— యిట్లు ప్రభువు యందు నిష్ఠ గలుగుటకునై మనము కవనము లల్లవలె, గ్రంథములు వ్రాయవలె. గానము చేయువలె, నామములఁ జెప్పవలె, భక్తి చేయవలె, యోగము గావింపవలె, సమదృష్టి సంపాదించవలె, జ్ఞానులు కావలె. లేనిచో,— నిరర్థకము లగును.

భక్తి లేని క్రియలు నిరర్థకము లని 'ప్రహ్లాదుడు' యీలాగున వచించినాడు.

శా. అంధేందూదయములు మహా
బధిర శంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక
వధూ కాంక్షల్ కృతఘ్నావళీ
బంధుత్వంబులు భస్మ హవ్యములు
లుబ్ధ ద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల
రిక్త వ్యర్థ సంసారముల్.

ప్ర. భక్తి యింత సుఖకరము, యింత సులభ మని చెప్పుచుంటిరే? ప్రతి మానవుడు యేల ఆశ్రయించుటలేదు?

ఉ. ఇంద్రియ ప్రవాహమున మునుగుటచే, భక్తి మార్గము బోధపడుట దుర్లభముగా నున్నది.

ప్రపంచమున అనేకమంది మానవుల హృదయము విషయ ప్రవాహమునే అనుసరించు చుండును.

'శ్రీ శంకరులు' "వివేకచూడామణి" యందు,—

శ్లో. మనోనామ మహా వ్యాఘ్రో విషయారణ్య భూమిషు
చరత్యత్ర నగచ్ఛంతు సాధవోయే ముముక్షవః.

గీ. మనస నెడు పెద్దపులి విష మంబులైన
విషయ విపినాంతరంబుల విచ్చలవిడి
తిరుగు చున్నది యావంక కరుగబోకు
డయ్య మోక్షంబు గోరెడి నార్యులార!

గీ. 2 అ. 6 శ్లో.

శ్లో. యతతోహ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితం
ఇంద్రియాణి ప్రమాదీని హరంతి ప్రసభం మనః.

ఇంద్రియములను లోబరచుకొనుటకు ప్రయత్నించు

వానినైనను, పండితునైనను, వివేకము సాధన ప్రయత్నములో నున్నవానినైననుకూడా బలాత్కారముగా ఇంద్రియములు లాగుచున్నవి. మనస్సు ఇంద్రియములను చిక్కుచున్నది.

'మనువు' కూడా యీలాగే చెప్పియున్నాడు.

శ్లో. బలవాన్ ఇంద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి.

అ. విద్వాంసుని సహితము లోబరచుకొను శక్తి ఇంద్రియములకు గలదు. ప్రహ్లాదుడు,—

శా. హాలాపాన విజృంభమాణ
మద గర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలా నిచయ సం
బద్ధాత్ములై లేకముక్
వేలా నిస్సరణంబుగానక మహా
విద్వాంసుడుం గామినీ
హేలా కృష్ణ కురంగ శాబకముగన్
హీనస్థితిన్ వింటిరే.

కఠోపనిషత్తు

"ఆత్మానగ్ం రథినం విద్ధి శరీరగ్ం రథమేవతు
బుద్ధింతు సారథింవిద్ధి మనఃప్రగ్రహ మేవచ."

తా. శరీరమే రథము, ఆత్మ రథికుడు, సారథి బుద్ధి, మనస్సే కళ్ళెము.

ఇంద్రియాణి హయానాహు ర్విషయాగ్ స్తేషు గోచరాన్
ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః

తా. ఇంద్రియములే గుఱ్ఱములు, విషయములే సంచార స్థలములు, మనస్సు ఇంద్రియములతో గూడుకొన్న ఆత్మ భోక్తయని పెద్దలు చెప్పిరి.

యస్త్వ విజ్ఞానవాన్ భవత్య యుక్తేన మనసా సదా
తస్యేంద్రియా ణ్యవశ్యాని దుష్టాశ్వాయివ సారథేః.

తా. మనస్సును స్వాధీనమందుంచుకొనక, ఎవడు జ్ఞానహీనుడగునో వానికి; ఇంద్రియములు, మనస్సు స్వాధీనములు కావు. దుష్ట గుఱ్ఱములు సారధిని, రథికునికూడ' పడగొట్టునట్లు; స్వాధీనము కాని ఇంద్రియములు మనోబుద్ధులను నాశము చేయును.

ఇంద్రియములు, మనస్సు, బుద్ధి యీ మూడింటిలో ఇంద్రియములు ప్రకృతి కాలములో సామాన్య జనులందరిలో మిక్కిలి బలిష్ఠములుగా నున్నవి.

ఏలయన? నవి(పశుజన్మములనుండి) అనేక జన్మలనుండి మనవెంట వచ్చుచున్నవి. బహు కాలముగా స్వేచ్ఛా ప్రవర్తనముచే మనస్సును లోబరచుకొని ధిక్కరించి యున్నవి.

పురుషుడెంత తెలివి గలవాడైనను, యెంత ప్రయత్నము చేయుచున్న వాడైనను క్షోభసేయు స్వభావము గల ఇంద్రియములు బలాత్కారముగా వాని మనస్సును హరించుచున్నవి.

ప్ర. ఇట్టి ప్రమాదకరమగు ఇంద్రియములు ఎట్లు స్వాధీనము అగును? మనస్సును అవి యేలాగున లోబరచుకొన్నవి.

ఉ ఇంద్రియముల దోషము యేదియనగా,— రాగద్వేష పురస్సరముగా వాని వాని విషయములను గూర్చి వెళ్లుచుండుటయె.

గీ. 3 అ. 34 శ్లో.

శ్లో॥ ఇంద్రియ స్యేంద్రియ స్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ
తయోర్న వశమాగచ్ఛే త్తౌ హ్యస్య పరిపంథినౌ.

అ. మనస్సు చేరని యెడల ఇంద్రియములకు ప్రవృత్తి లేదు. అవి మనస్సును తమలో నొకదానినిగా జేసుకొన్నదానివల్ల ఇంద్రియములను నిరోధింపలేక రాగద్వేషములు తనవిగా భావించును.

'స్పర్శన, దర్శన, శ్రవణాదులచే' తాకుట, చూచుట, వినుటచే విషయ సంయోగము గల్గిన క్షణమందే యేలాటి ఆలోచన చేయక, విచారించక, యే విషయమును గ్రహించుచు భోగించును లేక విసర్జించును.

ఇట్టి ఆతురభావమునకు "ఔత్సుక్య మని పేరు."

యీ ఆతుర భావములకు వశపడ గూడ దనియే గీతా వాక్యము బోధ చేయుచున్నది.

కావున,— నియమ మనే సూత్రవిధియే యిందుకు ఉపాయము. అనగా,— నియమించుటయే యని అర్థము.

ప్ర. ఇంద్రియముల నెట్లు నియమించవలె.

ముకుందమాల.

జిహ్వే కీర్తయ కేశవం మురరిపుం
చేతో భజ శ్రీధరం

పాణి ద్వంద్వ సమర్చ యాచ్యుతకథా
శ్రోత్రిద్వయ త్వం శృణు
కృష్ణం లోకయ లోచన ద్వయ హారే
ర్గచ్ఛాంఘ్రి యుగ్మాలయం
జిఘ్రి ఘ్రాణ ముకుంద పాద తులసీం
మూర్ధ న్నమా ధోక్షజమ్.

ఇట్లు యింద్రియ వ్యాపారముల నన్నిటిని భగవానుని సేవారూపముగా నర్పింప వచ్చును.

ఇంక నొక యుపాయమున్నది. లేకపోలేదు. మనస్సు చే ఇంద్రియముల ఆతురభావములను అనగా,– యే భావము మనస్సున కలుగునో, దానిని విమర్శించినగాని ఇంద్రియములచే చేయరాదు.

ఇట్లు అభ్యాసము చేయగా,– క్రమముగా మనస్సు ఇంద్రియముల కన్నను ఆత్మకు సన్నిహిత మైనది.

కావున,— ఇంద్రియముల నతిక్రమించుటకు శక్తి కలుగును.

"ఇంద్రియేభ్యః పరం మనః"

కావున,— ఇంద్రియముల నికృష్టత్వము అప్పుడు తెలియగలదు.

'రావణాసురుడు శ్రీరాముని బాణములచే క్రిందఁబడి ప్రాణములు విడుచు తరి యింతకాలము బ్రతికిన యీరావణుని అనుభవ మెట్టిదో? తెలిసికొనవలయునని, శ్రీరామచంద్రమూర్తి వానిదగ్గరకు వెళ్లి నీ అనుభవ జ్ఞానమువలన మాకేమి చెప్పగలవని యడుగగానే వాడు యిట్లు చెప్పెనట.

అయ్యా! రామచంద్రా! నేను త్వరపడి అశుభ కార్యముల చేసితిని. తామసించి శుభకార్యముల చేయ లేనివాడనైతిని. నావకాశమే లేకపోయిన దనెనట.

కావున,— తక్షణం చెడుగు చేయవలెనని తలంచుట ఇంద్రియముల పనియే.

అప్పుడు కొంచెము తాామసించితి మేని ధర్మ పరివర్తనకు కారణ మగును.

కావున, గొప్ప పదవి గల దనుకొనువారు యీ రావణ వాక్యమును మనస్సులో నుంచుకొని యుండవలయును

తమ చేతిక్రింద పని జేయువారు యేదో ఒక చిన్న తప్పిదమొ, (నేరమొ) చేయుదు రనుకొనుడు; పదవి గలవారే కాదు. భార్య; భర్త విషయమున, కుమారుడు; తండ్రి విషయమునగాని, ఆలాటి సమయమున తక్షణమందు ఉదయించిన ఆగ్రహము నిరోధింపని యెడల తమ చేతిక్రింది వారికి గొప్ప చెడుగు గలుగును. ఆ క్షణకోపము తీరువరకు నిరోధించి చూచిన యెడల, నేర మంత గొప్పది కాదనియు, తన కోపమునకు తగినంత జరుగ లేదనియు తోచి దండన తగ్గిపోవును. అప్పుడు న్యాయముగా పరివర్తించుటకు సాధ్యమగును.

యేబది కోట్ల సంవత్సరములు లంక నేలిన రావణుని గతి శుభోద్దేశములు నెరవేర్ప నవకాశము లేదనినచో సామాన్య జీవితముల గతి యేమి?

లోపల దాగియుండు అశుభ వాసనలు బయటఁ బడి, శుభ వాసనలను భంగపరుపకుండ చూచు చుండవలె.

శుభకార్యములు శీఘ్రముగ చేయవలె.

తాత్కాలిక నిరోధముచే క్రమక్రమముగా ఇంద్రియ జయము కలుగ గలదు.

గీ. 6 అ. 24 శ్లో.

శ్లో. సంకల్పప్రభవాన్ కామాం స్త్యక్త్వా సర్వానశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః

అ. అన్ని కోరికలను వదలి మనస్సును సాధనగాయుంచు కొని యోగము చేయవలయును. యీ ఇంద్రియనియమమునకు గొప్పపాండిత్యముగాని, గొప్పకులమునుగాని, పురుషత్వముగాని

అవసరము లేదు. మనోదారుఢ్యమున్న చాలును.

ఇట్టి దారుఢ్య మున్న మనసే భగవానుని చెందగలదు.

ఇట్లు భగవానుని యందు సఖ్య మెక్కుడగు కొలది భగవద్దాస్యము అత్యంత సుఖప్రద మగును.

'ఆయన ప్రభువు. నేను దాసుడ' నను భావముచే సర్వాహంకారములు నశించి శుద్ధుడగును.

'శ్రీ రామకృష్ణ పరమహంస గారు' సహితము కాళీ మాయి దాస్యము నా కానంద మనియు, 'కాళిదాసాదులు' అమ్మ దాస్యమే మా సాంమ్రాజ్య మనియు నుడివిరి.

'శ్రీ శంకరాచార్యుల వారు' సహితము దాస్య భక్తి అధిక మని తన 'శివానంద లహరి' యను గ్రంథము నందు వ్రాసి యున్నారు.

4\. శ్లో. సహస్రం వర్తంతే జగతి
విబుధాః క్షుద్రఫలదా
నమన్యే స్వప్నే వా తదనుసరణం
తత్కృత ఫలమ్
హరి బ్రహ్మాదీనామపి
నికట భాజా మసులభం
చిరం యాచే శంభో శివ
తవ పదాంభోజ భజనమ్.

తా. ఏదో కొంచము ఫలమిచ్చెడు దేవత లెందరో గలరు. వారి సేవ, వారిచ్చు ఫలములు నాకు గావలయు నను నపేక్ష స్వప్న మందైనను లేదు. ఒద్దు; ఓ యీశ్వరా! ఎల్లప్పుడును నీ సన్నిధాన పరులైన బ్రహ్మాదులకు సహితము దొరకని నీ పాద సేవయే దయచేయుము. మిమ్ము పదే పదే వేడుకొనుచున్నాను. బ్రహ్మాదులకు సన్నిధానము లభించియు, గొప్పవార మను భావముచేత దాస్య భక్తియందున్న రుచి వారు యెరుగరు.

సంఘమునందు కొందరు తమలో తాము గొప్పవార మనుకొని మానవసేవ మాధవసేవ యనుట మరచి 'సేవ' అను పదమునకు 'నీచ' మను అర్థము గావించుకొని తోటి మానవులను వైషమ్యభావము వదలి సేవ జేయుట లేదు.

కూటికై పరుల సేవ జేయుటయే గాని, నిష్కామము గా నిరహంకారముగా ప్రాణికోట్లకు మేలుచేయుటయే 'సేవ, యను నది మరువకూడదు.

భగవంతునికైనను సేవ ఫలాపేక్షతో చేయుట స్వార్థ మే యగును.

అట్టి సేవకు కించిత్ఫలమే

కాని,- ఆయనయందు మనస్సు ద్రవీభూతము కాదు

పరమేశ్వరుని యందు మనస్సు లయింపఁ జేయని యోగములేల? సేవలేల? పూజలేల? నిష్ప్రయోజనము కాదా? కావున నే, 'గీతామాత' యిట్లు బోధించుచున్నది.

గీ 6 అ. 47 శ్లో.

శ్లో. యోగినామపి సర్వేషాం మద్గతే నాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతేయో మాం సమేయుక్త తమో మతః.

నాయందే మనస్సును నిలిపి, నన్నే సేవించువాడు పైన చెప్పఁబడిన 'యోగు' లందరి కన్నను గొప్ప వాడని నా యభిప్రాయము.

నిష్కామ భక్తియు; దాని యంగముగా నిష్కామ సేవయు ఫలప్రదము లనియు, సుఖకరము లనియు, అనుష్ఠింప యోగ్యము లనియు; 'బైబిలు, కొరాను, భగవద్గీత' వ్రాసిన 'విన్నకోట వెంకటరత్న శర్మగారు' తమ గ్రంథమున వ్రాసి యున్నారు.

కావున,— స్నేహితుని యందును భగవానుని చూడ వలె. అప్పుడె సఖ్య భక్తియందు రసగ్రహణము చేసిన వాడగును. యిదియొక మార్గము.

వైద భక్తి యొకమార్గము,

శ్లో॥ వైధ భక్త్యధికారీతు భావావిర్భావనావధి
అత్రశాస్త్రం తథాతర్క మనుకూల మపేక్షతే.
(భక్తిసారామృత సింధువు.)

ఈ వైధభక్తి శాస్త్రముల మీదను, అనుకూలతర్కముల మీదను, ప్రశ్నోత్తరములచే విమర్శన కాగలదు.

సాధన చతుష్టయ సంపత్తి ద్వారా సాధువైన వాని జేరి భగవత్ప్రతిపాదిత ప్రశ్నల నడుగ వలయును.

'గీత' యందును ఇట్టి భక్తి ముఖ్య మనియే తెలిపిరి.

**గీ. 4 అ. 34, 35 శ్లో**

శ్లో. తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ దర్శినః.

శ్లో. యత్ జ్ఞాత్వాన పునర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి.

తత్వమును సాక్షాత్తుగా చూచి నటువంటి మహానీయు నొద్దకు వెళ్లి నమస్కారము చేసి, ప్రశ్నచేసి వారు చెప్పి నటువంటి విషయమును విశ్వాసముతోటి అనుసరించిన మర లా ప్రాపంచక విషయ దర్శనమే గలుగదు. అపుడు సమస్త భూతములయందును యేకత్వ దృష్టి కలుగును.

ఇట్టి ప్రత్యక్ష జ్ఞాన, భక్తి, వైరాగ్యముల బోధించు టకు బ్రహ్మ సాక్షాత్కారము పొందిన వారే కావలయును. అట్టి మహానీయులే 'ఋషు' లన బడుదురు.

పూర్వ యుగములందు ఋషులు ప్రపంచమున బాహా టముగా తిరుగుచుండెడివారు. సామాన్య జనులకు కూడ కన బడెడివారు. అవసరము వచ్చినప్పుడు రాజ సభలకు కూడా వచ్చి ఎప్పటికప్పుడు సలహాలుకూడా చెప్పినట్లున్నది. 'వేద వ్యాసులు, నారదులు' మొదలగువారు జిజ్ఞాసుల వెదకి జ్ఞానోప దేశము చేయుచుండెడివారు. ఇప్పటి యుగమున అట్టి గురు వులు అరుదు. జిజ్ఞాసువులు అరుదు.

ఇట్టి క్లిష్ట పరిస్థితులలో మనము తొందర పడకూడదు. తొందరపడి యెవరినైనను సరె ఉపదేశముపొందిన చాలునని అభిలషింపకుడు, ప్రమాదపడకుడు.

ప్రపంచ వ్యవహార ములకై తార్చు గురువులు సహితము వుండుట గలదు. కావున,- "శాస్త్రభక్తి"యందు యీ ప్రమాదములు తగుల కుండునటుల చూడవలయును.

వైదభక్తి అనుకూల తర్కములపై ఆధార పడి యున్నది. పరమ శాంతిని సొమ్మెయున్నది.

ఇట్టి "శాస్త్రభక్తి" జ్ఞానము ఉపదేశించుటకు లక్షణములు చాలని వారిని ఆశ్రయించుట కంటె; భగవంతుని నీ సంబంధ జ్ఞానము నాకు దయచేయు మని మనఃపూర్వకముగా వేడుటగాని; 'శంకర, రామానుజ, మధ్వాచార్య, రామకృష్ణ పరమహంస, గాంధీ' ఇత్యాది మహాపురుషుల నాదర్శకముగా నుంచుకొని మన జీవితముల చక్కఁబరచు కొనినచో చాల వరకు శ్రేష్ఠము.

'నారదులు' భక్తిసూత్రములలో సహితము,

9 సూ. "తదేవ సాధ్యతాం తదేవ సాధతాం"

'ఉత్తమ భాగవత సాంగత్యమునకై ప్రయత్నింపుము' 'మధ్యముల నాశ్రయింపకుము.' భాగవతమునందును

శ్లో. తస్మాద్గురుం ప్రపద్యేత జిజ్ఞాసుశ్శ్రేయ ఉత్తమం
శాబ్దేపరేచ నిష్ణాతం బ్రహ్మణ్యుపశమాశ్రయం.

తా. బ్రహ్మనిష్ఠ లేనివాడు జ్ఞానమునొసగ యోగ్యత లేనివాడనియు; వేదము వేదార్థము తెలియనివాడు సంశయముల ఛేదించి బోధజేయ నేరడనియు 'శ్రీధరస్వాములవారు' వ్యాఖ్యానమున వ్రాసిరి,

ప్ర. గురువుల పలుకులు సత్యములా?

ఉ. కాదు కాదు సత్యాసత్యము తెలిసిన పరమ గురువులమాట విశ్వసనీయమే. తన ఆ విద్యా సంబంధము నుండి

విడువబడి, సత్య జ్ఞానానంద ఆత్మ జ్ఞానము పొందుటకు శాస్త్రము, యుక్తి, గురు వాక్యము ప్రమాణములే. కాని,- తన లోపల భగవత్సాక్షాత్కార సిద్ధిని బడయుటకు స్వానుభూతియె పరమ ప్రమాణము.

బంధము, మోక్షము, తృప్తి, చింత, ఆరోగ్యము, ఆకలి తనకు తానే తెలిసికొనగలడు. ఇతరుల కవి అనుమానము చేత వేద్యము.

'శృతు'ల వలె అనగా,— వేదము వలె గురువులు కూడా తటస్థితులయ్యే బోధింపగలరు

అనగా,— గట్టున నుండి ఉపాయములు చెప్పగలరు.

కావున,- ఈశ్వ రానుగ్రహము చేతనే విద్వాంసుడు సంసారము నుండి తరింపఁగలడు.

ప్ర. ఈశ్వరానుగ్రహము సంపాదించు టెట్లు?

ఉ. ఇదివరకే చెప్పఁబడి యున్నది: అయినను ప్రభువు తన 'గీతా' శాస్త్రమున ఈశ్వ రానుగ్రహ మార్గములు కొన్ని తెలిపిరి.

గీ. 13 అ. 25 శ్లో.

శ్లో. ధ్యానేనాత్మని పశ్యంతి కేచి దాత్మా నమాత్మనా
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాప రే.

కర్మయోగము చేత కొందరు, భక్తి యోగముచేత కొందరు, జ్ఞాన యోగము చేత కొందరు భగవంతుని తెలిసి కొనుచున్నారు.

'భగవానుని అనవరతము ధ్యానించు వారు తప్పక ఆయన కరుణకు పాత్రులగుదురు.'

'కరుణాపాత్రుని యావల నుంచునో, తనలో కలుపు కొనునో' మనము నిర్ణయించగలమా?

'గీత'లో చెప్పిన ప్రమాణము చూడుడు.

గీ 12 అ. 8 శ్లో

శ్లో. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః.

గీ. 8 అ. 14 శ్లో.

శ్లో. అనన్యచేతా స్సతతం యోమాం స్మరతి నిత్యశః
తస్యాహం సులభః పార్థ నిత్య యుక్తస్య యోగినః.

8 శ్లో. నాయందె మనసు వుంచుము. నాయందు బుద్ధిని స్థిరముచేసి కొమ్ము. అటులగునేని పిమ్మట నాయందే నివసింతువు. దీనియందు సంశయ మేమిలేదు.

14 శ్లో. అభ్యాస యోగమున నన్ను (ఎల్లప్పుడు) సర్వ కాలముల యందును నన్ను స్మరించునట్టి వారలకు నేను సులభుడను.

ప్ర. సర్వ కాలముల యందు సాధారణ మైన వారికి కష్టముగదా?

ఉ. అవును. సాధారణముగా మనలో మనము, మన మనస్సును సర్వ కాలముల యందు భగవానుని యందు వుంచ వలెనని ప్రయత్నము చేయుదుము. కాని — నూరుపాళ్ళ మనస్సు పరమాత్మపై మరలుట సాధ్యము కాదు. కొందరికి బిడ్డలవెంట కొంతసేపు, భార్యయందు కొంతసేపు, సంసార కార్యములయందు కొంతసేపు, ధనముపై కొంతసేపు, వ్యవహారములపై కొంతసేపు, ఇతరులను చెరచుట యేలాగని కొంతసేపు, నేను ధనవంతుడను యేలాగున అగుదునా యని కొంతసేపు, సాధునింద కొంతసేపు, స్త్రీల నింద కొంతసేపు, బంధు నింద కొంతసేపు ఈలాగున అనవరతము మనస్సు విభాగములై పోవుచుండెడివారు.

భగవానుని చింతించుటకు అవకాశముదొరకుట చాలా దుర్లభ మను విషయము నిజమే.

స్వల్ప అవకాశము మొదట భగవచ్చింతనకు అల వాటు చేసిన యెడల అది క్రమక్రమముగా బలపడును.

ఉదాహరణము.

'శ్రీరామకృష్ణ పరమహంసగారి' వద్దకు 'సురేశబాబు' అను నాతడు వచ్చి యీలాగున ప్రశ్నించినాడు.

సు: స్వామిజీ! నాకు భగవంతుని చింతించుటకు ఒక క్షణమైనను తీరుబడి లేదు. నాగతి యేమగును?

రా: భయము అవసరము లేదు. నన్ను మూడుసార్లు అనుకొనుము.

సు: నాకంతమాత్రము అవకాశము కూడా లేదండి. నాకున్న వ్యవహార ధర్మము అటువంటిది.

రా: పోనీ రెండుసార్లు అనుకో!

సు: అదికూడా తీరుబడి కాదండి.

రా: పోనీ ఒకపర్యాయము అనుకో?

సు: నావల్ల కానేకాదండీ. తీరుబడి లేనేలేదండీ.

రా: అయినను ఒక వుపాయము చెప్పెదను గ్రహించు.

సు, ఏమి చెప్పెదరు?

రా: నీ వేపని చేయుచున్నను "రామకృష్ణ! నీప్రీతి కొరకే" నని చేయుము అని మందలించిరి.

నాడు మొదలు 'సురేశుడు' యేమిపని జేయు చున్నను యిది 'రామకృష్ణుని ప్రీతికై చేయుచున్నాను' అని అనుకొన సాగినాడు.

'రామకృష్ణుని' ప్రీతికై చేయు కార్యములు చెడువను లైనచో ఆయన ప్రీతి యగునా? యని తోచినది.

క్రమ క్రమముగా చెడు కార్యములు మానినాడు. వాని జీవితములో మార్పు కనబడినది.

సర్వకాలముల యందును "ఈ కార్యము రామకృష్ణునికి; యీకార్యము రామకృష్ణునికి" అని చేయుచుండగా,— అనవరతము రామకృష్ణ స్మరణ మనస్సున నాటుకొని యే కార్యము చేయ బోయినను; 'రామకృష్ణుడే సాక్షాత్కరింపసాగెను' దృఢ విశ్వాస మేర్పడెను.

తర్వాత రామకృష్ణ పరమహంస గారి సన్నిధికి వచ్చి స్వామిజీ! నే నెంతో విశ్రాంతిని బడసియున్నా నని చెప్పెను. స్వామి సంతసించిరి.

కావున,— పరమాత్మ 'గీత'యందు,

గీ. 9 అ. 27 శ్లో.

శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం.

అర్జునా! నీవు యేమికార్యములు చేయుదువో, యేమితినుచున్నావో, యేమి వ్రేల్చుచున్నావో, యేమి యిచ్చుచు

న్నావో, నీవు యేమివ్రత మాచరింతువో, యేమిపూజింతువో అవన్నియు నాకర్పణగావింపుము.

అనగా— నీవుచేయు లౌకిక, వైదిక కర్మలన్నియు నేను చేయుచున్నట్లు భావింపుము. లేదా, సర్వకర్మఫలంబుల నాక ర్పింపుము; నీక ర్తృత్వము వదలిపెట్టుము

భగవంతుని స్మరణ సులభముగా గలుగుట కయినను అహంకారము నశించుటకయినను యింతకంటెను చక్కనిమా ర్గము కానరాదు.

'వసుదేవుడు' "పాండవగీతలో"

శ్లో. కాయేనవాచా మనసేంద్రియైర్వా
బుద్ధ్యాత్మనావా ప్రకృతే స్స్వభావాత్
కరోమి యద్య త్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయామి.

నేను మనోవాక్కాయ కర్మలచేతను, ప్రకృతిస్వభావము చేతను యేకార్యములు యెప్పు డెప్పుడు చేయుచుందునో అది

అంతయు పరాత్పరు డగు శ్రీమన్నారాయణునకే అర్పించు చున్నాను.

మనలో నిట్టిమార్పు యెప్పుడుగలుగునో, అన్నియు భగవంతునికై చేయుదునను భావము యెప్పు డుదయించునో, నా నాటికి పాపసంకల్పములకు స్వస్తి చెప్పుదుమో, కర్తృత్వ అభిమానము లెన్నడు మనకు స్వస్తి చెప్పునో ఆనాడు; అనవరతము ప్రభుస్మరణము చేయగలము. అట్టిస్మరణ చేయుధన్యులు యేగమ్యస్థానమును చేరిరో, అట్టిఅమృతస్థానమును మనము తప్పక చేరగలము; పొందగలము. అనవరతస్మరణకై మానవు లనేక మార్గములు నవలంబించుచుందురు. ప్రతిదినమును కొన్నినిమిషములో, లేక కొన్నిగంటలో ధ్యానమునకు నిర్ణయించుకొని తక్కినకాలము ధ్యానఫలమునకు విరుద్ధకార్యములందు ప్రవర్తించుచుండిన ధ్యానము ఫలవంతముకాదు.

సాధారణదినచర్యలో అనగా, మన మాచరించు లౌకిక కార్యములయందు సహా మనస్సు యేకాగ్రతలేనివాడు కార్యసాఫల్యమును పొందలేడుగదా? ధ్యానమనగా, కన్నులుమూసి

కొని జపముచేయుటగాదు. బాహ్యముగా మనమనస్సును పోనీయక పరమాత్మను ధ్యానించుటే ధ్యానము. యిట్టివానికే భగవానుడు సులభుడు. యిట్టివాని విషయముననే భగవానుడు,

గీ. 12 అ. 7 శ్లో.

శ్లో. తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరా త్పార్థా మయ్యావేశిత చేతసాం.

మృత్యురూప సంసార బంధమునుండి అట్టి వానిని శీఘ్రకాలమున నుద్ధరింతును.

ప్ర. నిరంతరము ధ్యాన మనినచో, మొదట నిది మిగుల కష్టమే. ఎట్లు?

ఉ. ప్రారంభ దశలో కొన్ని నిమిషములు కన్నులు మూసి ధ్యానించుటకు అభ్యాసము చేసి, క్రమముగా సర్వ కాలముల యందు చేయుట దృఢపడ వలయు, ఎల్లకాలము కన్నులు మూసి కొని కూర్చుండుట కాదు, ఏ వస్తువును

చూచినను ఈశ్వరుని రూప మని మనస్సున స్ఫురించిన యెడల ధ్యానము సిద్ధించినట్లే.

ఇట్టివానినే భగవానుడు ఉద్ధరింతు నను ప్రమాణము ఆచరించెను.

ఇంక కొందరు భగవానుని స్ఫురణ కలుగుటకు నామములు, తులసి పేరులు ధరింతురు.

'శైవు' లైనచో విభూతి, రుద్రాక్షమాలలు ధరింతురు.

'శ్రీ రామానుజా చార్యుల వారు' చక్రాంకితము లని యేర్పాటు గావించి వ్యాప్తిఁ జేసియున్నారు.

'చక్రాంకితము' అను పేరున అనవరతము భగవంతుని జ్ఞాపకార్థము గావించిరి.

తులసి పేరుల కన్నను, తిరునామముల కన్నను చక్రాంకితము శ్రేష్ట మనిన్నీ, తైలధార వలె భగవానుడు చి

తనయందు నిలుచుటకు యింతకన్న వేరుఉపాయము లేదనియు అనవరత చింతనాపరుడు మరణకాలమునందును మరువ డనియు వారిముఖ్యాభిప్రాయము నిజముగదా?

గీ. 8 అ. 6 శ్లో.

శ్లో. యంయం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః.

మరణకాలమందు యెట్టి భావము గలిగిన, దాని కనుకూలమగు జన్మ జీవునకు రాగలదు.

"ప్రశ్నోపనిషత్తు"లో 'పిప్పలాదులు కౌశల్యు'నికి చెప్పుచున్నారు.

"యచ్చిత్తస్తేనైష ప్రాణమాయాతి ప్రాణస్తేజ సాయుక్తః సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి"

తా. మరణకాలమున జీవుడు తనకున్న కోర్కెలు

చిత్తముచే చింతించి చింతించి ప్రాణ వాయువును పొందు చున్నాడు. అట్టి ప్రాణ వాయువు ఉదాన వాయువుతో చేరి, జీవాత్మకు శరీరాదులను కల్పించు చున్నది.

కావున,- 'రామానుజాచార్యులవారి' అభిప్రాయము బాగున్నది. కానీ, మధ్య కొన్ని భావ భేదములు జనించినవి.

చక్రాంకితము చేసినంత మాత్రము చాలును. నడవడి గాని, భగవచ్చింతనగాని, చిత్తశుద్ధిగాని, యేమి అవసరము లేకయే, మోక్షము కరతలామలక మని; యీ చిహ్నములే చాలు; 'నిన్ను కృతార్థునిని' చేయు నని చెప్పెడి సామాన్యుల బోధలచే మానవులు పాపభీతి లేక వ్యభిచార, సురాపాన, పరదార హరణములతోసహా నిరాఘాటముగా చరింపసాగిరి.

క్రమముగా పెద్దల అభిప్రాయములు సామాన్యులు గమనించని దోషమే యిట్టి అనర్థములకు మూలమగుచున్నది.

ఆలాగుననే శైవులు పరమ శివుని స్మరణ అనవరతము

కలిగి, తద్వారా మనో లయము గాంచ వలయునని; రుద్రాక్షమునో, లింగమునో మెడ యందు అనవరతము ధరించి యుండు మని శైవ సిద్ధాంతము యొక్క అభిప్రాయము.

కాని,— అచ్చటను భావభేదములు జనించినవి.

ఎన్ని పాపము లైనను ఆ రుద్రాక్ష, ఆ కట్టుకొన్న లింగము మన్నించు నను సిద్ధాంతము తీర్మానించుకొన్నారు.

ప్ర. పరమేశ్వరుడు పాపులనుగూడా రక్షించునందురే?

ఉ. రక్షించుట నిజమే. కాని,— బుద్ధిపూర్వకముగా పాప మాచరించి, ఈశ్వరుడు రక్షించు నను ధైర్యమున కేమైనను అర్థమున్నదా? తెలియక తప్పుచేసి, తెలిసి పశ్చాత్తాపపడి, యిక చేయ నని, సిద్ధాంతీకరించుకొని భగవచ్చింతన చేయు వానిని దేవుడు రక్షించు ననుట నిజము.

కావున,— మహనీయుల అభిప్రాయముల యందు గంభీరమైన భావము యిమిడి యుండును.

అల్ప హృదయులకవి విపరీతభావముగా మారుచున్నవి.

చిహ్నములను ధరించిన వారిలో 'పౌండ్రక వాసుదేవుడు' ఒకడు మోక్షమును చూరగొనిన విషయము 'భాగవతము'నందు గలదు.

సీ చక్ర గదా శంఖ శార్ఙ్గాది సాధను
కృత్రిమ కౌస్తుభ శ్రీ విలాసు
మకరకుండల హార మంజీర కంకణ
మణిముద్రికా వన మాలికాంకు
దరళ విచిత్ర పతంగ పుంగవ కేతు
చెలువొందు పీత కౌశేయ వాసు
జవనాశ్వ కలిత కాంచన రథారూఢుని
రణ కుతూహలు లసన్మణి కిరీటు

గీ ఆత్మసమ వేషు రంగవిహార కలిత
నట సమానుని బౌండ్రు భూనాథు గాంచి
హాసణా మిగురొత్త నవ్వె; పద్మాయతాక్షు
డంత వాడును నుద్వృత్తు డగుచు నడరి.

కం. వసజోదరు చిహ్నంబులు
గొనకొని ధరియించి పౌండ్రకుడు మచ్చరియై
యనవరతము హరి దన తల
పున గలుగుటఁ జేసి ముక్తి బొందె నరేంద్రా.

ప్రప్రథమమున ఈశ్వర చిహ్నములు భక్తికై ధరింపకున్నను, ఆ వాసుదేవుడే 'నేను, నే'నని ద్వైత చింత గలిగి మరణకాల మందును ఆవాసుదేవుని చింతన చేత దేహము చాలించినాడు. కావున, మోక్షమును పొందెను.

కావున,— భగవంతుని స్మరణ యెడతెగక తైల ధార వలె సాగవలయును.

భావశుద్ధి గలిగినచో చింతన తైలధారవలె సాగగలదు.

ప్ర. మానవుడు; అవిచ్ఛిన్నముగ భగవంతుని స్మరింపవలె నన్నచో ఆహార విహారముల గతియేమి?

ఉ. భగవంతుని స్మరించుటకు కాలనియమము లేదు ఆహార విహారములకు హాని లేదు.

ప్రహ్లాదుడు,

శా. పానీయంబులు ద్రావుచుం గుడుచుచుం
భాషించుచుం హాస లీ
లా నిద్రాదుల సేయుచుం
దిరుగుచుం లక్షించుచుం సంతత
శ్రీ నారాయణ పాద పద్మయుగళీ
చింతామృతా స్వాద సం
ధానుండై మరచెం సురారి సుతుడే
తద్విశ్వముం భూవరా.

ఇట్లు సర్వకాలముల యందు భగవన్నామము గావింప వలయు.

అట్లుగాక కొంత కాల మాచరించి, కొంత కాలము విషయ చింతనలకై వదలువారు; మృత్యువునోట బడుదు రే

గాని, భగవంతుని పాదార విందముల బడయజాలరు.

భాగవతమున,

సీ. వాసుదేవ శ్లోక వార్త లాలించుచు
గాల మే పుణ్యుడు గడుపుచుండు
నతని యాయువు దక్క నన్యుల యాయువు
లుదయాస్త మయముల నుగ్రకరుడు
వంచించి కొనిపోవు వాడది యెఱుగక
జీవింతు పెక్కేండ్లు సిద్ధమనుచు
నంగనా పుత్త్ర గేహా రామ విత్తాది
సంసార హేతుక సంఘ సుఖము

గీ. దగిలి వర్తింప గాలంబు తతి యెఱింగి
దండధరు కింకరులు వచ్చి తాడనములు
సేసి కొనిపోవ పుణ్యంబు సేయనైతి
బాప రతి నైతి నని బిట్టు పలవరించు.

కావున,— పెక్కేండ్లు జీవింతు మనుటకు వీలులేదు.

సౌందరానందము,

చ పగకొని త్రాచుపాము వలె
ప్రాణి జనించినదాది వెంబడిన్
తగిలి చరించు మృత్యువు
విధాతయు దానివశంబె యన్నచో
మిగిలిన భూత జాలము
ప్రమేయము జెప్పగ నేల? నిత్యమై
నెగడెడి దొండు లేదు?
కననేరదు? లోకము; కన్ను లుండియున్.

గీ. తల్లి యొడిలోని బిడ్డను తస్కరించు
బిగువు కౌగిలి తెగద్రెంచి ప్రియుల బాపు
నకట! మృత్యువు నిర్దయురాలు దాని
లీలమం బ్రతికారముల్ లేవు జగతి.

మృత్యువు విషయమున 'శంకరులు' సహితము
యీలాగుననే వచించిరి.

శ్లో॥ నిత్యం సన్నిహితో మృత్యుః.

ఎప్పుడును మృత్యువు దగ్గర నే యున్నవాఁడు.

ఇట్టి మృత్యువు యెక్కడనో నుండు ననియు, యెన్న డో వచ్చు ననియు నిశ్చయించువారి విషయ మిట్లుండును

సీ. కాలచక్రంబొక్క లీల దిరుగుచు నుండ
మృత్యువు తిన్నగ మ్రింగుచుండ
రోగశత్రువులట్లు మూఁగి కారింపగ
గాసి పెట్టగ దుఃఖ కంటకములు
వృద్ధత్వ మను పులి వెంబడింపుచునుండ
భోగంబు లను కళల్ బోవుచుండ
మోహ తురంగంబు మురిసి పరుగిడుచుండ
చింతాగ్ని మిక్కిలిఁ జెలగుచుండ

గీ. యేమి సుఖమని జనులింత తామసించి
మోక్షమార్గము దలపక మురియుచున్నాడు
యెప్రుడు విషయంబులను బొంద నెంచుచున్నాడు

అయ్యా! నీనామ స్మరణ గావింపకుంద్రు
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ.

కావున నే,— 'త్యాగరాజాదులు'

(నామ కుసుమములచే పూజించె నరజన్మమె జన్మము మనసా) అని గానము జేసినారు.

'సక్కూబాయి, మీరాబాయి, జనాబాయి' వీరందరు భగవానుని నామ కుసుమములచే పూజించి తరించినవారె.

నామోచ్చారణ; అనునది, కేవలము అభ్యాసము చేయునది అనిన్ని, అంతగొప్ప స్థితిని నామము చేత పొందుటకు వీలుకాదనిన్ని. కొన్నిదుర్భావములు సంఘమునందు ప్రబలిన కాలముననే; 'బంగాళా దేశములో నవ ద్వీప పట్టణమందు 'శచీ, జగన్నాథు' లను పుణ్యదంపతులకు శ్రీకృష్ణ భగవానుడే గౌరాంగబాలుడై వెలిబడి, నామ సంకీర్తనా యోగమును స్థాపించి; ఆతన్మయత్వమున తాను మునిగి, ప్రజల నందరిని తన్మయుల గావించి నామ ప్రభావమును తెలియఁజేసి పావు

లను సహితము నామ సంకీర్తనా యోగముచే పవిత్రులం గావించిరి.

నాటినుండి నేటివరకు సంకీర్తనా సప్తాహములు సంకీర్తనా ఏకాహములు అనే పేరున భక్తులు సాగించుచునే యున్నారు.

దానినే 'శ్రీ త్యాగరాజగారు'

(రామా నీయెడ ప్రేమరహితులకు నామము రుచిదొరకునా)

అని గానము చేసినారు.

విదురుడుకూడా,

"హరే రామ హరే రామ హరే ర్నామైవ కేవలం
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా"

ఈ కలియుగమున భగవన్నామము తప్ప వేరు గతి లేదని చెప్పిరి.

భగవన్నామము మిక్కిలి శ్రేష్ఠ మని చెప్పుటచే పాపములు చేయుచు భగవన్నామము పాడుచుండిన రక్షింపజాలదు.

సకల వేదమయుడు. భగవంతుడు.

ఆయనకు, ఆయన నామమునకు భేదము లేదుగదా!

కావున,— సర్వ వేద సారము భగవన్నామము.

'శంకరాదు'లకు వలె దృఢ విశ్వాసము ఏ మానవునకు గలుగునో, వాడు; అదృష్టవంతుడు. సర్వ విషయములయందు అవిశ్వాసము కుదురుట గలిగినచో వాని జన్మము ధన్యము.

కాశీ బ్రాహ్మణునికి; శంకరులు,

"నహి నహి రక్షతి డుకృఞ్ కరణే

భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢమతే"

శ్లో. గేయం గీతా నామసహస్రం ధ్యేయం శ్రీపతిరూపమజస్రం
నేయం సజ్జన సంగతి రనిశం దేయం దీనజనాయచ విత్తం.

మానవుని కర్తవ్యములు అనవరతము భగవంతుని కీర్తించుట. ఎల్లప్పుడు పరమేశ్వరుని పొందుటకై ప్రయత్నించుట. సజ్జనులతోటి సహవాసము కావించుట. పేదల యందు దానగుణము ఉపయోగపరుపుట.

'శంకరులు' యీలాంటి ప్రతిములతోటి భగవన్నామము కీర్తన జేయుమని కాశీ బ్రాహ్మణునకు చెప్పిరి.

బ్రా. స్వామీ! భగవత్సంబంధమగు గుర్తొకటి యుండిననే స్మరణ కలుగు ననియు; లేనిచో ప్రపంచమున భగవన్నామ స్మరణ కలుగుట దుస్తర మనియు పెద్దలవలన వినియున్నాను.

శంక. అయ్యా! నిశ్చయమే. ప్రతి మతము వారును యేదో యొక ప్రతీకము నుంచుకొనియే యున్నారు. 'ఉత్తర గీత'యందు శ్రీకృష్ణభగవానులు నుడివిన వచనమును వినుడు.

ఉత్తర గీత.

శ్లో. అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతం
ప్రతిమా స్వల్ప బుద్ధీనాం సర్వత్ర సమదర్శినాం.

అ. ద్విజాతులకు; అగ్ని దైవమనిన్ని, మునులకు; హృదయమందె దైవమనిన్ని, అల్పబుద్ధిగలవారలకు; మృణ్మయాది ప్రతిమలు దైవంబులనిన్ని, తత్వవేత్తలకు, సమదర్శకులకు, మహాభక్తులకు అంతటా దైవమె గలడనిన్ని వచించిరి

'శ్రీశంకరాచార్యుల' ధ్యానమును చూడుడు, పరమ భక్తిపరవశులై,

67 శ్లో. బహువిధ పరితోష భాష్పపూర
స్ఫుట పులకాంకిత చారు భోగ భూమిమ్
చరపద ఫలకాంక్షి సేవ్యమానాం
పరమ సదాశివ భావనాం ప్రపద్యే.

అ. ఆనంద భాష్పములు, రోమాంచనము మొదలగు

భక్తిభావముల కాలవాలమై; నిరంతరము కైలాసము గోరు వారి కాశ్రియణీయమైన ఈశ్వర ధ్యానము చేయుచుందును.

శ్లో. జనన మృతియుతానాం సేవయా దేవతానాం
న భవతి సుఖలేశ స్సంశయో నాస్తి తత్ర
అజని మమృత రూపం సాంబ మీశం భజంతే
య యిహ పరమ సౌఖ్యం తేహి ధన్యాలభంతే.

అ. ఇతర దేవత లందరును జనన మరణములు గల వారు. అట్టి క్లేశము గలవారిని సేవించు వారలకు విషయానంద మైనను తృప్తిగా దొరకదు. ఇది నిశ్చయము. పార్వతీ సమేతుడైన పరమేశ్వరుడు; జనన మరణములు లేని వాడును, పరమసౌఖ్య ప్రదుండును గావున శరీరవంతులై యుండగనే శివునిసేవించువారు కృతార్థులై మోక్షానందమును పొందుదురు.

'శ్రీ రామకృష్ణ పరమహంస గారు' ధ్యానము నందు నిమగ్నుడై తనకు గలిగిన అనుభవముల నీలాగు చెప్పి యున్నాడు.

"దక్షిణేశ్వరాలయము నందలి కాళీమాతను పూజిం చుటకును, అర్పణలు చేయుటకును సాధ్యము కాకపోయినది నా స్థితిం జూచి దేవాలయపు యజమాని నన్ను మందలింప సాగెను. అప్పుడు నా కెంతమాత్రము దోషము వచ్చెడిది కాదు వాని మందలింపులు విని నవ్వెడు వాడను."

అని తన ధ్యాన ఫలమును తెలిపి యున్నారు.

ధ్యానమునందు యెంతెంత వృద్ధి యగుచుండు నదియు మన మనోగత వృత్తుల వల్ల తెలియు చుండును. అప్పుడప్పు డైనను కోపతాపములు కలుగుచున్నచో; మనము యింకను ధ్యాన సౌధమును యెక్కలేదని మనలో మనము వితర్కించు కొని దినదినమును కాలమువృధపుచ్చక ప్రయత్నించవలయును

గీత. శ్లో. శనైశ్శనై రుపరమే బుద్ధ్యాధృతి గృహీతయా
ఆత్మసంస్థం మనఃకృత్వా న కించి దపి చింతయేత్.

ధైర్యమవలంభించ మనస్సును మెల్లమెల్లగా విషయ ములనుండి మరల్చి భగవంతునియందు చేర్చుట కలవాటు పడవలయు అన్యచింతలు రానీయక యుండవలయు.

ప్ర. మానవునకు యే చింతయు లవలేశమైనను లేక యుండినచో శారీరక యాత్ర యెట్లు జరుగవలయు?

ఉ. మానవులు; సాధారణముగా అనేక చింతలలో మునిగియుండుట నిజమే, తాము చింతించినగాని కార్యములు జరుగవని వారి నిశ్చయము.

సీ. నిదుర లేచిన కాది నిదుర బోయెడిదాక
భవ జలనిధి లోన బాధపడుచు
వ్యవహార చింతయు వ్యాపార చింతయు
కూరగాయల చింత కూటి చింత
కొమ్మలపై చింత సొమ్ములపై చింత
సుతులు లేరను చింత బ్రతుకు చింత
ధనముపై చింతయు దాయాది చింతయు
పశువులపై చింత పసిడి చింత

గీ. యిన్ని చింతలలో బడి తన్నుకొనుచు
అవియె సుఖమని యెంచును అధము డొకడు
నిన్నుగాంచక చచ్చునో కన్నతండ్రి
సుగుణ సంభావ్య సర్వేశ సుప్రకాశ.

ఈలాగున చింతలే మనస్సునిండా చేరినవాడు ఈశ్వరు

నారాధించలేదు.

ఇట్టి చింతలుమాని యీశ్వరు నారాధించు వాడు కృతార్థుఁడు కాగలఁడు.

కావున నే,– 'గీతాదేవి' యిట్లు ప్రబోధించు చున్నది.

గీ. 9 అ. 22 శ్లో.

శ్లో. అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహం.

అ. ఇతర చింతలు లేక, నన్నే ఆశ్రయించిన వారి యోగక్షేమములు అనగా (యోగమన లేనిదానిని చేకూర్చుట) యని యోగక్షేమ మితరులపై ఆధార పడక భగవంతునిపై గల సంపూర్ణ విశ్వాస ముంచి ఆయన యందే తన సమస్త బాధ్యతలు వుంచినచో వారే చూచెదరు.

"గోరాకుంబా' రను పండరి భక్తులలో ఒకడు; అనవరతము భగవంతుని చింత సేయువాడు.

అదిచూచి కొందరు అసూయ గలవారు 'వీనిని యేలాగైనా వూరినుండి గెంటించ వలయు' నని ఆలోచన జేయుచుండిరి.

వీని పేరు 'గోరా కుమ్మరి' గ వున వీనికి 'గోరాకుంబా' రని పేరు. ప్రతిరోజు కుండలను జేసి, యిలువరుస పరికారము యిచ్చి, వారిచ్చు కొద్ది డబ్బుతో గాలము గడుపును.

ఆవూరియందు దేవీ వుత్సవము జరుపు వాడుక గలదు. ఆవుత్సవమునకు మన కుంబారుడు యింటికి పదికుండల వంతున యిచ్చిననే గాని సంవత్సరమునకు అతని కియ్యవలసిన మామూళ్లు యియ్యరు.

కావున,— వాడు పుట్టిని అధికముగా చేర్చియుంచి భగవంతుని ధ్యానము జేయుచుండెను.

అసూయ గల వారందరునూ కలసి యొక తీర్మానమును చేసికొనిరి.

'ఈసంవత్సరము కుండలు వీడు మనకు యియ్యవని లేదు. మనము వీనికిచ్చు ఆదాయము యియ్య పనిలేదు. తిండికి లేకున్నచో వీడు భగవంతుని వస్తుండి ధ్యానించ గలడా? చూతము'

అని తీర్మానించి దీనికి ఉపాయము వెదకిరి. యేమని?

'ఒక మాసము రోజులు యితర గ్రామమునకు మేము చెప్పిన పనిమీద వెళ్ల వలయు'నని చండశాసనముగా ఆజ్ఞా పించి యీ నెలలో ఆవుత్సవము వచ్చును వీడు వూరిలో లేడని కుండలు యియ్య లేదని ఆదాయము యియ్యరు. వీని పని అంతటితో సరి. అని ఆలోచించి కుంబారుని వూరినుండి పోవు నట్లు చేసిరి.

ఉత్సవము వీడు వెళ్లిన ఆ రోజునే తిరునాల ప్రారంభమైనది.

ఊరివారు; 'కుంబారుడు కుండ లియ్యకపోవుట యేమి వాడు సత్యవాది, ధర్మపరుడే యెచటికి పొయినాడో! తెలి

యదే?' అని వాని యింటికడకువచ్చి చూచునప్పటికి కుంభా రుని యింటికిబీగములు వేసియున్నవి.

ఆహా యెంత భయములేదు. మాకందరకు కుండలు యెవరు యిత్తురు వాడు వచ్చిన వేతనములు యియ్యకుడు.

అని తీర్మానించుకొని తమతమ యిండ్లకు వెడలిరి.

ఎచ్చట నున్నను మన కుంభారునికి భగవంతుని చింతిం చుటే పని. 'ఉత్సవము వచ్చునే? కుండలు యియ్యకున్న వర మానము వుండదే? నాజీవనము యేలాగా?' అనే భావము లేనేలేదు.

వీని స్థితి యిట్టిది. ఊరివారి స్థితి అట్టిది. తెల్లవారితే అమ్మవారి తిరణాల.

ఆరాత్రి ఊరివా రందరు; దీపములు పెట్టువారు, దండ లు కట్టువారు, అలికెడివారు, ముగ్గులు తీర్చువారు, యిండ్లకు పచ్చని తోరణములు కట్టువారునై యుండిరి.

'మధ్య మధ్య కుండలు లేవే! యెంతపని భంగమయి పోయినది' అని విచారించుచుండిరి.

ఇంటి కెన్నెన్ని కుండలుకావలయునో అన్నన్ని కుండలు భగవానుడు; తాను కుంబారుని వేషముధరించి కుండలుమోసి తెచ్చి యిచ్చి అదృశ్యుడై వెడలి పోయినాడు.

ఊరివా రందరు ఆశ్చర్యపడి 'తెల్లవారి వానియింటికి బీగములు వేయబడియున్నవి. మాసమురోజులుగా వ్రాయుందు లేడు, కుండలు యెప్పుడు చేసినాడు?' ఆహా వాడు నిజముగా భక్తుడు.

పరమేశ్వరుని నిజముగా నమ్మినవానికి యేమి కొదువ లేదని; వానిని పిలువనంపి, కొనియాడి భక్తిభిక్ష పెట్టు మని ప్రార్థించిరి.

వాడును; "పరమేశ్వరు నారాధించి తరించుడు" అని చెప్పి సమస్తములచింతలోనుంచుకొనక భగవన్నామము జేయు

డని చెప్పి తాను భగవంతుని సేవించి కృతకృత్యుడైన వాడు గోరాకుంబారుడు."

కావున,— తన కేమి కావలయునో, సర్వజ్ఞమూర్తి పరిభువు ఆయనకు తెలియదా? మనము కోరవచ్చునా?

'గీత'యందుసహితము (కృపణాఃఫలహేతవః) అన్నారు

'కోరువాడు మిగుల కృపణుడు'

ఫలమును కోరక కర్మ చేయుటయే కర్మ యోగ రహస్యము.

గీ 12 అ. 47 శ్లో.

శ్లో. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మ ఫలహేతుర్భూ ర్మాతే సంగోస్త్వ కర్మణి.

కర్మ చేయుట యందు నీకధికారమే గాని, ఫలము

గోరుట యందు అధికారము లేదు. ఫలము యెన్నడును నీ కోరికపై రా కూడదు. కర్మ చేయకయు నీవు వుండగూడదు

ప్ర ఫలము కోరనివాడు కర్మ యేలచేయవలయును?

ఉ. అట్లు కర్మ మానువాడు శుష్క వేదాంతి యగును. మానవుడు; కర్మచేయక నిమిషమైననువుండగలడా? భోజనము చేయడా? నిద్రించడా? చేతులు కాళ్లు కదిలించడా? రెప్పలు వేయడా? ఉశ్వాస నిశ్వాసములు బీల్చడా?

కావున్న,- సంధ్యావందన, దేవ పూజ, పిత్రు కర్మలు తనకు యిష్టపడకపోయినచో వదలగలడు గాని, పైఁబేర్కొన బడినవి మానగలడా?

కావున,— అన్నియు ఈశ్వ రా ర్పణ బుద్ధితో మానవుడు చేసితీరవలయు నని భగవానుని శాసనము.

యే కర్మ కే ఫలము చేకూర్ప వలయునో; సర్వజ్ఞుడైన పరమాత్మకే తెలుసును.

మానవకోట్లలో తంగడ్డ వేసి తులసిచెట్టు కాగలదను మూఢ విశ్వాసములు ప్రబలిపోవుచున్నవి.

పరుల కపకారము చేయడం, పరమేశ్వరుని తనకు సుఖమిమ్మని కోరడం, పరుల సొమ్ము అపహరించడం, తన సొమ్ము భద్రముగా నుండవలె ననికోరడం, పరుల భార్యలను కోరడం. తన భార్య పతివ్రతగా నుండవలయునని కోరడం, పరుల కీర్తిని చెడగొట్టడం, తాను కీర్తివంతుడై యుండ వలయుననికోరడం యీలాటి కోరికలు సాధారణ మానవుల యందు నాటికి నేటికి ప్రబలి పోవుచున్నవి.

చేయుట వొకటి, కోరుట యింకొకటి యీలాటి పొర పాట్లు వుండుననే భగవానుడు ఫలము కోరగూడ దని ఆజ్ఞా పించి యున్నాడు.

కావున,— బుద్ధిమంతులు ప్రతిఫలము కోరక పుణ్య కార్యములు చేయుచుందురు.

ప్ర. పుణ్యకార్య ఫలము సహితము కోరగూడదా?

ఉ. ఎంత వెఱ్ఱిప్రశ్న, తాము చేయు పుణ్య కార్య మునకు ఫలము కోరు సనకోనుము, పాపకార్యఫలము వద్దని సను తప్పునా? పాప కార్య ఫలముకోరునా? కోరడు. ఒకనిని కొట్టి నన్ను వాడు మరల కొట్టవలయునని యెవ్వరుచుకోరరు. అయినను అది తప్పదు. పుణ్యఫలము తప్పనదికాదు. పాప ఫలము తప్పనదికాదు.

అన్న దాన ఫలము గోరువాడు కట్టెల యం దున్న పురుగులు, కూరల యం దున్న పురుగులు యెన్నియో జీవా ణువులు చచ్చును, వంట జేయునపుడు పదార్థములను కడిగించునపుడు యేమైన అనృత దోషము కలిసి యుండును. యీపాప ఫలము కోరడు. అన్నదాన పుణ్యము మాత్రము కోరును. కాని పాప ఫలము వెంబడే యుండును.

కావున,— యేకర్మ చేసినను ఫలమును కోరక సార్థ కముగా చేయవలయును. కాని యియ్యది సులభముగాదు.

అన్నదానమేకాదు; యేదానము జేసినను, యేపాత్ర

ములాచరించినను ప్రతిఫలముగోరకపోవుటయేకర్మరహస్యము.

మన సంఘములయందు తుదకు పీఠాధిపతులు సహితము ప్రతిఫలము గోరక జ్ఞానదానము జేయుటలేదు. ఉందు రను కొనుదు; వారు అరుదు.

సర్వ పితయై, సర్వ జనానంద దాయకుడై, సర్వ జీవ రక్షకుడైన పరమేశ్వరుని జెందెడు మార్గములు పరస్పరము బోధించు కొన వచ్చునుగదా; అట్లు బోధించుటకై ప్రతి ఫలాపేక్షయా? పరమేశ్వర ఆజ్ఞాభంగముగాదా? భగవదాజ్ఞ లను నెరవేర్పనివాడు ఆయన కరుణకు పాత్రుడగునా? భర్త యాజ్ఞ నెరవేర్పని భార్యయందు భర్తకు ప్రేమ యుండునా? తండ్రి యాజ్ఞ నెరవేర్పని పుత్రునియందు తండ్రికి ప్రేమ యుండునా? గురువు మాట నెరవేర్పని శిష్యునిపై గురువుకు ప్రేమ యుండునా? కావున,— ఫలమును గోరుట నీకధికారము లేదు. చేయుటయే అధికారమని భగవానుడు ఆజ్ఞచేసి నప్పుడు యింకను కోరుచుండిన అర్థమున్నదా?

'స్వామివివేకానందులు' విదేశముల కేగినప్పుడు తాను ప్రతి ఫలాపేక్ష లేక జ్ఞానదానము గావించిరి.

ఆవిషయమును తెలుపుపద్యములు 'వెంకటగిరి' ఆంధ్రోపాధ్యాయులు వ్రాసినవి.

సీ. అజ్ఞాన తమముచే నావృతంబైన యొ
        క్కనియంతరంగ మార్గమ్మునందు
    విజ్ఞాన భాస్కరా విర్భూత కిరణమ్ము
        నొండైన వ్యాపింప నోపుదేని
    ధర్మసమ్మూర్మథత దరిగానలేని నా
        యాత్మసోదరునికి హర్షమొదవ
    సత్యధర్మముల నిస్సంశయదృష్టినొ
        సంగి జీవింపగ జాలుదేని

గీ. దుర్భర విచార వహ్నిదో ధూయమాన
    చిత్తుడగు నొక్క సోదరు చెక్కిలిపయి
    జారు కన్నీరు దుడుపంగ జాలుదేని
    నాదు జన్మము సఫలము గాదె వసుధ.

సీ. సత్యదూరుండయి చనియెడు నొకసహో
దరునకి సత్యతత్వంబు దెలిపి
ఆతని హృదయకుకం జాతములో ధర్మ
జిజ్ఞాస పొడసూప జేసితేని
రహిని రోజాపుష్ప రాజి కోమలమునై
యకలుషితమునైన యాత్మలోన
స్వాత్మవివేకము సత్యసుందరముల
ప్రీతిని నొలి స్థాపింతునేని

గీ. తన హృదయమందె స్వర్గ దైవతమును
గలవనెడు బుద్ధి నొకనికి గలుగునట్లు
చక్కగా బోధనము చేయ జాలుదేని
నాదు జన్మము సఫలము గాదె వసుధ.

సీ. అనవరతము నాదు మనమున బాధించు
భయసంశయమ్ముల బారద్రోలి
సత్య దయా ప్రేమ సాధకమ్ముగ నాదు
జీవితమ్మును జేయ జాలుదేని

విజ్ఞానమును నభి వృద్ధి నమ్మికయు ను
త్సాహములను వెద జల్లి ధరణి
మానవ సంతతి మానసికాంధత్వ
శాప ముక్తులఁ జేయు జాలు దేని

గీ. కష్టములు తగ్గునట్లుగ క్రిమముతోడ
ప్రజకు విశ్వాస సుఖములు ప్రబలునట్లు
సాయమును నేను జేయంగ జాలు దేని
నాదు జన్మంబు సఫలంబు గాదె వసుధ.

ఇట్లు తన జన్మ సాఫల్యాత కొరకు పర దేశముల కేగి జ్ఞానదానము జేయుచు యీలాగున పలికిరి.

తమోగుణము నందును, అజ్ఞానము నందును మునిఁగి యున్న నా భారతీయుల వారి పాదములపై వారిని నిలువ బడునట్లు చేసి, నిష్కామ కర్మ యోగాభ్యాసమును వారి హృదయముల యందు రగుల్చ జేసితి నేని, నే నానందముగా వేయి నరకముల లోని కైనను పోయెదను.

నేను 'శ్రీ రామ కృష్ణ పరమ హంస' గారి యొక్క గాని, మరియొక దాసుడను గాని గాను.

ఎవడు తన భక్తి ముక్తి చూచుకొనక యితరుల భక్తి ముక్తికై ఫలాపేక్ష వదలి సేవ జేయునో వారికే భృత్యుడను.

ఇట్టి స్వార్థత్యాగిగదా భారతమాతకు ప్రియ పుత్రుడు.

కావుననే,- భగవానుడు తన 'గీతా' గానము నందు కర్మ ఫల త్యాగము చాలా గొప్పదని, నిష్కామ జ్ఞానము నిష్కామ యోగము, నిష్కామ తపస్సు, నిష్కామ భక్తి, నిష్కామ కర్మ, నిష్కామ దానము అన్నియు నిష్కామ ముగా యున్నచో. అనగా కర్త తాను కాదనెడు భావ మున్న యెడల సుఖముగా జీవయాత్ర గడప గల డనియు సెలవిచ్చెను.

ఒక కవి యిట్లు వ్రాసి యున్నాడు.

చ మన గృహమొక్క సత్రముసుమా
మన మందరు బాటసారులై
చన గరుణాను బంధమున
చక్కగ నిచ్చిన ఆలుబిడ్డలన్
మనకు నొసంగగా మరచి
మాధవుజేరక నిత్య భోగులై
తనవిగ నెంచు ద్రోహిని కృ
తఘ్నుని మెచ్చునె శౌరి మిత్రమా.

కావున,- అన్నిటికన్నను కర్మఫలత్యాగము గొప్పదని,

గీ. 12 అ. 12 శ్లో.

శ్లో. శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మ ఫల త్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరం.

కాబట్టి,- యోగా భ్యాసముకన్న జ్ఞాన యోగమును,

జ్ఞానముకన్న ధ్యానయోగమును, దానికన్న కర్మ ఫలత్యాగము గొప్పది.

'త్యాగమునకు మోక్షమే ఫల' మనిరి.

త్యాగి కాని వాడు జ్ఞాని కాజాలడు. ధ్యానము చేయజాలడు. యోగము చేయజాలడు.

త్యాగి గానివాడు జీవకోట్లను ప్రేమింప గలడా? జీవకోట్లను ప్రేమింప లేనివాడు భగవానుని ప్రేమించి స్మరించ గలడా?

ఇచ్చట నొక యితిహాసము గలదు.

'ఒక సాధువు నొక ధనవంతుడు' ఒక పర్వతయాత్రలో కలిసికొనిరి. పోవునప్పుడు ధనవంతుడు సాధువును జూచి

ఏమండీ సాధు గారు! తాము యెచ్చటికి కేగుచుంటిరి?

'సాధు పలుకలేదు.'

'ఏమండి సాధూ! పలుక రేమి?

సాధు: పలుక కేమి; తామెచ్చటి కేగుచుంటిరి?

ధన: తిరుపతి యాత్రకు; సాధూ! తాముతిరుపతి కేనా?

సాధు: అవును.

ధ: తమ కేమైన మ్రొక్కుబడియున్నదా?

సా: లేదు.

ధ: పిచ్చివాడా! మ్రొక్కుబడి లేకపోయినచో యెం దుకు నీవు పోవడం? వూరక డబ్బుకర్చు.

సా: సర్వ జీవ దయాళుం డగు భగవంతుని దర్శించి వచ్చెదను.

ధ: ఎంత డబ్బు తెచ్చినారు?

సా: పలుకలేదు.

పర్వతము సమీపించిరి. ఎచ్చటఁ జూచినను వాద్యములే. యెచ్చటఁ జూచినను భగవన్నామ సంకీర్తనాసక్తే చూచుచు పోవుచుండిరి.

కాళ్లు లేనివారు, కన్నులు లేనివారు, చేతులు లేనివారు, నడుపలేనివారు, ముసళ్లు, ఆ పర్వత యాత్రికుల నాశ్రయించి తమ స్వల్ప జీవితములను గడుపుచుందురు.

అట్టివారిని చూచి సాధువు తన వద్దనున్న రొట్టెను వారిలో కొందరికి యిచ్చెను.

ధ: సాధూ! రాత్రికి నీవు వుంచుకొనక యీ పాప జీవులకు యిచ్చెదవేమి? వీరు యెంతో పాపము చేసి అనుభవించుచున్నారు. వారు అట్లు అనుభవించవలసిన దానిలో నీవు సహాయపడితివేని ఆ పాపము నిన్ను జెందును. కాకను

యెట్టివారికిగాని దానము చేసినచో మరల జన్మమునకు హేతు వగును. నీవేమి సాధువు, మరలజన్మ కేల ఆస్పదముగావించు కొనెదవు. యెవరి పాపము కొలది వారు అనుభవించ వలెనే గాని సహాయ మనునది చేయ కేరాదు.

సాధువు; ఆ ధనవంతునిజూచి నవ్వి, యేమియు బదులు మాటలాడ లేదు, కానీ భగవానునిమాత్రము ఒకపర్యాయము దయామయా! అని మాత్రము స్మరించెను.

ధనవంతుడు ఒక కాసైనను ఆ అనాధలకు యివ్వ లేదు. మీదుమిక్కిలి ఈకొండకు రావలయునంటె యిదే యమబాధ యీ మొక్కు చెల్లించుకొని వెళ్లినచో యింక రానే రాను, అనుచు బయలువెళ్లు చుండెను.

సాధువు, ధనవంతుడు యిద్దరు గమ్యస్థానము జేరిరి.

సాధువు; స్వామి పుష్కరిణిలో స్నానము చేసెను.

ధనవంతుడు; పుష్కరిణీ నీళ్లలో చాలా కశ్మలముగా

యున్నది. దేహారోగ్యము చెడును. అని అచ్చట పైపుల్లోని నీళ్లను తెప్పించి కాచి స్నానము చేసెను.

సాధువు భగవానుని దర్శించి ఆనందభాష్పములురా లగా హేప్రభో! నీ రూపమును జూడ నాకు సర్వేశ్వరుడవని తోచుచున్నదే గాని. మరేమియు కాదే యని ధ్యానించెను.

ధనవంతుడు స్నానము జేసి పట్టువస్త్రము ధరించుకొని గూపాయయెందు కండి కర్పూరహారతికి అని అచ్చటివాళ్లతో మాట్లాడుచు వచ్చునప్పటికి సాధువు ధ్యానసమగ్నుడై కొంత సేపుండి కన్నులు తెరచి పరమేశ్వరా! నీరూపముఅతిచిత్రము.

శ్లో. విష్ణుశ్చేద్భవదీయ మూర్ధ్నికజటా జూటస్య కిం కారణం
శంభుశ్చేద్ధృత శంఖచక్రవిలసద్బాహోశ్చ కిం కారణం
బ్రహ్మచేచ్ఛ్రుతివాక్య మంచిత ముఖస్యైకస్య కింకారణం
చిత్రం తావకరూప మీదృశ వహో శ్రీ వెంకటేశప్రభో.

హేవిభో! నిన్ను విష్ణువని చెప్పుటకు తలపైన జటాజూ టము లున్నవి. అట్లుచెప్పుటకు వీలులేదు.

శంభుడవందునా? చేతులయందు శంఖచక్రము లున్నవి అట్లు చెప్పుటకు వీలులేదు.

బ్రహ్మ వందునా! నాలుగు వేదములు బలుకుటకు నాలుగు ముఖములు లేవు.

ఒక ముఖమున్నది గాన, నీ రూప మిట్టిదని చెప్పుటకు వీలులేదు చిత్రముగానున్నది.

శ్లో, దేవశ్చే త్ప్రతి శుక్రవాసర కృతస్నానంచ కిం కారణం
దేవీ చేద్ధృతి సంస్థితాబ్జ నిలయా వాసస్య కిం కారణం
తేజశ్చేత్ప్రతి దృశ్యమాన శుభ దాకారస్య కిం కారణం
చిత్రం తావకరూప మీదృశ మహో శ్రీవేంకటేశప్రభో

నిన్ను 'పురుష విగ్రహ' మని, 'దేవు' డని యెంతునా? ప్రతి శుక్రవారము నీకు పసుపు, పన్నీరు స్నానమేల? కారణ మేమి?

దేవి యని యందునా! వక్షస్థలమున కమల వాసిని

యగు లక్ష్మియేల? కారణమేమి?

కేవల తేజస్స్వరూపమని యెంతునా? కన్నులకలంకార ముగా అర్చా మూర్తివై కానబడుచుంటివే? ప్రభో.

కావున,— చిత్రము నీ రూప విభవము తుద కన్నియు నీవని ప్రబోధించుటకై యిట్టి రూప ధారివై భక్తుల ముక్తుల జేయుదే,

అని సాధువు భగవంతుని పరిపరి విధముల ప్రార్థన జేయుచుండ,— ధనవంతుడు మొక్కులు అన్ని చెల్లించి అన్ని చోట్ల జగడములాడి, అలలి, యిన్ని మొక్కులు చెల్లించిన వారికి యింత ప్రసాదము ప్రాప్తి యియ్యగూడదా? అని తెప్పించుకొని, తిని, సాధువు యున్న చోటికి వచ్చి, సాధూ ప్రొద్దు పోవుచున్నదే, నేనొంటరిగా పోలేను, తోడు కు మనిషిని మాట్లాడుట యెందులకు, నీవు వున్నావుగదా? వచ్చె దవా? అని మందలించినాడు.

సాధువు తిన్నడా? లేదా? అని విచారించలేదు. తోడు

కై సాధువును పిలిచినాడు.

సా. అయ్యా! వచ్చినపని అంతయు జరిగినదా?

ధ: అయినదికాని, ప్రసాదము మాకుసరిగ యియ్య లేదండి.

సా: సరే పోవుదమా?

ధ: పోవుదము.

యిద్దరును బయలుదేరిరి.

దారివెంట నున్న పేదలనుజూచి ధనవంతుడు; యిట్టి వారిని చూచిన నాకు చాలా అసహ్యమండీ సాధుగారు.

సా: ఇవన్నియు కూడా ఈశ్వర కళలే. మన హృదయమును కరుణచే నింపజేసినపుడే యిట్టి వారికి సహాయము జేయగలము. ఎంతవరకును మన హృదయము కఠినమైయుండునో అంతవరకు పరసహాయ మను నది మనకు కానరాదు.

ధ: సాధుజీ! ధనవంతులు పుణ్యులని, బీదలు పాపులని నా అభిప్రాయము. నీవేమందువు.

సా: (నవ్వి) అయ్యా! పరుల కుపకారము జేయువాడు పుణ్యుడు. పరులకు అపకారము జేయువాడు పాపి.

ఇట్లు మాట్లాడుచుండగా ధనవంతుడు కాలుజారి దడ దడ దడ దడ దొర్లి క్రింద పడెను. సాధువు వెంటనే దిగి అతనిని పట్టుకొని తగిలిన గాయములు తుడిచి కట్లుకట్టెను.

ధ: అయ్యా! నీవు లేకుండిన నేను చచ్చియుందును. నీకెంత కరుణ, నేను నాజన్మలో ఒకరికి అపకారమే జేసి యెరుగుదును గానీ ఉపకారము జేసి యెరుగను. యెంత పాప జీవిని నా పాప పరిహార మెట్లు? నే నెంత స్వార్థ పరుడను, ధనమదాంధుడనై బీదలు పాపులు, సాధువులు సోమరులు, స్త్రీలు కాముకులు అని యవ్వన గర్వము, ధనమత్తతచే యిట్లు పలికితిని. నన్ను మన్నించువా రెవరు. నన్ను ఆపత్తు నుండి తొలగించితిరి. మీరే నాపాలి దైవము అని పల్కెను.

సాధువు; దనవంతుని చూచి నాయనా వెరువకుము.

క. మది యనెడు మొద్దు కత్తిని
పదనిడుటకుగాను భక్త వత్సలు డాగి నా
పద యను సానను నూరును
తుదిలో అజ్ఞానమనెడు తుప్పు దొలగగాన్.

నీ అజ్ఞానము తొలగించుటకు భగవానుడు నీకు యిట్టి కష్టమును ప్రసాదించి యున్నాడు. కావున నీవును నీ కృతజ్ఞత దైవముకడ జూపవలయును.

ధ: అట్లయిన మరల కొండకు పోదునా?

సా: వలదు మానవులందరు దైవకళలే. సర్వజీవులయందును దయా ప్రేమములుగలిగి స్నేహభావమున వర్తింపుము భగవన్నామము మిక్కిలి విశ్వాసపూర్వకముగా కీర్తించుము.

ధ: సాధూజీ! నే నెట్లుండవలయునో సెలవిండు, అలాగున నా జీవితము సవరించుకొనియెదను.

సా: అయ్యా! తాము మన్నుండు జీవితమునందున్న లోటుపాటులు సవరించుకొనిన గాని విశ్వాసముగా భగవన్నామము నుచ్చరింప జాలరు.

శ్లో. దాక్షిణ్యం స్వజనే దయా పరిజనే శాఠ్యం సదా దుర్జనే
ప్రీతిః సాధుజనే నయో నృపజనే విద్వజ్జనే చార్జవం
శౌర్యం శత్రుజనే క్షమా గురుజనే కాంతాజనే ధృష్టతా
యేచైవం పురుషాః కలాసు కుశలా స్తేష్వేవ లోక స్థితిః

బంధువుల యందు దాక్షిణ్యముతో నుండుటయు. సేవకుల యందు దయ, దుర్జనుల యందు వుదాసీనతయు, సజ్జనుల యందు ప్రీతియు, రాజుల యందు అనుసరణయు, విద్వాంసుల యందు శ్రిమ పరివర్తనయు, శత్రువుల యందు పరాక్రమమును, పెద్దల యందు ఓర్పు, స్త్రీలయందు దిట్టతనమును యేపురుషులు గనబరుతురో అట్టివారే లోక స్థితికి కారణ భూతులు.

అని 'భతృహరి' తన నీతి శతకమున మానవుని జీవి

తమున దిద్దుబాట్లను తెలియజేసియున్నాడు కావున అయ్యా నీ విట్టి గుణములను క్రిమముగా నార్జించి భగవద్ధ్యానము గావించిలివా ధన్యుడ వయ్యెదవు

ధ. సాధూజీ! మాపూరికిరండు; తమకు మఠముకట్టించెదను; కావలసినంత ధనసహాయము చేసెదను; నేను పొరబడినప్పుడు తాము దిద్దుచుందురు.

సా. అయ్యా! నాకుమఠమువలదు; సాధువులన్న అభిమానశూన్యులుగా నీ మతాభిమానము, ఘటాభిమానము, ధనాభిమానము, స్థలాభిమానము, పూజాభిమానము, వస్త్రాభిమానము. యిట్టి అభిమానములకు లోబడువాడు సాధువగునా?

ధ. అయ్యా! సాధూ! తమకు భార్యాపుత్రులుగలరా?

సా. అయ్యా! సాధువులు భార్యాపుత్రులు గలవారని తలంపవలదు; భార్యాపుత్రులుగలవారు గృహస్థులు.

ధ గృహస్థులు సాధువులుగా నుండరా?

సా. వుండకేమి; శ్రీ రామకృష్ణపరమహంస వలె భార్యాభర్త లిరువురును, దైవికజ్ఞాన సంపన్నులై, దైవనిష్ఠగలిగి భగవన్నామము భక్తిచే జపించుచు వారిరువురు సాధువు లయిరి. యిట్లు యెవరాచరించినఁచో వారుసాధువులే.

ధ. భార్యాభర్తలుయిద్దరు సాధువు లయినఁచో ప్రపంచమున ప్రజావృద్ధియెట్లు?

సా. అయ్యా! ఋతుకాలధర్మము ననుసరించి వేదసమ్మతముగా సంతానము బడిసిన తర్వాత దైవచింతగలిగి ప్రపంచ చింతవదలి సాధువులు కావచ్చును. గాంధీ మొదలగు వారు యిట్టివారేగదా?

ధ. గృహస్థాశ్రమ ధర్మంబు లెట్లు నడుపవలయును?

సా. గృహస్థపద్ధతికై నీకొక ఉదాహరణము చెప్పెదనువిను. ప్రవరాఖ్యుడను పవిత్ర గృహస్థు, అతని నడవడి వినుము.

సీ. వరుణా తరంగిణీ దర వికస్వర నూత్న
కమల కషాయ గంధము వహించి
ప్రత్యూష పవనాంకురములు పైఁ గొను వేళ
వామన స్తుతి పరత్వమున లేచి
సచ్ఛాత్రుఁడగుచు నిచ్చలు నేఁగి యయ్యేట
నఘమర్షణ స్నాన మాచరించి
సాంధ్య కృత్యము దీర్చి సావిత్రి జపియించి
సైకతస్థలి కర్మ సాక్షి కెరఁగి
గీ. ఫలసమిత్కుశ కుసుమాది బహు పదార్థ
తతియు నుదికిన మడుగు దోవతులు గొంచు
బ్రహ్మచారులు వెంట రా బ్రాహ్మణుండు
వచ్చు నింటికి బ్రజ దన్ను మెచ్చిచూడ.

అతని అపరిగ్రహ వ్రతముఁ జూడుడు.

శా. శీలంబుఁ గులముఁ శమంబు దమముఁ
జెల్వంబు లేఁ బ్రాయముఁ
బోలం జూచి యితండు పాత్రుఁడని
యే భూపాలుఁడీ వచ్చినన్

సాలగ్రామము మున్నుగా గొనడు;
మాన్య క్షేత్రము ల్వెక్కు చం
దాలం బండు నొకప్పుడుఞ్ దరుగ
దింటఞ్ బాడియుఞ్ బంటయుఞ్

వీరి చిత్తవృత్తి ననుసరించిన భార్య 'ధర్మపత్ని' యన తన శిష్టధర్మమనుసరించు భార్యకే ధర్మపత్ని యను నామము సార్థకము గాగలదు.

తే. వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
నతిథు లేతేర నడికి రేయైన బెట్టు
వలయు భోజ్యంబు లింట నవ్వారిగాగ.

శ్లో. అనుకూలా విమలాంగీ కులజ కుశల సుశీల సంపన్నాం
యే తేపంచలకారాం భార్యాపురుషః పుణ్యోదయాల్లభేత్.

పరిపరాత్పుని భార్య స్త్రీ ధర్మములు చక్కగ నెరిగిన యిల్లాలు.

అతిథి పూజ గృహస్థాశ్రమ ముఖ్య ధర్మముగావున,

తీర్థ సంవాసులే తెంచినా రనివిన్న
నెదురుగా నేగు ద వ్యాంతమైన
నేగి తత్పదముల కెరగి యింటికి దెచ్చు
దెచ్చి సద్భక్తి నా తిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులగా జేయు
జేసి కూర్చున్నచో జేరవచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు వనధి పర్వత సరి
త్తీర్థ మాహాత్మ్య ము దెలియ నడుగు

గీ. నడిగి యోజన పరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు నూర్పులు నిగుచ్చు
ననుదినము తీర్థ సందర్శ నాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరు ణాగ్నిహోత్రి.

ఇట్లు అనేక మంది తీర్థ వాసులు వచ్చుచుండుట గలదు, ఆ పావనగృహస్థునింటికి; ఒకదినమునందొక 'సిద్ధుడు' వచ్చుచుండఁ జూచి,—

తే. ఇట్లు చనుదెంచు పరమ యోగీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేగి ప్రీతిఁ దగుచు
నర్ఘ్యపాద్యాది పూజనం బాచరించి
యిష్ట మృష్టాన్న కలన సంతుష్టుఁ జేసి.

ఉ. వానిది భాగ్య వైభవము
వానిది పుణ్య విశేష మెన్నఁగా
వాని దవంధ్యజీవనము
వానిది జన్మము వేయుసేయ నె
వ్వాని గృహాంతరంబున భ
వాదృశ యోగిజనంబు పావన
స్నాన విధాన్నపానముల
సంతస మొందుచు బోవు నిచ్చలున్.

గృహస్థు ఈలాగున జెప్పగా నా సిద్ధుడు గృహస్థ
ధర్మము సక్రమమైనచో చాలా శ్రేష్ఠమని.—

సీ కొలకొలనున్న తంగేటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థ శాంభవపేటి

పండిన పెరటి కల్పకము వాస్తవ్యుఁడు
దొడ్డిఁబెట్టిన వేల్పు గిడ్డి కావు
కడలేని యమృతంపు నడ భావి సంసారి
సవిధ మేరునగంబు భవన భరిఁ
మరుదేశ పథ మధ్య మ ప్రప కులపతి
యాఁకటి కొదవు సస్యము కుటుంబి

తే. బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కా తిథి క్షపణకా వ
ధూత కాపాలి కా ధ్య నాథులకుగాన
భూసురోత్తమ గార్హస్థ్య మునకు సరియె.

ఆ సిద్ధుడు అనగా (యోగి) తీర్థ యాత్రా కుతూ
హలుడైన ఆ యుత్తమ గృహస్థుని మెచ్చి తన సిద్ధరసమును
ఆ ప్రవరాఖ్యుని పాదములకు రాచి; నీ మనస్సున తలచిన
ప్రదేశములను రస ప్రభావముచే జూడుము నాయనా! అని
చెప్పి సిద్ధుడు బోయెను.

ఈ సిద్ధ రస ప్రభావముచే మన ప్రవరుడు అన్ని తీర్థ

ములను సేవించక హిమవంతముజేరి విచిత్రముల జూచుచుండ పాదలేపము కరిగిపోయినది.

ప్రవరుని ప్రయాణము ఆగిపోయినది. చింతించి ఆ ప్రాంతముల త్రోవ వెదకుచు రాగా అచ్చట నొక గంధర్వ కాంత కానవచ్చినది.

ఆమెనుజూచి చేరఁజని దారియడుగ ప్రవరుని లావణ్యమునకు ఆకాంత మనస్సు కరిగి 'యీతని పతిగా బడసిన జన్మ సఫలత గాగల'దను భావముచే చూచి, కోరిక మనసునదాచి తెరవడిగిన వాని నుద్ధేశించి కృత్రిమ కోప మారోపించుకొని యిట్లు చెప్పినది.

ఉ. ఇంతలు కన్నులుండ తెర
వెవ్వరి వేడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర
నెపంబిడి పల్కరించు లా
గింతియకాక నీ వెరుగవే మును
వచ్చిన త్రోవ చేప్ప నీ

కింత భయంబులేకడగ
నెల్లిద మైతిమి మాటలేటికిన్.

తన కన్యత్వంబు తేటపరచి, తన మనస్సున నున్న వివాహాకాంక్ష వెలిబరచి ఒడబడ ప్రార్థించినది.

ప్రవరుడు; తన గృహస్థ బ్రహ్మచర్య దీక్షయు, ఉత్తమ ద్విజుడు గావున అగ్నిహోత్రుని యందు తన కుండు భక్తియుఁ దెలుపుచు,—

మ. తరుణీ రేపును మాపు హవ్యములచే
తం దృప్తుఁడౌ వహ్ని స
త్కరుణా దృష్టి నొసంగు సౌఖ్యము
లెరుంగన్ శక్యమే నీకు; నా
కరణుల్ దర్భలు సగ్నులుం బ్రియము
లైన ట్లన్యముల్ గా వొడల్
తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛ సుఖముల్
మీసాలపై దేనియల్.

వరూధిని; పరివరాఖ్యుని జూచి. మీ అగ్నిహోత్రములు, మీ యజ్ఞములు, యాగములు స్వర్గప్రాప్తి కేగదా? మా గంధర్వాంగనా సౌఖ్యము స్వర్గమునకంటె తీసిపోయెనా? యెందరు మునులు తమ నిష్టలు మాకై సమర్పించిరో. చూడుము.

సీ వెలిబెట్టిరే బాడబులు పరాశరు బట్టి
దాసకన్యాకేళి తప్పుజేసి
కులములో వన్నె తక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక జుట్టరికము
ననుపుకాడై వేల్పు నాగవాసము గూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహల్యా
జారుడైన జంభాసురారి

తే వారికంటెను నీ మహాత్మ్యంబు ఘనమే
పవన పర్ణాంబు భక్షులై నవసి యినుప
కచ్చడాలుగట్టుకొను ముని ముచ్చులెల్ల
తామరస నేత్రలిండ్ల బందాలుగారె.

ఇట్లు చెప్పి యా వరూధిని యా సద్గృహస్తునిపైఁ బడ నుంకించిన,— నియమగరిష్ఠుడు గావున ఇంద్రియ లోలుడుగాక తానారాధించు అగ్నిహోత్రుని ప్రార్థించెను.

మ. దివిషద్వర్గము నీ ముఖంబునన తృప్తింగాంచు నిన్నీశుగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగ దంతర్యామివి నీవ యా
హవనీయంబును దక్షిణాగ్నియును నీయం దుద్భవించుం గ్రతూ
త్సవ సంధాయక నన్ను గావగదవే స్వాహా వధూ వల్లభా.

ఇట్లు ప్రార్థించి ప్రతిజ్ఞ జేయ సమకట్టెను.

ఉ. దాన జపాగ్ని హోత్ర పర తంత్రుడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేని బరదార ధనాదుల గోర నేని స

న్నామనముతోడ నన్ను సద
నంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధి లోన గృంకకయ
మున్న రయంబున హవ్యవాహనా

ఇట్లు అగ్నిహోత్రుని ప్రార్థింపగానే అతనికి తోోన గానుపించినది. తనకు యెంత జవసత్వములు కావలయునో అంతయు కలిగినది. పరమేశ్వరుని కరుణ గలవాని కేమి కొదువ? యిల్లుచేరి తన భగవన్నిష్టల సలిపెను.

కావున గృహస్థాశ్రమ ధర్మరక్షణకూడా ధీరుడే యింద్రియ నిగ్రహుడే ఆచరించగలడు.

భ: సాధూజీ! యింతశక్తి వీని కెట్లు కలిగినది?

సా: అయ్యా! వింటివిగదా అగ్నిహోత్రునియందు అతనికిగల విశ్వాసము.

విశ్వాస మన నెట్టిదనిన,— "శ్రీ రామచంద్ర మూర్తి

లంకలో ప్రవేశించుటకు పూర్వము సముద్రము మీద వంతెన కట్టవలసి వచ్చెను. కాని, విశ్వాస సంపన్నుఁడగు హనుమంతుడు తనకు రామునిపై గల విశ్వాసము సాధనగా గొని, ఒక గంతులో సముద్రము దాటిపోగలిగెను "

కేవలము విశ్వాసముచేత స్వామికన్న సేవకుడు ఘన కార్యము జేయగలిగెను.

ధ: సాధూజీ! తాము చెప్పుచున్నారు గాని అంత గొప్ప విశ్వాసము నా బోటి కెట్లు సాధ్యపడును. ధన వ్యయము జేయుటయనిన నాకు చాలా కష్టముగా దోచును. ధన మనగా ప్రాణ మని నా అభిప్రాయము.

సా: అవును మానవుని కామ లోభములు వంచించుచున్నవి, ధనముచే దేహ సంబంధ భోగములకు మరిగి యిట్లగుటకు కారణము.

స్వామి 'గీత'యందు.-

గీ. 2 అ 44 శ్లో

శ్లో. భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృత చేతసాం
వ్యవసాయాత్మికా బుద్ధి స్సమాధౌ నవిధీయ తే.

పూర్వోక్త విషయముననే అనగా భోగ, ఐశ్వర్యము లలో చిక్కి. మనస్సు దానిచేత పూర్తిగా ఆకర్షింపఁబడి కార్యాఽకార్యముల నిశ్చయించు బుద్ధి స్థిరముగా నుండక చపల పడుచుండును.

కావున,— నీవు చపల పడుచున్నావు.

ధ: సాధూజీ! తమ బోధచే ధనము లోభినాశ్రయించి యుండునని తోఁచుచున్నది.

సా: కాదు— పొరబడకుము. ధనమువల్ల యేమియు దోషములేదు. బుద్ధి నంటియున్న కామినీ, కాంచన వాసనచే మానవుడు మారుచుండునేగాని, ధనమువల్లగాదు. క్రమముగా యీవాసనలు దొలగించవలయు.

అట్టి తొలగిన ఆ ధనమే; బీదసాదలకు, దేశభక్తులకు నుపయోగించ గలదు.

లోకమున యెన్ని కార్యములు ధనమువల్ల కావలసి యున్నవి. కావున,- యీ కన్ను, కాలు లేనివారు పాపు లని తాము మొదట పలికితిరి. యిట్టి బీదలే లేకున్న తమ ధన మునకు సద్వ్రియ మెక్కడిది? బీదల నాదరింపుడు.

ధ: సాధూజీ! వీరందను పాపు లని తలచితిని. గాని, నా పొరపాటు సవరించితిరి. సవరించుకొంటిని.

సీ. కూటికై బీదలు కుయ్యోడు చుండగ
మూడుపూటలు దిని మురియు టెట్లు
వసియింప బీదకు వసతి లేకుండగ
మేడలపై నుండి మెలగు టెట్లు
మరుపుట్టములులేక నిరుపేద లుండగ
ఘన దుకూలములను గట్టు టెట్లు
దుమ్ములో దమ్మిట దొరలుచు నుండగ
పట్టు మెత్తలమీద బండు టెట్లు

గీ. అకట జగమందు బీదల యార్తనాద
ములు వినబడుచు నుండగ మాధురీతి
జూడనేరను సాయంబు నేడు జేతు
మానవుని సేవె మాధవు సేవయనుచు
బలుకుచుండెడి మీదగు పలుకు నేను
విని కృతార్థుడ నైతిని వేయునేల.

కీర్తన.

1 కామము లేనీ ప్రేమయోగియే దైవసమానముగా
కన్నులుదెరచీ గర్వమువిడచీ కరుణాసాగరు గనరా జీవా
॥కామము లేనీ॥

2 సాధనలోతన సత్యమునెరిగీ సమరసమధురమె గ్రోలెనురా
॥కామము లేనీ॥

3 శమదమాది గుణ సంపదగలిగిన శాంతినిలయుడే శివయోగీ
॥కామము లేనీ॥

4 సకలప్రపంచము సర్వేశ్వరుడని శాంతివహించిన శివయోగీ
॥కామము లేనీ॥

సా: అయ్యా! తాము ధన్యులు. ఇక నేబోయివత్తునా?

ధ: సాధూజీ! మా వూరికి రండు తమ పాదములకు పూజగావింప వలయు నని నామనస్సునందున్నది.

సా: అయ్యా! నా పాదముల యందే విశేష మున్న దని తాము తలంచవలదు. ప్రేమించుట పూజయే సుమా.

సమాన బుద్ధి పూజలో మొదటి పూజ 'ప్రహ్లాదుని' చరితములు చూడుడు. అవన్నియు భావనా పూజ లని పేరు.

సీ. తనయందు నిఖిల భూ తములందు నొకభంగి
సమహితత్వంబున జరగువాడు
పెద్దల బొడగన్న భృత్యునికైవడి
జేరి నమస్కృతుల్ జేయువాడు
కన్నుదోయికి నన్య కాంత లడ్డంబైన
మాతృభావన జేసి మరలువాడు
తల్లి దండ్రులభంగి ధర్మవత్సలతను
దీనుల గావ జింతించువాడు

తే. సఖులయెడ సోదర స్థితి జరుపువాడు
దైవతములంచు గురువుల దలచువాడు

లీలందును బొంకులు లేనివాడు
లలిత మర్యాదుడైన ప్రహ్లాదుడధిప.

సా: చూచితిరా ప్రహ్లాదుని నియమపద్ధతి. ఇవన్నియు భగవానుని పూజలే పైపద్ధతులు తమ అనుష్ఠానములో నుంచినచో భగవానుడు సంతసించ గలడు. ఊరక అందరి పాదములపై పూవులుంచిన మాత్రముననే సంతసించడు.

మానవులు పై కార్యములనుచూచి మెచ్చుచుందురు. పరమేశ్వరుడు; అంతరంగ పరీక్షా దురంధరుడు.

కావున,— అంతరంగ శుద్ధికై ప్రయత్నించవలయును.

కాని, బాహ్యములు, ఆడంబరములు మానవుల మెప్పుకేగాని యీశ్వర ప్రీతికి అంతఃకరణా శుద్ధియే గాని ఆడంబరములు నిష్ప్రయోజనములు.

కావున — సర్వభూత దయ నలవరచు కొనుము. పరస్త్రీ విముఖత నలవరచు కొనుము. బీదసాదలకు యింత అన్న

ధ్యానము జేయుము. కఠినము కరిగించుము. యివన్నియు భగవానుని పూజలు ఈగుణములన్నియు సాధన గావింపుము.

భ: సాధూజీ! తాము పాదపూజను వొప్పుకొనరా?

సా: పాంచభౌతిక శరీరమునకు అన్నోదకములు వస్త్రములే చాలును.

సంఘము లందు పరమేశ్వరు నారాధించు విధానములు తెలియక తారుమారు పడుచుందురు.

సాధువుల బోధలు వినినచాలును. గాని,— పూ జ లు గావింప నవసరము లేదు.

సాధులు; అనవరతము గృహస్థుల పూజలు, భిక్షలు, పాదసేవలు అంగీకరింపరు.

సర్వులు ప ర మే శ్వ ర పూజ సలిపి కృతార్థులు కావలయును.

భ: సాధూజీ! సాధువులు; దైవస్వరూపు లందురే తాము యీలాగున సెలవిచ్చుచున్నా రేల?

సా: ఈ పరమేశ్వర సృష్టిలో అన్నియు దైవ స్వరూపములే.

భ: స్వామీ! జంతుజాలములకు దైవిక జ్ఞానము గలదా? మానవుని కున్నంత పరిజ్ఞానము వీటియందు గలదా?

సా: భగవత్కళ; అన్నిటియందును గలదు. కాని,— మానవుని యందు అధికముగానుండును. భక్తులందును, జ్ఞాను లందును మిక్కిలిగా నుండుట చేత; వారు దెలుపు జ్ఞానము అనగా బోధలు సామాన్యమానవులు వినుచుందురు యింతియే విశేషము, వినువారు వినుపించువారియందు కృతజ్ఞులై యున్న చాలును.

భ: సాధూజీ! నేను సెలవు పుచ్చుకొందును. దయ వుంచవలె. నమస్కారము.

సా: నాయనా! ఈశ్వరానుగ్రహము పోయిరమ్ము.

ధనవంతుడు వెళ్లిన తరువాత సాధువు; యీలాగున వితర్కించుకొనెను

ఆహా! యెంతకఠినముగా నున్న ధనికుడు; యెంత కరుణాహృదయుడై మారెను. పరమేశ్వరుని దయ ఏ ప్రాణి యెట్లు మారెనో ఆయన చిత్రము యెవరికి తెలియగలదు.

సీ. కఠినాంతరంగుడు గరుణాఢ్యుడై యొప్పు
యుష్మత్కృపాలవ మొందెనేని
నిర్ధనుండైనను నెగడు ధనంబుచే
యుష్మత్కృపాలవ మొందెనేని
బలహీనుడును దివ్య బాహు బలాఢ్యుడౌ
యుష్మత్కృపాలవ మొందెనేని
భిక్షుకుండైనను బృథ్వీశ తిలకుడౌ
యుష్మత్కృపాలవ మొందెనేని

గీ. అహహా నీదయ మించిన యట్టి విభవ

మరయ నేలోకమున నెందు దొరకదయ్య
నీకు సామ్యంబు నీవె పో నిర్మలాత్మ
సకల కల్యాణ గుణ ధన్య సర్వమాన్య.

కావున,— భగవంతుని దయ గలిగిన సర్వమును సమకూరగలదు. అనుచు సాధువు; దేశ సంచారమునకై వెడలిపోయెను.

కాబట్టి నిష్కాములే సాధువులు. ఇట్టి సాధువులు క్రమక్రమముగా తగ్గిపోయి భంగుత్రాగి. దేహములపై స్పృహలేక, ఆడినదే ఆట, పాడినదే పాటలై, స్త్రీల శీలములకు మృత్యువులై ప్రవర్తించువారు గలరు.

అనగా,— రాము నారాధించువారు అరుదు. కాము నారాధించు వారు నెగడిరి. పరమేశ్వరుడు వీరికి సరియైన త్రోవ ప్రసాదించుగాక.

ప్ర. స్త్రీల శీలముల కేల మృత్యువు లగుదురు? 'శీల' మనగా నేమి?

ఉ. స్త్రీలలో; పతిసేవ, సద్విద్య, ఆదరణ, మృదు వాక్యము, చపలత లేకుండుట, గృహకృత్య గోప్యము, వంశ గౌరవము, దైవచింతన, నిరాడంబరము ఇత్యాదులు శీలముల ని నిర్ణయింప బడి యున్నవి.

సామాన్య స్త్రీలు పై బేర్కొనబడిన గుణములయందు దైవ సాన్నిధ్యము జేయుటకు తగువైనవి లేనట్లు భావించి కృత్రిమ సాధువుల నాశ్రయింతురు.

అమాయకులగు స్త్రీలు అట్టివారిని రాక్షసగుణ పూర్ణులగు పై వేషమాత్ర సాధువులు భంగపరుచు చుందురు.

కావున,— స్త్రీలు యెప్పుడుగాని భర్తసేవ నతిక్రమింపరాదు.

ప్ర, భర్త వియోగము గలిగిన స్త్రీలు పరమేశ్వరుడే దిక్కు— వేరు లేదను భావమున దైవ స్మరణ గావించుచు కాల... గడుపుట మంచిది.

స్త్రీలకు స్త్రీలు ప్రబోధకులైన మంచిదని కొందరి అభిప్రాయము.

విశుద్ధహృదయులైనచో పురుషులైనను బాధలేదు.

డెబ్బదియేండ్లు గడచిన వారై మిక్కిలి అనుభవము గలవారై, దయాపరులై, స్త్రీలనిన పుత్రికలవలె భావించువారయినచో అట్టివారు జ్ఞానముపదేశింప తగినవారని వారిని చేరి జిజ్ఞాస చేయవచ్చును. శ్రవణము చేయవచ్చును.

స్త్రీలు జ్ఞానవంతులు గావలయు నన్నచో చక్కని ధర్మగ్రంథములు చదువ వలయును.

ధీరులగు పుణ్య పురుషులు స్త్రీలనిన మాతృదేవి వలె భావించిరి:

'శ్రీ రామకృష్ణ పరమ హంస' గారి "శ్రీ రామకృష్ణ సూక్తి ముక్తావళి" యందు యీలాగున పలికిరి.

స్త్రీలు సద్గుణములతో జనించనీ లేకపోనీ, పతివ్రత లు కానీ, వ్యభిచారిణులు కానీ వారిని సర్వత్ర ఆనందమాయి దివ్యస్వరూపములుగ జూడవలయును.

భర్తతోకి కాపురము జేయుచు బ్రహ్మచర్యము నాచరించు స్త్రీలు సాక్షాత్తు జగజ్జనని స్వరూపమే.

'పరమహంస'గారు అట్లు చూడగలరు. గానీ సామా న్యుల విషయము అట్లుచూడ లేదు.

చూచిన నేగాని తాను ఖమకారము నుండి విడిబడడు.

పూర్వపు మన ఋషి సాంప్రదాయములలో కూడా స్త్రీ లోకమును తల్లుల వలె పుత్రికల వలె, సోదరీల వలె చూచుచుండెడి వారు.

మనము పరమ పూజ్యస్థాన మిచ్చి పారాయణ గ్రంథ ముగా చూచు "శ్రీమద్రామాయణము" ఉత్తర కాండము నందు 'సీ తా దే వి ని' పూర్ణగర్భిణిని కారణాంతరములచె

శ్రీరామచంద్రమూర్తిః లక్ష్మణుని ద్వారా అరణ్యమున వదలిన సమయమున, మహాకవి యగు 'వాల్మీకి' జానకీదేవిని చూచి అనినటువంటి మాట చూడుడు.

అమ్మా పుత్రీ! నీ వెవ్వరవు? యీ అరణ్యమున నుండ నేల? అనీ ప్రశ్నించెను.

ఆమె యేమియు బదులు పలుక లేదు.

ముని యోగదృష్టినిజూచి సీత యని యెఱింగి.

ఉ. ఈ మునిపల్లెయే మిథిల
యేజనకుండ తపస్వినీ జనం
దే మదినమ్మ బాంధవ మికేటి
కొరంత పడంతు లెందు రా
రా మును కానుపుల్ పురిటికై
తమ పుట్టిన యిండ్లకున్ కుమా
గీ: మిథిలేశ్వరుం డొకడు
నే నొకడా నిను కూర్మి పెంపగన్.

సీ. కలమాన్నముల్ పెట్ట గలనో లేనోగాని
వెదురు బియ్యమున కే కొదువలేదు
జిలుగు బంగారు వల్వలకు నేమొగాని
వల్కలంబులకేమి పాత్రిలేదు
కలధౌత మణి సౌధ ముల మాట కేమైన
పర్ణశాలలకు లోపంబులేదు
తగుపనుల్ జేయంగ దాసీ జనులకేమి
మాని పుత్రికలుంద్రు ఘనతగాదె

గీ పడకకై దూదిపాన్పు లెక్కడివిగాని
పూరి సజ్జెలు వెండి బంగారు గావు
పెక్కు పోతల కొకవేళ పేదనైన
కరుణకును నాకు పేదరి కంబులేదు.

అని యా దేవి నాదరించి తన యాశ్రమమునకు తోడు కొని పోయెను (బలిజేపల్లి వారి: ఉత్తర రాఘవ గ్రంథము)

కావున,— పూర్వ పురుషులు కరుణా సమన్వితులు, విశుద్ధ హృదయులు.

నేటికిని అట్టివారు లేకపోలేదు అరుదు.

కావున.- యోచించి స్త్రీలు; పురుషులను గురువులుగా, బోధకులుగా అంగీకరించ వలయునని, జ్ఞాపకమునందుంచుకొన వలెను.

పుణ్యస్త్రీలు అనగా (భర్తగలిగిన స్త్రీలు) భర్తతప్ప అన్య పురుషుల బోధకై వెళ్లుట తగదు. వెళ్ల వలసి యుండిన భార్యా భర్త లిద్దరును వెళ్లి పరమేశ్వర సంబంధమైన కథలో పత్రికృతి సంబంధ చిత్రములో వినవచ్చును, చూడవచ్చును.

మన భారత నారీమణుల పూర్వ చరిత్రలు; తల్లులు చక్కగా చదివిన గాని. జీవితము సక్రమముగా నడుపుకొను పద్ధతి యలవడదు. ముందు జెప్పినరీతిగా,-

సీ పూర్వ భారత దేశమును వెలిగించిరి
సఖియలే జ్ఞాన దీపికలచేత
పూర్వ భారత దేశమున కీర్తి గాంచిరి
లలనలే యుపనిషత్తుల రచించి

పూర్వ భారత దేశమున పేరుబడసిరి
సుదతులే భర్తృశుశ్రూషవలన
పూర్వ భారత దేశమున రాజ్య మేలిరి
తరుణులే ధర్మయుద్ధములొనర్చి

గీ. యిపుడు మాత్రము లేరె యోచించి చూడ
కమల నెహ్రూ కస్తురిబాయి కంజనేత్రి
శ్రీ సరోజిని భారతీ సింహ మధ్య
అబలలేగాదె విద్యచే సబలు లగుదు
రౌర! ద్రవ్యమెంతైన విద్యకు సమంబె.

(కవి: చిన్నకోట వెంకటరత్న శర్మగారు, గీతా ప్రచారకులు)

కావున,— పూర్వ భారత నారీమణుల పవిత్ర జీవితములను మన జీవితములతో పోల్చుకొని చూచినచో మన జీవిత సవరణ సులభము.

నిలువు టద్దము యెదుట నిలుచబడిన వారు తమ అలంకారము నెట్లు దిద్దుకొన గలరో అలాగున సవరించు కొన వచ్చును.

పరుల బోధలు యెన్ని విన్నను గ్రంథములు యెన్ని చదివినను దిద్దుబాటులేని జీవితములకు బోధలు, గ్రంథ పఠనములు అన్నియు వ్యర్థములు.

జీవితమునందు గల రహస్య మెరిగిన తల్లులు; ప్రపంచ వాసనలు తుచ్ఛ మని, పరమేశ్వరు నారాధించి పరిపూర్ణ జ్ఞాన సంపన్నలై, వైరాగ్య నిధులై, బ్రహ్మ సాక్షాత్కారమును పొందిన స్త్రీలు.

ఆనాడేమి, యీనాడేమి; యేనాడును గలరు. ప్రకృతిలో పదార్థ భావన చేయునంత వరకు బంధ విముక్తి స్త్రీలకు లేదు పురుషులకు లేదు.

వస్తు దృష్టి; యేనాడు జీర్ణమగునో ఆనాడే సర్వులకు సమ దృష్టి సంప్రాప్తించును, అప్పుడే భక్తి, జ్ఞాన, వైరాగ్య సత్కర్మాచరణ గమ్యస్థానము బోధపడును.

ఇట్టి శక్తి యెంతసాధనపైన రావలయునో యోచించవలయు, ఇవన్నియు అనుకూల తర్కముల పైననే ఆధారపడియున్నవి.

సాధారణముగా మానవులు సుఖములకై, భోగముల కన్నై భగవానుని పూజించు చుండుటయే అలవాటు పడి పోయినది.

అల్ప సుఖములను కోరినను భగవానుడు యియ్యక పోడు. అవి అల్పములు గావున ఉత్తరక్షణమున స్వభావము గనే నశించును. వెంబడె దుఃఖమును దెచ్చును.

కావున,— బుద్ధిమంతుడు నిష్కాముడై భగవాను నారాధించును.

(స్వామి వివేకానంద)

ప్రి. దుఃఖ మెవరిని బాధింప నంటేరి.

ఉ. సుఖములు శాశ్వతము లని; భోగముల యందు బుద్ధిని ప్రతిష్ఠింపజేసినవానిని యేసుఖము, సుఖమును తెచ్చునో; యేసుఖము దుఃఖమును దెచ్చునో 'గీతామాత' చెప్పుచున్నది.

గీ. 18 అ. 36 శ్లో.

'శ్లో. సుఖం త్విదానీం త్రివిధం శృణుమే భరతర్షభ'

అర్జునా! సుఖములు మూడువిధములు చెప్పెదనువినుము.

గీ. 36 అ. 37 శ్లో.

శ్లో. అభ్యాసా ద్రమతే యత్ర దుఃఖాంతంచ నిగచ్ఛతి
యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్.

తా. అలవాటు చేయుకొలది ఆనందము గలిగించి దుఃఖమును నశింపజేసి, మొదట విషప్రాయముగా నుండి, తరువాత అమృతప్రాయముగా మారునది సాత్త్విక సుఖము.

అల్ప సుఖములు దుఃఖాంతములు గలవి.

మహాత్ములందరు అన్నాహారంబులు వర్జించి పండ్రెండు సంవత్సరములు ఘోర సాధనలుజేసిగదా (శ్రీకృష్ణచైతన్య రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి' మొదలగువారు శాశ్వత సుఖమును బడసి, మనబోట్లకు మార్గదర్శకులైరి

మహాత్ముల సాధనలు తలంచిన; మహా భయంకర ముగా నుండును. 'శ్రీ మళయాళ స్వాముల వారి' సాధనలు చూచినచో యెంత ఆశ్చర్యముగా నుండును. మనబోటివారు అట్టి సాధన తలంచుచుండిన ప్రయోజనము లేదు.

పై వారి నాదర్శకులుగా జేసుకొని మన జీవిత కాలములో అనుష్ఠించవలెను.

దేహము యేకష్టము పడకూడదు? నిత్య సుఖము రావలె నన్న రానేరాదు. వట్టి నేతిబీరకాయల మగుదుము.

జీవిత మంతయు సాధనలకై ప్రయోగించి సకల మతములను క్రోడీకరించి, అనుసరించి తెలిసిన; మన 'శ్రీరామకృష్ణుని' జీవితము సర్వ ప్రపంచమునకు ఆదర్శము.

శ్రీ గీతాచార్యులయిన 'శ్రీకృష్ణ మూర్తి' ఏయాజ్ఞ మానవులకు మోక్ష సాధనకై ప్రసాదించిరో, అవన్నియు 'రామకృష్ణ పరమహంస' యందు గానుపించుచున్నవి,

ఇప్పుడు అనగా (వర్తమానకాలము నందు) మహాత్మా 'గాంధి' కానిపించుచున్నవారు. యింకయెందరో శుద్ధప్రవర్తకులు వుందురు సాత్విక అణువులు సజీవములైనవిగదా.

కావున – సాత్విక సుఖము శాంతినిచ్చును.

'రామకృష్ణ పరమ హంస గారు' చెప్పిన విషయముఁ జూడుడు.

విశ్వాసము దృఢపడినగాని; కామినీ కాంచనములకు దూరుడుగాడు. కామినీ కాంచనముల నెంతవరకు మనస్సున చింతించుచుండునో అంతవరకు భగవచ్చింతన జేయజాలడు.

పులు లున్న అరణ్యములో చిన్న మృగములు విచ్చలవిడిగా తిరుగవు. తిరిగినచో పులులు లేవని తలంచవలెను.

సింహము న్నచోట ఏనుగు యెప్పుడును నివసించదు. నివసించు చుండిన సింహము లేదనియే చెప్పవలయును.

బడియందు అయ్యవారు వున్నచో పిల్లలు అల్లరి చేయ

రు చేయుచున్నచో ఉపాధ్యాయుడు లేడని తలంచ వలయును. అని తెలిపిరి.

అలాగుననే ఈశ్వరుని యందు దృఢవిశ్వాసము గలుగు వరకు మానవుడు కొన్నివిధుల ననుసరించుట మంచిది అనగా సాధువుల సాంగత్యము వా రెట్లు ఆచరింతురో కనుగొనుట, వారితోటి కలిసికొని నామ సంకీర్తనాది ధ్యానముల నాచరించుట యిత్యాది విధుల ననుసరించ వలయును

నారదులు కూడా; తృతీయాధ్యాయమున:

4 సూ. లోకేపి భగవద్గుణ శ్రవణ కీర్తనాత్.

తా॥ భక్తులతోగలిసి ఈశ్వరసంకీర్తనము సలుపుటయు, వినుటయు ఒకమార్గము.

6 సూ. మహత్సంగస్తు దుర్లభో అగమ్యో అమోఘశ్చ.

తా. మహాపురుషుల సాంగత్యము అతి దుర్లభము

అట్టిది మన కెప్పుడు లభించునో, యెట్లు లభించునో యెరుఁగ జాలము. అట్టి దొకపరి లభించెనా ఫల సుమోఘుము.

7 సూ. లభ్యతేపి తత్కృపయైవ.

తా. టట్టి సాంగత్యము భగవత్కటాక్షము చేతనే దొరుకుచున్నదిగదా.

"ఆగస్టేరు" అను ఋషి యిట్లు పలికియున్నాడు.

అణువులాదిగ ధరణి ను హత్తు వరకు
అన్నియును బుట్టినింటికే యరుగుచుండు
మతి నరున కెట్టు లుండునో గతియు నంతె
దేవదేవుని జింతింప దివ్య గుణము
అబ్బుట యెగాక సారూప్య మందవచ్చు
చిత్తమా విశ్వ మంతయు చెడ తిరిగితి
నీవు గాకన్య మేమియు నెచట లేదు
(తత్వ మసి)యందు మదిలోన దలచునంత
నన్న విశ్వాసునిగను బో నాడవలదు

కలదు భగవంతు డెచటనో కలదు కలడ
టంచ దీర్థాల దిరుగగా నెంచు వెఱ్ఱు
లార! మీ రాత్మ రూపులు గారె జూడ
నిత్యమును సిద్ధ మగుదాని నెమక నేల?
నీవు గా కన్య మేమియు లేదు జగతి
ఁజట్టి నిన్నొందు గనుగొందు నయ్య తండ్రి.

కావున,- భాగవత సాంగత్యమునకై య్యే ప్రియత్నిం చ వలయు.

శ్లో. మోక్షద్వారే ద్వారపాల శ్చత్వారః పరికీర్తితాః
శమో విచార స్సంతోష శ్చతుర్థ స్సాధు సంగమః.

తా. మోక్ష సౌధమునకు నాలుగు ద్వారము లున్న వనిన్ని, నాలుగు ద్వారములకు నలుగురు ద్వార పాలకు లున్నా రనిన్ని, మొదటి ద్వారపాలకుని పేరు: శ మ ము (ఇంద్రియ నిగ్రహము) విచారుడు రెండవ ద్వార పాలకుడు.

విచారుడన విమర్శకుడు. మూడవ ద్వార పాలకుడు సంతో షుడు అనగా (తృప్తి, ప్రేమ, కరుణ, అక్రోధము) నాల్గవ ద్వార పాలకుడు, సాధువు అనగా (సాధనచతుష్టయ సంపత్తి గలవాడు) అట్టి సాధువుల యొక్క సేవ, వారి అనుచరణ, సంకీర్తనాపరుల తోటి స్నేహమని యెరుంగవలె. కావున,— ఇవన్నియు ద్వారములె.

ప్ర. భక్తియొక్క స్వరూపము యెట్టిది?

1 సూ. అనిర్వచనీయం ప్రేమస్వరూపం.

తా. ప్రేమస్వరూప మిట్టిదని వర్ణింపజాలము.

భాగవతము.

"దేవానాం గుణలంగా నామానుశ్రవిక కర్మణాం
సత్వఏవైక మనసో వృత్తిః స్వాభావకీ తుయా
అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్దేరరీయసీ"

తా. యోగులు; తమ యోగానుభవమును పరులకు జెప్పఁజాలరు అట్టి యనుభవజ్ఞులను మాత్రము కొన్ని చిహ్నముల ద్వారా తెలుపఁగలరు.

మూగవాడు; మధుర పదార్థము యొక్క రుచిని మన కెఱిగింపజాల నట్లే భక్తిస్వభావముకూడా నట్టిదని వచింపబడజాలదు.

ప్ర. భక్తి; ఒకయనిర్వచనీయపదార్థమైయుండ,మహాపురుషుల సాంగత్య సంభాషణల వలన ప్రయోజన మేమి?

ఉ. భక్తి; యాధ్యాత్మిక మార్గముననే గానీ, భౌతిక మార్గమునను జేకూరదు. ప్రేమ; మానవుల చెంత జేరి నేర్చుకొనినరాదు అది ఈశ్వరప్రసాదముచే కలుగ వలసినదే. అది యోగ్యులగు భక్తుల హృదయమందు స్ఫురించును

భక్తుని యొక్క భక్తి; యాతని హృదయములో గౌరవము, మహిమ. ఖ్యాతి రూపములుగాసాక్షాత్కరించును

దానిచే భగవంతునిసందర్శింప నాతురుడై యాతనినామసంకీర్తనము, కథా శ్రవణము, దివ్య సందర్శనము తప్ప,- యితరములఁ జేయుటకు విసుగుచుండును.

'హాంజవిరి' అనువారు వ్రాసి యున్నారు

'బయాజిడ్' అనువారు యిట్లువ్రాసినారు.

"నే నాతని ప్రేమించితి ననుకొంటిని. కాని చూడగా నాతని ప్రేమయే ముందు పరగిడు చుండెను."

కావున,- భక్తి అనిర్వచనీయ మైనను,—

శ్లో. కంఠావరోధ రోమాంశ్రుభిః పరస్పరం లపమానాః
పావయన్తి కులాని పృథివీంచ.

తా. భక్తులు; పరస్పరము మాటలాడు కొనునపుడు వాక్యము గద్గదతనొందును నేత్రము లశ్రుపూరితములగును, దేహము గగుర్పొడుచును అట్టివారి వంశములు కూడా పావ

నములు. అట్టి వా రుండు దేశము గూడా పావనము.

కావుననే,— 'గీతాదేవి' యిట్లు చెప్పుచున్నది.

గీ 10 అ. 9 శ్లో.

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరం
కథ యంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతిచ.

తా. ఒకరికొకరు నాకథలు జెప్పుకొనుచు నాయందే మనస్సు నుంచినవారై సంతసించుచు నుందురు, అన్యములు వారికి రుచింపవు.

శ్లో. నాద్యాపి పస్యతి కదాచన దర్శ నేన
చిత్తేన చోపనిషదాసు· దృశాం సహస్రమ్
సత్స్వాం చిరం నయనయో రనయోః పదవ్యాం
స్వామిన్ కదాను కృపయా మమ సన్నిధత్సే.
కృష్ణకర్ణామృతము

ఉ. కొందరు యోగ దృష్టి నొక
కొందరు వేద విచార వాసనం

గందురు నిన్ను నెప్పుడు యొ
కా నొక వేళ నభిజ్ఞులైన వా
రందరు; నట్టి నీవు కరుణాంబుధి
పారికృత దృష్టి జెందు నా
ముందట నిల్చి యెన్నడు ప్ర
మోద మొసంగెదవు నందనందనా,

ఉ. ఆననకాంతి తోడ నెదు
రాని శశాంకుడు నివ్వలేక నీ
మానిత పాదపద్మముల మాటున
జేరి నఖాంకురాకృతిన్
బూని భజించినంత నె స
మున్నతి శ్రీ లొనగూర్చె తౌర? నీ
దీన దయాపరత్వము నుతింపగ
శక్యమె నందనందనా.

శ్లో. ఛందశ్శాఖ శిఖాన్వితై ర్ద్విజవరై స్సంసేవితే శాశ్వతే
సౌఖ్యాపాదిని ఖేదభేదిని సుధాసారైః ఫలై ర్దీపితే

చేతఃపక్షిశిఖామణే త్యజవృథాసంచార మన్యైరలం
నిత్యం శంకరపాదపద్మయుగళీ నీడేవిహారంకురు.

తా ఓ చిత్తమా! ఇటునటుతిరిగి యేలవృథా శ్రమ పడియెదవు. పరమేశ్వరుని పాదద్వంద్వము చక్కనిచిలుకగూడు. దాని కెన్నడును చలనంబులేదు; అందు జక్కని వెలుతురు గలదు. అదిమిగుల సౌఖ్యావహము; అమృతఫలములు గలిగి దుఃఖనివారకమై యొప్పుచున్నది. అందు విహరించి యానందింపుము; చూడు! అనేక ద్విజసత్తములు లాయా శాఖల శిఖరంబులకు సంబంధించియుండి దాని నాశ్రయించి యుందురు.

అనగా,- నామనస్సు పరమశివుని పాదారవిందములను మాత్రము దలంచుచుండుగాక యని తాత్పర్యము.

కావుననే, పరస్పరము బోధించుకొనుచు భగవానుని కీర్తించుచు నుండువారి సంఘమునకే భాగవతసంఘ మందురు. అట్టివారి సంఘమున చేరినయెడల తాను నిస్సంగు డగుటకు హేతువగును.

ప్ర॥ నిస్సంగు డనిన బంధుజాలమును వదలుటయా?

ఉ॥ మనస్సున నంటియుండు కామ, క్రోధములను వద లిన నిస్సంగు డగును. యీ కామక్రోధము లున్నంత కాలము జ్ఞానములేదు, వైరాగ్యము లేదు. భక్తిలేదు; కట్టఃడపట యిహ సంబంధమునందు కూడా సుఖములేదు. సకల ధర్మము లకును ప్రతిబంధకమే; కావుననే, గీతాచార్యుడు యీలాగున చెప్పినాడే.

గీ, 3 అ. 37, శ్లో.

శ్లో. కామఏష క్రోధయేష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపాప్మా విద్యేనమిహ వైరిణమ్

తా, కామముచే పేరేపించబడి ఆశకులోనై ఆశాభంగము కలిగి నప్పుడు క్రోధమునకు లోనై అనేక పాపములు చేయు చుందురు. కామ క్రోధములు రజో గుణమునందు బుట్టినవి. వీనిని నిత్యశతృలని భావించవలె.

సీ. దేశదేశంబుల దెన్నుగానక యేగి
గాసిబొందుట పైడి యాసగాదె
పదుగురాడెడి వక్రభాషణంబుల కోర్చి
యాశ్రయించుట కాంచ నాశగాదె
కృపణునిపై మంచి కృతిజేసి కొనిపోయి
యంజలిచేత ధనాశగాదె
శ్వానంబువలె ధని సదనంబుగాచుచు
దాసుడౌటయు పొన్నాసగాదె.

గీ. మనుజు డడియాసలకుజిక్కి మాపు రేపు
నెడద దలపక సిగ్గును నింతలేక
తిరుగుచుండును మదినిన్ను దెలియలేమి
సకల కల్యాణ గుణధన్య సర్వమాన్య

చ. నిధియును శంక భూతలము
నిచ్చలు ద్రవ్వితి నావచే మహో
దధి దరియించితిని శిఖరి
ధాతువు లూదితిరాజు గొల్చితిని

వ్యథగాని ఘోరమంత్ర జప
మూర్ఛ నొనర్చితి గవ్వయైన నే
విధమున బొందనైతి గదవే
ముదమందగ రే దురాశరో.

( భర్తృహరి )

శ్లో. వలిభిర్ముఖ మాక్రాంతం ఫలితైరంకితంశిరః
గాత్రాణి శిథిలాయంతే తృష్ణైకా తరుణాయతే

తా. మొగమెల్ల ముడుత లావహించినవి తలయెల్ల నెరసినది అంగములు పట్టు వదలు చున్నవి ఒక్క యాశ మాత్రము విజృంభించు చున్నది.

కావున పాశములలో తగులుటచేత మనస్సు చీకాకు పడుచుండును. అదియే మనస్సు యొక్క రంగముగాని, బంధువులను విడచినను, బట్టలు మార్చినను, వేషము వేసినను, నిస్సంగత్వముకాదు. తీవ్రముగా అతిశ్రద్ధగా భగవన్నామము స్మరణ చేయువారు తప్పక తృష్ణాబంధముల ద్రెంపగలరు

ప్రహ్లాదుడు చెప్పినట్లు బంధములదెగించి, అజ్ఞానపటలి గాల్చి, (విష్ణు ప్రార్థించు తుదిభక్తి వివశుడగుచు) గావున, అజ్ఞానబంధముల దెగించినగాని మనసు భగవంతునిపై పోదు.

ప్ర॥ బంధములు సుఖముగా తెగునా? చాలకష్టముగనా?

ఉ. కష్టమే మొదట. ప్రపంచమునగల సర్వవస్తుసముదాయము నందును వస్తుదృష్టి మానినగాని బంధము వీడదు. ఎంతో అభ్యాసముకావలె; హేతుదృష్టి యలవడవలె.

కావుననే,- ప్రహ్లాదాదులు (విశ్వమందు గన్న విన్న యర్థములందు వస్తుదృష్టిచేసి వాంఛ యిడడు) అని నుడివి యున్నారు.

అనగా- సర్వము యీశ్వరసంపత్తియని తెలిసెడి హేతుదృష్టి కావలె. యిదిచాలా కష్టమైనది.

ఏ అదృష్టవంతుని దృష్టి ఆలోకన మారునో వారే

యీ ప్రపంచమున జ్ఞానులని భక్తులని యోగులని అనుటకు తగినవారు, చాల దుర్లభులు,

గీ. 7 అ 9 శ్లో.

శ్లో. వాసుదేవ స్సర్వమితిస మహాత్మాసు దుర్లభః

సర్వము వాసుదేవ మయముగా భావించువారు దుర్లభులు, వారే మహాత్మ నామమునకు అధికారులు,

సాధారణముగా మనము సంఘములో యెవరినంటె వారిని మహాత్ములని వాడుచుందుము,

భగవానుడు అట్టివారు దుర్లభులని చెప్పు చున్నాడు. కాని మెల్లమెల్లగా మనము కూడా నిర్వ్యాజముగా మనుష్యులను ప్రేమింపడం, మృగ పక్షులను ప్రేమింపడం చల్లగా పలకడం తనకున్న దానిలో బీదసాదలకు సహాయం చేయడం యిత్యాదులు అలవాటు కాగా కాగా మనస్సు వస్తుదృష్టిని వదలును,

యీసర్వప్రపంచ హేతువెవరో। వానిని తలంచుటకై ప్రయత్నించును. అప్పుడు రాత్రియనక పగలనక ఆర్తి జనించును।

ఆర్తి జనించిన తగు ప్రయత్నము చేయును యెంత ప్రయత్నమో అంత ఫలమును పొందును. ఆర్తి ఆవేదన మానవుని పాప పంకిలము. పరిశూన్యము జేయును. అప్పుడు యెడతెగని భగవస్మరణ కలుగును. పరమేశ్వరుని నామమే పాప దావానలము.

[భాగవతము షష్టస్కంధము]

సీ. బ్రహ్మహత్యానేక పాపాటవుల
కగ్ని కీలలు హరినామ కీర్తనములు
గురుతల్ప కల్మష క్రూర సర్పములకు
గేకలు హరినామ కీర్తనములు
కపనీయ చౌర్య సంతమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ కీర్తనములు

మధుపాన కిల్బిష మదనాగ సమితికి
　　　　　　　　కేసరుల్ హరినామ కీర్తనములు

గీ॥ మహిత యోగోగ్ర నిత్య స మాది విధుల
నలరు బ్రహ్మాది సురులకు నందరాని
భూరి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు॥

సీ. ముక్తికాంతైకాంత మోహన కృత్యముల్
　　　　　　　　కేలిమై హరినామ కీర్తనములు
సత్యలోకానంద సౌభాగ్య యుక్తముల్
　　　　　　　　కేలిమై హరినామ కీర్తనములు
మహిత నిర్వాణ సామ్రాజ్యాభి షిక్తముల్
　　　　　　　　కేలిమై హరినామ కీర్తనములు
బహుకాల జనిత తపఃఫల సారముల్
　　　　　　　　కేలిమై హరినామ కీర్తములు

గీ. పుణ్యమూలంబు లనపాయ పోషకంబు
లభిమతార్థంబు లజ్ఞాన హరణ కరము
లాగమాంతోప లబ్ధంబు లమృతసేవ
లార్త శుభములు హరినామ కీర్తనములు॥

కం. హరి నెరుగని యాబాలుడు
హరిభక్తుల తోడగూడ హరియన రెండు
న్నరిదై దోషము లడచును
గరువలితో నగ్ని తృణము గాల్చిన భంగిన్.

కావున,- నిశ్చల హృదయముతో నామజపము చేయ వలయును యిది సర్వమత సమ్మతము

ప్ర భక్తులు తగ్గువారు, జ్ఞానులు గొప్పవారు అందురే

ఉ. ఒక మేడకట్టుటకు ముందు పునాది త్రివ్వి దాని యందు దృఢమగు కంకరనుబోసి గట్టి పరచిన తర్వాత మేడ కట్టుదురు. వట్టి పునాదితో విడచినను, మేడకట్టనిచో అదియు నిష్ప్రయోజన మౌను. వట్టిమేడకట్టి పునాది లేకపోయినచో అదియు నిష్ప్రయోజనమే. అలాగున భక్తిలేని జ్ఞానము నిష్ప్రయోజనము జ్ఞానములేని భక్తి నిష్ప్రయోజనము.

ప్రపూర్ణ భక్తుడన్నచో జ్ఞానముండియే తీరును ప్రపూర్ణ జ్ఞాని యన్నచో భక్తి యుండియే తీరును. ఒకటిని ఒకటి విడిచి

యుండుట లేదు. భక్తునకున్న లక్షణములు జ్ఞాని యందును. జ్ఞానికున్న లక్షణములు భక్తునియందు యీలక్షణములే యోగి యందును, నిష్కామ సేవాపరునియందును కానవచ్చుచున్నవి. కావున తక్కువ యెక్కువలు సామాన్యముగా నవచ్చు చుండును.

ప్ర. భక్తి విభాగములుగా జెప్పుదురే, మాతృభక్తి, పితృభక్తి, పతిభక్తి దైవభక్తి యిత్యాది విభాగములుగా చెప్పుదురు. జ్ఞానమునకట్టి విభాగములు లేవుగదా?

ఉ; విభాగము లన్నంత మాత్రముననే ఒకదానితో నొకటికి సంబంధము లేదని తలచరాదు.

జ్ఞానము సహితము దేహజన్య జ్ఞానము. యింద్రియ జన్యజ్ఞానము. శాస్త్ర జన్య జ్ఞానము, యిత్యాదులుగా పేర్కొన బడినది. అయినను, యే జ్ఞానముచే యివన్నియు తెలియు చుండునో దానిని తెలియుట ముఖ్యజ్ఞానము. భక్తి కూడా మాతాసేవ, పితాసేవ, గురుసేవ. యిత్యాది నామములు చెల్లినను నిజము ఒక భక్తియే.

శ్లో. యేకంసత్ విప్రాః బహుదావదంతి

ఆ పరంజ్యోతి స్వరూప మొక్కటి యైనను వివిధాకృతి జెందునట్లు, వివిధ నామములచే పేర్కొన బడినట్లు భక్తి; ఒకటి యైనను వివిధనామములు దానికి చెల్లుచుండును.

శ్లో. ఆకాశా త్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి.

అనగా,- ఆకాశము నుండి పడిన వానచినుకులు సెలయేరులై, చిన్న నదులై, పెద్ద నదులై, సముద్రమును కలయుచున్నది. సర్వ దేవతలకు నమస్కరించినను, తుదకు ఆ పరమాత్మనే జెందుచున్నది.

కావున,- మనము యెవరి యందు పూర్ణ భక్తిని పూర్ణ విశ్వాసమును కలిగి యున్నామో,- అవన్నియు ఆ పరమేశ్వరునే జెందును.

కావునచే,- 'నాకములు' సహితము:

సూ. పూజ్యేషు అనురాగో భక్తిః మొదటనే నుడివిరి.

పూజ్యులయందు అనురాగము; భక్తి యని చెప్పిరి.

ఇప్పుడేమైనది, యెవరి చూచినను అనగా యే భూత మును జూచినను ఈశ్వరాంశ యందున్నదని తలంచి ప్రేమింప వలయును. క్రమముగా నీ ప్రపంచ మంతయు వాసుదేవమయ మని అనుష్ఠానమువలన తెలిసి, దాసుభ్యమైనపుడు వాని ఆనం దమునకు మేర లేదు. అట్టివానిని కామ క్రోధములు అంటవు.

క్రోధమున్న హృదయమున ప్రేమ నివసింపదు ప్రేమ యున్నచోట క్రోధమునకు బొత్తుగా చోటు లేదు.

శ్రీకృష్ణ చైతన్యావతారము నందు క్రోధ మనునది యెచ్చట జూచినను లేదు.

'మాధవ, జగన్నాధు' లను వారు మహా దురాత్ములు అట్టివారిని సహా ప్రేమ చేతనే వారి దుండగములను వారే తెలుసుకొని పోగొట్టుకొనునట్లు చేసిరి క్రోధ మున్నవాని

హృదయమున అహంకారము తప్పక కాపుర ముండును.

అట్టివాడు తనకంటె మించినది యీ ప్రపంచమున యేమియు లేదని తలంచును.

అహంకారమునకే అజ్ఞాన మని పేరు. 'గీత' యందు:

గీ. 16 అ. 15 శ్లో.

శ్లో. ఆఢ్యోఽభి జనవానస్మి కోనోస్తి సదృశోమయా
యక్ష్యేదాస్యామి మోదిష్య ఇత్యజ్ఞాన మోహితాః.

తా నేను; యింత ధనవంతుడను, ఈ వంశములో బుట్టినవాడను, నాతో సమాను లెవ్వరు లేరు. నేను అనేక కార్యములు చేసినవాడను, చేయగలను ఇట్లు పలుకుచుందురు.

వాడు మనస్సున తలంచుటవొకటి, నోటితో చెప్పుట వొకటి, పనిచేయుట యొకటి పరస్పర సంబంధము వుండదు.

మనసు, వాక్కును పనిమహితుల కొకటె. కనుగొన నీమల కవి వేరు వేరు.

'ప్రహ్లాదుడు' ఈలాగుననే చెప్పెను.

"తను వ్యా ద్వ్యాభషల సఖ్యముః..."

గీ. 2 అ. 4 శ్లో.

శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినాం.

చిత్తచాంచల్యము లేనివాని మనస్సు; నిరహంకారత వహించి యుండును. ఎప్పుడు ఫలాపేక్ష యెక్కువయై యుండునో, అప్పుడు చిత్తచాంచల్యము యెక్కువయై యుండును. కోరిక లభించుటకై యితరులను పేరేపించును. లభించనిచో ద్వేషించును. ద్వేషముచే సర్వనాశన మగును. ఇట్టివాని మనస్సు ఒకచోట నుండదు.

కావున, అహంకారముగలవాడు యిన్నివిధములచేసును

అహంకారికి చిత్తమే వాని శత్రువు అహంకారము లేనివాని చిత్తమే వాని బంధువు.

ప్ర. అహంకార మన నేమి?

ఉ. వివరముగా జెప్పెదను వినుము. యేపని జేసినను తానే కర్త యనియు, తానున్ననే గాని యేమియు జరుగ దనియు, తన గొప్పను విప్పి చెప్పుచు, ఎదుటివాని దూషించుచు, పర సహాన మోర్వక తిరుగుచు, ఇతరు లెవరు తన యెదుట సుఖముగా నుండ రా దనియు, యిట్టి చిత్తవృత్తిగలిగి యుండుట అహంకార లక్షణములు.

ప్ర. అహంకారము యిన్ని గుణముల కాకరమా?

ఉ. సర్వ దుర్గుణములకు అహంకారము మూలము దీని గెలిచినగాని భగవంతుడు జ్ఞాపకమునకురాడు. అహంకారము ప్రబల శత్రువు. అహంకారమును మదపు టేనుగుగా భావించినారు।

కనుకనే,- 'ప్రహ్లాదుడు' తండ్రితో:

ఉ. లోకము లన్నియుం గడియ
లోన జయించినవాడ వింద్రియా
నీకము చిత్తముం గెలువ
నేరవు నిన్ను నిబద్ధుజేయు నీ
భీకర శత్రులార్వుర ప్ర
భిన్నుల జేసిన బ్రాణికోటిలో
నీకు విరోధి లేడొకడు
నేర్పున జూడుము దానవేశ్వరా.

ప్రబల శత్రువులు గావుననే జయించుటకు 'శ్రీశంకరాచార్య, రామానుజాచార్య, మధ్వాచార్య, శ్రీకృష్ణ చైతన్య, శ్రీరామకృష్ణ పరమహంస, రామతీర్థ, వివేకానంద, నాగ మహాశయ, గాంధి, శ్రీవెంకటరత్న శర్మ' మొదలగు మహనీయులు, మహా పతివ్రతలగు క్రైస్తవ మహమ్మదు వీరు కూడ ఏకగ్రీవముగా శత్రుజయ విధానము యిట్లు ప్రసాదించిరి, అవి యేమియన?

అనవరతము భగవచ్చింతన, సర్వభూతదయ, ఆచరణలో నుంచిన చాలును. ఇంతకుమించి అహంకార శత్రుజయమునకు మార్గమే లేదని నుడివిరి.

భాగవతమున,

క. పాలింపుము సేమమిపి నుర్
మీలింపుము కర్మ బంధముల సమదృష్టిం
చాలింపుము సంసారము
గీలింపుము హృదయమందు కేశవుభక్తిన్,

ప్ర. రెండే ఉపాయములా? అహంకారనాశనమునకు; తేలికగానే యున్నదే. యోగముచేయవలయునేమో యని యెంచియుంటిని.

ఉ. చెప్పునప్పుడు, విను నప్పుడు తేలికగా నున్నట్లుండును. ఆచరణలోకి వచ్చునప్పుడు అది యెన్ని దినములో పట్టును. అన్యచింతలేని స్థితి మొదట కుదురవలయు. తర్వాత అహింస కుదుర వలయును. అన్యచింత లేనివానికే అనవరత భగవచ్చింతన కుదుర గలదు.

కొంచము చింత వేరుగా పోయినదా? అహంకారము నకు సందుపడిన దన్నమాట. ఎంత యేకాగ్రముగా గమనించ వలయునో యోచింపుము ఇది యోగముకాదా? ఎంత యా రూఢము కావలయును.

గీ. 4 అ. 35 శ్లో.

శ్లో. యత్ జ్ఞాత్వా నపునర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతాన్య శేషేణ ద్రక్ష్యస్యాత్మ న్యధోమయి.

భగవచ్చింతన లేనివానికి పదార్థ దర్శనము అనర్థ దాయకము. సర్వ భూత దయ లేనివానికి అహింసా పద్ధతి తెలియనే తెలియదు.

భగవానుడు: "అహింసా పరమోధర్మః" అని వచించి యున్నారు.

అనగా. అన్నిధర్మములకన్నను అహింసపరమధర్మము.

అహింస రెండు విధములు; స్థూలము, సూక్ష్మము అని

స్థూలముగా యోచించిన ప్రాణులను చంపకుండుటయని.

అహింసనుద్దేశించి ఒకమహాకవి యిట్లు వ్రాసియున్నారు.

సీ. కసవు మెక్కుచు గాన వసియించు మృగముల
కరుణ లేకను జంపు కఠిను డొకడు
ఫల భక్షణము జేసి పారెడు పక్షుల
సదయుడై కడతేర్చు సధము డొకడు
పుష్కరంపు మురికి బోనొట్టు మీలను
వలవైచి చంపెడు తులువ యొకడు
వరిగడ్డి దిని పయో వర్షంబు కురియించి
జనుల బ్రోచెడు గోవు జంపు నొకడు

గీ. కటకటా! వీరి హృదయముల్ కఠిన శిలలు
జగతి నిట్టి దురాత్ములు చాలగలరు
వీరి నెట్లు లడంచెదో? వేదవేద్య!
సకల కల్యాణ గుణ! ధన్య! సర్వమాన్య!

ఇవన్నియు స్థూలముగా జేసెడు హింస లని చెప్ప బడి

న్నవి. ఇయ్యవి పూర్తిగా మానడమేగాక, సూక్ష్మముగా పరుల నొప్పనాడుట, పరులకు కష్టము గలుగ జేయుట, నష్టములను గలుగజేయుట, నేరములేకయే శిక్షించుట, కఠినముగా పలుకుట యిత్యాదులు సూక్ష్మముగా ప్రాణులకు జేయు హింసలు.

ఈ రెండు విధములైన హింసలు మానిననే జీవదయ మానవుని హృదయమున ఉత్పన్న మగును.

ప్ర. ఇవన్నియు చాల కఠినములైన వ్రతములుగా నున్నవి.

ఉ. అవును మొదట కఠినముగా నుండును, ఆచరించు కొలది మహా సుఖముగా నుండును నములుటకు పటికబెల్లము (కలకండ) కఠినముగాను, పూర్తిగా నమలిన యెడల ఎంతో మధురముగా నుండును. కర్జూరపుపండు నములునప్పుడు కఠినముగా యుండును, నమలగా నమలగా నెంతో రుచినిచ్చును. మంచి విషయములు మొదట కొంచము కఠినమే, తర్వాత సుఖముగా మారును.

కఠినమని విడువక బుద్ధిమంతులు దానినే అనుష్ఠింతురు.

రోగిని పథ్యముగా నుండుమని వైద్యుడు చెప్పినప్పుడు కటకటపడును ఆరోగ్యదశ వచ్చినప్పుడు పథ్య మాండినది మంచిదేనని వానికి తెలియును వైద్యుడు పుండు కోయున ప్పుడు యెంతో కఠినుడని యనుకొందుము, బాధ నివృత్తి అయినతర్వాత వైద్యు డుపకారముచేసెనని యనుకొందుము.

భగవన్నామము హృదయపూర్వకముగా ధ్యానించు టకు ప్రారంభ దశయందు, ఆరూఢ దశయందుకూడా సుఖమే కాని మానసము అదివరకు మరగని దోషమువల్ల మొదట కొంచము కష్టము, తర్వాత సులభమే భగవానుడే నన్ను నీవు అనన్య భక్తిచే ఆదరించిన, నన్ను జేరుటకు నీకు యేమి కావలయునో అది నేనే చేకూర్చెదను. అని పరమేశ్వరుడే చెప్పియుండలేదా,

(దుర్గుణ వర్జన, సద్గుణ ఆర్జన) యివిరెండు మానవుని కర్తవ్యములు.

భగవత్కారుణ సిద్ధముగా నున్నది. 'బుద్ధ'భగవానుడు మానవు డాచరించవలసిన వ్రతములను కొన్ని చాటినారు. ఆ వ్రతము లన్నియు మనము ఆచరించినచో తక్షణము భగవానుని కరుణా ప్రవాహము మనపై ప్రవహించును.

(సౌందరానందము)

సీ. చరియింపరే పాప సంఘాతి తిమిర
పలాయన మంత్ర మస్తేయ పథము
పాలింపరే! యపవర్గ దుర్గ కవాట
పాటనమ్మిది సత్య వాఙ్నియమము
కైకొనరే! లోక కల్యాణ కృతధర్మ
సారభూత మ్మహింసా వ్రతమ్ము
అంగీకరింపరే! అలరు వింటికి దురా
సదమైన యీ బ్రహ్మ చర్యదీక్ష
గీ. తాల్పరే! శాంతి దాంతి నిధానములకు
మహిత సిద్ధాంజనమ్ము సమత్వబుద్ధి
ఆమయ జరాపమృత్యువు లంటనీని
శీలకవచమ్ము దీని కైసేసి కొనరే.

మందు; ఎంత వెల గలదియైనను, పథ్యము సరిలేనిచో దినము మందు పుచ్చుకొనినను ఆరోగ్యదశ రాదు.

ఆలాగుననే మనము భగవన్నామము నిత్యము తప్పక చేసినను, పై వ్రతనిష్ఠుడై చేసినచో శీఘ్రకాలమున ఆనంద మనుభవింపగలడు.

ప్ర. మానవులు అనవరతము యిట్టి వ్రతములనే చేయుచుండిన వాని గృహ వ్రతమెట్లు?

ఉ. గృహ వ్రతము చక్కగా స్వక్రమముగా ఈశ్వర ప్రీతిగా, ఆనందముగా ఆచరింప వచ్చును. పనస కాయను కోయువాడు నూనె చేతికి రాచుకొన్నచో జిగురు అంటనట్లు తాను గృహ వ్రత మాచరించు చున్నను, లిప్తుడు గాకుండుట కై యేర్పడిన వ్రతములె పై జెప్పిన వ్రతములు.

మ. మనగృహ మొక్క సత్రముసుమా
మనమందరు బాటసారులై

చన గరుణాను బంధమున
చక్కఁగ నిచ్చిన అలుఁబిడ్డలకో
మనసు నొసంగగా మరచి
మాధవు జేరక నిత్యభోగియై
తనవిగ నెంచు ద్రోహిని కృ
తఘ్నుని మెచ్చునె శౌరి మిత్రమా.

ఇట్టివారి కేల గృహయాత్ర సుఖముగా నుండదు.

హృదయమున శాంతి లేనివానికి సుఖము లేదు. కాని హృదయము శాంతించినవానికి సుఖమున్నది.

కావుననే,— 'గీతామాత' ఇట్లు పరిబోధించు చున్నది.

గీ. 2 అ. 66 శ్లో

శ్లో. నాస్తి బుద్ధి రయుక్తస్య న చాయుక్తస్యభావనా
న చా భావయత శాంతి ర శాంతస్య కుతః సుఖం.

ఇంద్రియ నిగ్రహము లేనివానికి జ్ఞానము గలుగదు. భగవ ద్గుణానుభవము గలుగదు. అది లేనివానికి ఆత్మావ

లోకనము లేదు. అది లేనివానికి శాంతి లేదు. శాంతిలేనివానికి సుఖము లేదు.

యిట్టి శాంతికి యేకాంతభక్తియేగాని వేరుమార్గము లేదు. శుద్ధ సాత్వికుడైనగాని యిట్టి భక్తి రాదు.

ప్ర. శుద్ధసాత్వికు డగుటకు మార్గ మేది?

ఉ. మానవునియందు సాత్విక అణువులని, రాజస అణువులని, తామస అణువులని మూడువిధము లణువు లున్నవని కాణాదులను మహారుషుల సిద్ధాంతమై యున్నది. ఆహార వ్యవహార నీమములచే మానవుడు సాత్వికా ణువులను వృద్ధిపరచుకొనినచో సాత్వికుడు అగును. రాజ సాణువులను అభివృద్ధి పరచు కార్యములు ఆహారముచే రాజసు డగునినియు; అలాగే తామసవిహారము తామసాఽహారమువల్ల తామసుడగుననియు సిద్ధాంతము లున్నవి.

భగవానుడుకూడా, భారతీయుల భాగ్యదేవత యగు తన "గీత"యందు సాత్వికుని ఆహారము వేరనియు, రాజసుని

ఆహారము వేరనియు, తామసుని ఆహారము వేరనియు చెప్పి యున్నారు.

విశ్వాస మున్నవారు ఆలాగుచేసి. వృత్తిగుణాత్మైయు న్నారు.

గీ. 17. అ 8. 9. 10. శ్లో.

శ్లో॥ ఆయుస్సత్వ బలారోగ్య సుఖప్రీతి వివర్ధనాః
రస్యాస్స్నిగ్ధాః స్థిరాహృద్యా ఆహారా సాత్వికప్రియాః.

శ్లో. కట్వామ్ల లవణాత్యుష్ణ తీక్ష్ణరూక్ష విదాహినః
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకా మయప్రదాః

శ్లో. యాతయామం గతరసం పూతిపర్యుషితం చయత్
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియమ్.

తా. ఆయుర్దాయమును, అంతఃకరణము నందలి జ్ఞానమును, ఆరోగ్యమును, సుఖమును, భగవంతునియందు ప్రీతియు, వృద్ధిపొందించునవియును రసవంతములు, చక్కగా పం

డినవడ్లు, చమురుతో గూడినవియు, కంటికి నింపుగా నుండున వియు. అనగా— తినకముందే పవిత్రముగా నుండునని తోచు నవియు సాత్వికులకు ప్రియము.

పప్పు, పూరీలు, యిత్యాదులుకాః; యిట్టి ఆహార ములు స్వీకరించి నందువల్ల యేలాంటి వారైనను, సాత్వికు లౌదు రని కొందరు చెప్పుచుందురు.

ఆహారశుద్ధియే సత్వశుద్ధియని. ఉపనిష ద్వాక్యముల యందును గానవచ్చుచున్నది

మత్తు, వుద్రేకము గలిగించని సాత్విక ఆహార మని చెప్పుకొన దగినదే; కానీ— నిశ్చయముగా యోచించిచూచిన, న్యాయముగా ధర్మముగా తానుకష్టపడి సంపాదించి తినినతిండి సాత్వికాఽహార మని, సర్వులు అంగీకరించ వలసినదే. అప్పుడే దేహమునకు సహా ఆరోగ్యము.

అటుగానిచో దేహారోగ్యమునకుభంగము. మనస్సునకా

రోగ్యమునకు భంగము. కొన్ని దేశముల యందు, గోధుమరొట్టెలుమాత్రమే తినుచుందురు. వారియందును సాత్వికసంపత్తి కనబడుట తక్కువగానే యున్నది.

అనగా,- ఒకటిమాత్రము కానవచ్చుచున్నది. దేహారోగ్యము చక్కగా కానుపించుచున్నది ఆరోగ్యవంతుని ఆలోచన చక్కగా నుండును.

చక్కని ఆలోచన సాత్వికుని లక్షణము కావుననే, ఉపనిషత్తులు ఆహారశుద్ధి సత్వశుద్ధియని వ్రాయుటకు కారణము. ఆహారము తారుమారైనచో ఆరోగ్యము చెడును. ఆరోగ్యము చెడిన ఆలోచన చెడును.

సీ. గురుగు బచ్చలి గోగు గొబ్బి చెంచెల మెంతి
కూరలు నాగ నా కులను దెచ్చి
మిరపకాయలు నూనె కరివేప యింగువ
చింతపం డుప్పును చేరఁ జేసి
వెల్లుల్లి కొబ్బెర బెల్లము పమునుంచి
రోటనుబ్బుచు తిరగ బాతనుంచి

దండియనుచును యోరబిండి యొక్కటిజేర్చి
పొట్టనిండదాని నట్టిమెక్కి

గీ. రోగమేవేళబెంచి యారోగ్య మొసగు
ప్రకృతిగానక పర్విడు ప్రతిభ నేర్చి
పాపియనుకొను టిది మాస్వ భావమయ్యె
సుగుణసంభావ్య సర్వేశ సుప్రకాశ.

కావున,— ముముక్షువులు వారివారి దేహతత్వమునను సరించి అనారోగ్యము మత్తు, వుద్రేకము యివన్నియు ఆహారమువల్లనే కలుగుచున్నవి, గాన, యేదిభుజించిన కామ క్రోధము లుద్రేకించవో, దానినే భుజించవలె.

ఆహారనీమము, వ్యవహార నీమము గలవానికే త్యాగబుద్ధి పట్టుబడును. త్యాగము లేనివానిని, అత్యాగి, అవాచ్యుడని పరిగణించు మందురు.

ప్ర త్యాగమనగా నేమి?

ఉ, అనేకవిధము లగు త్యాగములు శాస్త్రకారులచే

తెలియజేయబడి యున్నవి. అందున ఆఱువిధములు ముఖ్యములు.

అందులో మూడవత్యాగము ముముక్షువునకు అత్యంత ముఖ్యము. (అది ఏదియన) కామత్యాగము.

అదిచాలా దుష్కరము. కాని,- దానిచే దుఃఖమును ధరింతురు. ఆ త్యాగము చేయబడినచోఁ భిన్నభావము జయింపబడును.

శ్లో. తేనదుఃఖంతరం త్త్యేవభిన్నం తస్మిజ్జితంకృతే.

ప్రతాపచంద్రరాయ లను గొప్ప టీకాకారులు. ఆఱు విధములయిన త్యాగములు, వుండిన శ్రేష్ఠమని చెప్పియున్నారు

మొదటిది సంపదగలిగినప్పుడు హామీఁంప కుండుట.

రెండవది నిత్యవైరాగ్యము.

మూడవది కామత్యాగము. యిది పై రెంటికన్నను

శతాధిక గుణవంత మని చెప్పియున్నారు.

ఇదిగాకను,— భోగ్యద్రవ్యములను మనస్సునకు తగుల కుండ వదలుటయే త్యాగముగాని, యథేష్టముగా అనుభవించి చివరకు అనుభవించలేక వదలుట త్యాగముగాదు.

నాల్గవ త్యాగము— సర్వగుణములతో కూడినవాడై నను, ద్రవ్యవంతుడైనను కార్యసిద్ధి వానికి కలుగకపోవచ్చును అట్లు కానిసమయమున దుఃఖింప గూడదు.

ఐదవ త్యాగము— భగవంతు నుద్దేశించి దేహసౌఖ్య ముల నడుగ కుండుట.

ఆరవత్యాగము— తన్ను యాచింప కున్నను ఉచితమె రిగి దానము జేయుట

ఇట్టి ఆరుత్యాగములు మానవునియందు వున్ననేగాని, మానవుడు భక్తి జిజ్ఞాసాగాని, జ్ఞానజిజ్ఞాసగాని, యోగజిజ్ఞా సగాని చేయజాలరు అని "సనత్కుమారుడు" ధృతరాష్ట్ర మహారాజుతో చెప్పెను.

దీనినే "సనత్కుమారగీత" యని కూడా చెప్పుదురు.

త్యాగముచేయుటకు ముందు మనస్సును నిమించ వల యును. అప్పుడు త్యాగ మనునది మనస్సునకు గ్రాహ్య మగు చున్నది.

"ఆనందగిరిటీక" యందు మనస్సును యెట్లు నిమించవ లెనను విషయము చెప్పియున్నారు

ప్ర. ఇదివరకు మనోనిమ మార్గములను వింటిని యె న్నియో మార్గము లున్నట్లు తెలియుచున్నది. యిన్ని మార్గ ములు ఒక్కడు యేలాగు అనుస రించగలడు?

ఉ. యెవరికి యేమార్గమున మనోనిగ్రహము సులభమ నితోచునో, వారామార్గమున నిగ్రహించ వచ్చును. ఓమ నసా! పిశాచమువలె విషయములను గూర్చి పరుగు లెత్తుచు న్నావే, నీ కేమైనను కావలసి యున్నదా? లేదే; నీవు జడ ముపుకదా! విషయమునం దేమైనను ప్రియత్వ మున్నదా? లేదుగదా! అవిఅనిత్యములుగదా? చేతస్సున కేమైనను కావలసి

యున్నదా? దానికి కావలసిన దేమియులేదు. అది సంగములేని ది: ఆనందస్వరూపము గలది. మఱియొందులకు నీవు పరుగిడుచు న్నావు.

అని యీలాగున మనస్సును అడిగినట్లు వ్రాసియున్నారు. "గంగవపల్లె శంకరరావు" గారు.

ప్ర. త్యాగము, ఆహారనీమము, అనవరత చింతనము యివన్నియు, పరమేశ్వరుని చేరుటకుగదా! ఆయనకు మనకు గల సంబంధ మేమి?

ఉ. జీవులన్నియు పరమేశ్వరుని అంశము. కావున, నిత్యసంబంధ మున్నది భగవానుడే " గీత " యందు, యీట్లు సెల విచ్చియున్నాడు.

గీ 15. అ 7. శ్లో.

శ్లో. మమైవాంశో జీవలోకే.

అర్జునా! యీజీవలోక మంతయు నాయంశముసుమా నాకును జీవలోకమునకును నిత్యసంబంధము. వారు వేరు నేను వేరుకాదు.

జీవులు కామ క్రోధములకు చిక్కి, ఆశాపాశ బద్ధులై పంజర మందు బంధింపబడిన పిట్టవలె, పట్టుబడి యుండుటచేత, పరమేశ్వరునకు జీవులకుగల సంబంధ మేమియని విచారించలేరు.

ఇంచుక వివేకముగలిగి విచారించి రేని, తాము యెట్టి వారైన విషయము బోధపడి స్వస్థత జనించును. అట్టి నిత్యసంబంధము తెలియువరకు "జీవులు" దుఃఖపడుచునే యుందురు.

"భాగవతమునందు చూడుడు" దేవేంద్రుడు రాళ్ల వాన కురుయించిన సమయములో, 'గోపాల గోపికలు' "హే ప్రభో కృష్ణా! యీరాళ్ల వర్షమునకు ఆగలేము నీమరుగు జొచ్చితి మని చెప్పిరి" ఆసమయమున జగత్కర్త యగు మన గోపాల దేవుడు!

కం. రాతల్లి! రమ్ముతండ్రి
వేత్రులు గోపకులురందు, వినుడీ గత్ణా
తాృతలమున నుండుడు గో
త్రాతములుఙ్ మీరు, మీకు వలసినయెడలఙ్.

శా. బాలుండీతడు కొండదొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండోయని దీనిక్రింద నిలువ న్శంకింపగా బోకుడీ.
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైబడ్డ నా
కేలల్లాడదు బంధులార నిలుడీ క్రిందఙ్ ప్రమోదంబుగఙ్.

తా. అని పలుకుచున్న హరిపలుకులువిని నెమ్మనమ్ముల నమ్మి కొండయడుగునం దనుతమ యుమ్మలం బుత్ర మిత్ర కళత్రాది సమేతులయి. గోవులుందారును గోపజనులు జనార్ధన కరుణావిలోకనా మృతవర్షంబున నాకలినీరు పట్టులచో ప్పెరుంగక కృష్ణ కథావినోదంబుల నుండిరి వ్విధంబున అని వ్రాసియున్నది

కావున – సంసార శిలావర్షపీడితు లయిన జీవులు, భగవంతుని కరుణా పర్వతముక్రింద చేరవలయునుగాని, వేరుమా

గణము లేదుగదా! బంధులారా! యని వారిని సంబోధించి రక్షించినట్లు, ప్రపంచమున సర్వజీవులు ఆయన అంశములుగా వున, నిత్యబంధుత్వముగల దని తెలుసుకొని ఆశ్రయించ వల యును,

మనఃపూర్వకముగా నీవేనావాడవని పలుకు జీవుని, ఆ యన రక్షించి తీరును.

అట్లుగాక— శుష్క వేదాంతులయి, భక్తిలేక జ్ఞానుల మైతి మని సంతసించువారికి చాలాదూరమున నుండును.

జ్ఞానములేని భక్తియు, భక్తిలేని జ్ఞానమును పూర్ణత్వ మును పొందవు. ప్రపూర్ణజ్ఞాని యనిన భక్తిపూరిత మానస సు డని తెలియవలెను. అనన్యభక్తు డనిన ప్రపూర్ణజ్ఞాని యని తెలియవలయు.

ఉ. జ్ఞానములేనిభక్తియుర సంబునసర్ణ

వెలియైన కైతయు

దానములేనిసంపదయు ధైర్యము
లేని బలంబు మానముం
బ్రాణము జూచుకొంచు నెడ
బాసెడి మైత్రియునాడితప్పగా
బూను రసజ్ఞయుక్ యశము బొందని
జన్మము వ్యర్థమౌ సుమీ.

కావున,— జ్ఞాన, భక్తి క్షీరోదక న్యాయంబున మెలంగుచుండు భక్తుడు, జ్ఞాని యిద్దరును, మాయను జయించిన వారే. యిద్దరును ప్రకృతి కతీతులు.

మహాజ్ఞానియగు స్వామివివేకానందులును, మహాభక్తాగ్రేసరు డగు నాగమహాశయుడును యిద్దరును, ఒకదినమున గంగాతీరముజేరి కూర్చొని మాయావిషయమై కొంతసేపు ప్రసంగించుకొనిన తర్వాత మహాజ్ఞానిగాని మాయను జయింపజాలడు అని, వివేకానందులు పలికిరి

మహాభక్తుడుగాని మాయను జయింపజాల డని నాగ మహాశయులు పలికిరి.

ఇద్దరికిని భావభేదము కలిగినది యిద్దరుకలిసి శ్రీగురు స్వామియగు శ్రీ రామకృష్ణపరమహంసగారి సన్నిధికివచ్చిరి.

ఇద్దరినిచూచి స్వామి చిరునవ్వునవ్వి కూర్చొను డనిరి.

ఇద్దరును కూర్చొనిన తర్వాత వివేకానందుడు యీ లాగున పలికెను.

స్వామీజీ! జ్ఞానపూర్ణుడే మాయ నతిక్రమించినవా డుగదా? అనిరి.

నాగమహాశయులు— సంపూర్ణభక్తుడు అనన్యభక్తుడు మాయాతీతుడుగదా? యనెను.

వీరి భావభేదములను గురునాథుడు గనుగొన్నవాడు గ నుక, అయ్యలారా! మాయ అను నది వలవంటిది. ఆవలయందు

నీవొక పదార్థము నుంచితివి అది అంతకంతకు పెరిగి పెరిగి వలను తెంచినది; వల తెగిపోయినది. అలాగున బ్రహ్మజ్ఞానముచే అన్యపదార్థము లేదు.

నేనొక్కడనే యీసర్వ లోకాలోకములయందు నిండియుండునది " నేనే " అనుభావమున నీకు మాయసంబంధము వూడిపోయినది. (అనగా నాగమహాశయునకు) ఆవలయందు వుండుపదార్థము అంత కంతకు సూక్ష్మమై మరీసూక్ష్మమై వలనుండి జారిపోయినది [వలనుండి తప్పించుకొనినది] వలసంబంధము లేదు,

అతనిభక్తిచే తానుదాసుడై అన్నియు ఇష్టదైవముగా భావించి యిష్టదైవముతప్ప అన్యపదార్థ దర్శనమే తనకన్నులకు లేనివాడుగాన, అతడు మాయను జయించెను. గాన, నీవు జ్ఞానిమార్గమున అతనుభక్తిమార్గమున యిద్దరు మాయను జయించితిరి.

మాయనుజయించక సివోహమన్నను, దాసోహమన్నను ప్రయోజనములేదు. అని చెప్పిరి. యిద్దరు తృప్తిపడివెళ్లిరి.

దారివెంట ఆహా! స్వామియెంత చక్కగా మనలతృప్తిపరచెను. అని చెప్పుకొనుచు భావభేదములు వదలి జ్ఞానభక్తులు వేరువేరు మార్గములేగాని, పొందవలసిన గమ్యమొక్కటియని గ్రహించిరి.

మహాజ్ఞానియని లోకప్రసిద్ధిగనిన భగవత్పాదులగు శంకరాచార్యులు తమ శివానందలహరియందు భగవానుని భక్తిమెయిధ్యానించిన విధము చూడుడు,

శ్లో॥ శివ తవపరిచర్య సన్నిధానాయ గౌర్యా
భవమమగుణధుర్యాం బుద్ధికన్యాం ప్రదాస్యే
సకల భువన బంధో సచ్చిదానంద సింధో
సదయ హృదయ గేహే సర్వదా సంవసత్యామ్.

తా. మహాదేవా! నీవు సకలసౌభాగ్య దాయకుడవుగాన, కన్యకిచ్చగలిగించు పుంస్త్వగుణంబును సకల ప్రపంచోత్పాదకుండవు గాన, సంతానోత్పాదకత్వగుణమును సత్స్వరూపుడవు గాన,సాధుశాలిత్వగుణమును సకలలోక బాంధవుడవు

గాన బంధత్వ గుణంబును, చిత్స్వరూపుడవుగాన శ్రుతసత్వ గుణంబును, ఆనంద స్వరూపుడవుగాన తిరోదత్వాది గుణంబులును, సదయుండవుగాన దయాళుత్వంబును మొదలుగా వర గుణంబులు అనియు నీయందు గన్పట్టుచున్నవి. నీవు తగిన వరుండవు: బుద్ధి యను నాకన్యయు, శాస్త్రోక్తంబైన యెల్ల గుణంబులు గలిగి గుణధుర్యయై యున్నది.

గౌరీదేవితో గూడా నీవు పరిచర్య జేయుచు నీయొద్ద నుండునట్లుగా దీని కన్యాప్రదానము చేసెదను. బ్రహ్మవివాహ విధితో పరిగ్రహించి చాతుర్యముతోడ నీ యుభయ పత్నులకును సామరస్యము సంపాదించు, నాహృదయ గేహమం దెప్పుడును గృహస్థుడవై సుఖముగా నివసింపుము. నాబుద్ధి యెప్పుడును శివునివిడువక యుండుగాక; యనియు నిట్లు శివునికి మామగారై ఆనందించెద ననియు తాత్పర్యము

౫౨. భగవంతుడు సహస్రనాముడందురే; యేనామము మోక్షదాయకము.

ఉ. ఏనామము నందు మానవునకు ప్రీతికరమో, ఆ మూర్తిని మనస్సున నుంచుకొని తన్నామము నుచ్చరించుచు యేప్రాణిని చూచినను తన యిష్టమూర్తి స్వరూపమే యని భావించుచు అన్య భావనల నడంచి మెలగవలయును.

'శ్రీరామకృష్ణ పరమహంస గారు' తన భార్య యగు 'శారదాదేవి' యందును; తన యిష్టమూర్తి యగు కాళికా దేవినే జూచిరి.

వేశ్యలను చూచియు కాళియని భావించిరి.

తాను కాళీపూజ జేయునపుడు పిల్లి వచ్చి దేవికి సిద్ధపరిచిన నైవేద్యము తినుచుండ అదలించక కాళియే భుజించు చున్నదని భావించి యుండుటచే చూచుచుండిరి.

పైపై అమ్మా! యీరూపమున వచ్చితివా! తల్లీ! నీవు భుజింపుము; అనిరి కావున, నామజపమున యిట్టిస్థితి కలుగు వరకు పూర్ణత్వము కాదు. ముమ్ముందు నామముయొక్క అధి క్యతను తెలియవలయును.

సీ. కలిమల మథనంబు కల్యాణ సదనంబు
పావనంబుల కెల్ల పావనంబు
సద్యంబ పరపద సంప్రాప్తికై యేగు
శ్రేయోభిలాషి పాథేయ మెందు
సుకవి శేఖర వచ స్తోమం బవశ్యంబు
విశ్రమింపందగు విడిదిపట్టు
బీజంబు సద్ధర్మ భూజంబునకు నిల
జీవనంబున కెల్ల జీవనంబు

గీ. హరిహరాత్మకంబు నామ్నాయ సారంబు
తారకంబు భవవిదారకంబు
సాధు సేవితంబు సకలార్థదంబు
శ్రీరామ మంత్ర మెపుడు రక్షమాకు.

సీ. ఆది దంపతుల బ్రహ్మానంద సంధాన
సరణికెయ్యది యయ్యె సాధనంబు
అంజనేయాదుల యద్భుత శక్తికి
మూలకారణ మదేచు గ్రాలె నెద్ది

ఆదికవీశ్వరుఁడైన వాల్మీకి దా
నెద్దాన భవము దరింప గల్గె
ఎద్దాని నేప్రొద్దు నెదనిల్పి గోపన్న
కష్ట పరంపరల్ కడచె నిట్టె

గీ. అట్టి వైష్ణవ శైవ మం త్రాత్మకంబు
ఘోరపాతక నివహ విదారకంబు
కోరి జపియించువారికి తారకంబు
రామ మంత్రంబు దానిత్య రక్షమాకు.

యిట్టి నామసంకీర్తన నుద్దేశించి,

'మహాత్మ నన్' అను మహాభక్తుఁడు యిట్లుపలికియున్నాఁడు

సంకీర్తనము భగవత్సందర్శనమునకై హృదయమును ప్రేరేపించెడినొక దివ్యశక్తి, అట్టిదానిని భక్తితోవినిన జపించిన, భగవత్కృపకు పాత్రులగుదురు.

సకాములై వినిన పతితుఁడగును. హృదయము పొంగి, ఆనంద మధికమైనపుడు శరీరము పరవశతను బొంది సంఘ మ

ర్యాదలు సహోద్యుత మైనపుడు సలిపెడి నృత్యముచేత భవ బంధము లన్నియు పటాపంచలై జీవాత్మ దేహమునుండి ఎగిరి పరమాత్మలో లీనమగును. అని నుడివిరి.

ప్ర. భగవంతుడు అందరియెడ సముడంచురే భక్తుల నుమాత్రము రక్షించుట యెట్లుపొసగును?

ఉ. భగవంతుడు అట్లు యెప్పుడును చెప్పలేదు.

గీ. 9. అ. 29. శ్లో

శ్లో. సమోహం సర్వభూతేషు నమే ద్వేష్యోస్తినప్రియః
యేభజంతి తుమాంభక్త్యా మయితే తేషు చాప్యహం

అర్జునా! నాకిష్టము, అయిష్టము లేదు, అందరియందు సముడనే; నన్ను గొల్చువారికి మాత్రము నేను వశ్యుడను వారు నావశ్యులు.

"బ్రహ్మామీమాంసలో" 'వ్యాసభగవానులు' కూడా యీలాగే చెప్పియున్నారు.

శ్లో. వైషమ్య నైర్ఘృణ్యేన సాపేక్షత్వాత్త థాహిదర్శయతి.

తా. ఈశ్వరునియందు వైషమ్యము, నిర్దయత్వము లేదు యెందుల కనగా— జీవుడు చేసుకొన్న పూర్వజన్మ కర్మముల ననుసరించి యీశ్వరుడు ఫలముల నొసగుచుండును.

ఒకకుటుంబమున తల్లికి పదిమంది పుత్రులు వుండిరనుకొనుడు. తల్లికి అందరియందు సమానప్రేమ వుండునేగానీ, వేరువేరుగా నుండదు. ఐనను చెప్పినట్లువినెడి పిల్లవానియందు ప్రేమ యెక్కువగా నుండును.

ఆలాగుననే భగవదాజ్ఞలను తప్పక నెరవేర్చు భక్తునకు భగవానుడు సులభుడు.

ప్ర. భక్తిమార్గముగాక యింక యేమార్గము చేతను భగవానుని పొందుటకు వీలులేదా?

ఉ. జ్ఞానమార్గ మనియు, యోగమార్గ మనియు, నిష్కామకర్మమార్గ మనియు, భక్తిమార్గ మనియు యీ చతుర్ధమార్గములను యిదివరకే నుడివియుంటిమి. అన్నిటి యందును భక్తి చేరియేయుండును.

అట్లు చేరనిచో గారడివిద్య లని పెద్దలు నుడివిరి.

ప్ర యోగమునందును భక్తి అంతర్గతమై యుండునా?

గీ. 6. అ. 47. శ్లో.

ఉ. శ్లో. యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా
శ్రద్ధావాన్ భజతే యోమాం సమేయుక్తతమోమతః.

తా. నాయందే మనస్సునునిలిపి నన్నే సేవించువాడు పైనచెప్పబడిన యోగు లందరికన్నను గొప్పవా డని నాయభిప్రాయము

కావున,— భక్తిలేనియోగము నిష్ప్రయోజనము;

"నారదభక్తిసూత్రములో" 2; అ. 4 సూత్రము.

సూ. తస్యా జ్ఞానమేవ సాధన మిత్యేకే.

తా. కొందరు జ్ఞానమే భక్తికి సాధన మందురు;

5. సూత్రము

సూ. అన్యోన్యాశ్రయత్వ మిత్యన్యే.

తా. మరికొందరు భక్తిజ్ఞానము లొకదానిపై మరొకటి ఆధారపడు నందురు.

6. సూత్రము.

సూ. స్వయం ఫలరూపతేతి బ్రహ్మకుమారా.

తా. భక్తియేసాధనము; సాధ్య మని నారదుల మతము.

7 సూత్రము.

సూ. రాజగృహ భోజనాదిషు తథైవ దృష్టత్వాత్.

తా. అనుభవములేక రాజప్రసాదములు, పరమాన్న

ములు గిలవనేడి జ్ఞానమాత్రముచేతనే మనకు తృప్తి కలుగనట్లుగా, ప్రేమానుభవములేక జ్ఞానమాత్రమున మనకు తృప్తి కలుగదు.

[8] సూత్రము.

సూ. న, తేనరాజ పరితోషః క్షుచ్ఛాంతిర్వా.

తా. ప్రాసాదమును చూడక వట్టి జ్ఞానము చేతనే రాజును సంతోష పెట్ట జాలవు పరమాన్నమును భుజింపక ఆకలి నివారింపజాలదు.

ఆవిధముగా జ్ఞానముగాని, కర్మగాని, ఈశ్వరుని హృదయమును కరిగింప జాలవు మన కోరికను కూడ పూర్తిగా తీర్చజాలవు.

[9] సూత్రము.

సూ. తస్మాత్, సైవగ్రాహ్యా ముముక్షుభిః

తా. కావున భక్తియే మోక్షమునకుత్తమ మార్గము ముముక్షువులు దానినే యుపాసింప వలెను

ప్ర, నిష్కామముగా భజింప లేనివారి గతియేమి.

ఉ. మొదట సకామముగనే భజింప వచ్చును. యేలాగైనను, (అనగా) సకామముగా నైనను సరియే భగవానుని భజించుట, మొదట మానవ జీవితములోనికి రావలెను.

భగవానుని సమీపించుకొలది, మనస్సునకు తమోనివృత్తి యగును. సకామముగా భగవాను నారాధించి, నిష్కాములైనవారు మనకాదర్శకులెందరో గలరు.

ధృవుని చూడుడు. ఇతడు ఉత్తానపాదుడను రాజునకు కుమారుడు. ఉత్తానపాదునకు యిద్దరు భార్యలు పూర్వకాలపు రాజులు యిద్దరిని, ముగ్గురిని, కొందరు పదిమంది స్త్రీలను, వివాహామాడుట కలదు.

రాజులేమి సామాన్యులు సహితము భార్యయుండగనె యింకొకతె, ఆపెగాక యింకొకతె, యిట్లు, వివాహార్థము

సున్న చేసినవారు నాటికి నేటికి సంఘమున ఎంతమంది లేరు?

ఏందరో గలరు. దేహమైనను సుఖమున్నదా యిట్టి జీవులకు అని యోచించితిమేని, వీని ప్రేమ, యిందరికి పంచుటకు చాలక వారిలోవారు కలహించి తుదకు ఎవరివల్లను సుఖము లేక, యిహామందు బాధ, మనోశాంతి చెడుట దేహాలంపట, యిట్టివారు భగవాను నారాధింప గలరా?

నూరు చీలికలుగా మనస్సును చీల్చినవాడు భగవన్నామము చేయుటకు వీలులేక పోవుచున్న దనుటలో తప్పేమి గలదు.

మానవ జీవితములో, ఒక పురుషునకు ఒక స్త్రీ. ఒక స్త్రీకి ఒకపురుషుడు పురుషులంతరించిన స్త్రీలుగాని, స్త్రీలంతరించిన పురుషులుగాని, (అనగా భర్త అంతరించినభార్య, భార్యావియోగమైన భర్త) పునర్వివాహములకు ప్రయత్నించక, బ్రహ్మచర్య దీక్ష వహించి, భగవధ్యానము చేయవలయునని కొందరి మహాఋషుల అభిప్రాయము.

పురుషునకు అగ్ని హోత్రాది సద్విధులు జరుపుటకు గాను, పత్ని వుండ వలయుననిన్ని, అపత్నీకుడు జరుపుటకు వీలులేదనిన్ని రెండవ వివాహము పురుషునకు అధికారమున్న దని కొందరి మహాఋషుల అభిప్రాయము స్త్రీలకు కూడా పునర్వివాహము అధికారము కలదనియు, వివాహ సప్తపదీ మధ్యన, భర్తవియోగము గలిగినచో, స్త్రీకి పునర్వివాహము చేయ వచ్చునని కొందరి మహాఋషుల అభిప్రాయము.

బ్రహ్మచర్య వ్రతము జరుపలేని బలహీనమనస్సుగల బాల వితంతువులకు వివాహము మరలా చేయవచ్చునని కొందరి అభిప్రాయము.

యీలాగున మహాత్ములయందే భిన్నాభిప్రాయము గల వారై యున్నారు. నేటికి సంఘముల యందు సహితము యిట్టి భిన్నాభిప్రాయము గలవారున్నారు గదా?

యిట్టి సామాన్యధర్మము లెన్నియున్నను, యింద్రియ జయము లేనివారికి యీశ్వరుని కరుణ సున్న.

మానవుని గమ్యస్థానము పరమేశ్వరుడే ఆయనను పొందుటే పరమావధి ఇట్టి పరమావధిని పొందవలెనన్నచో యీ వేషము లన్నియు వదలవలె రాత్రియంతయు. నాటక మాడినవాడు తెల్లవారునప్పటికి తానే వేషము వేసియుండునో ఆ వేషము వదలవలెగదా? అలాగున మానవుని హృదయము పరమేశ్వరుని వైపునకు మరలవలెనా? యీ సాంఘిక, ఆర్థికము లకు స్వస్తి చెప్పును

అంతవరకు మానవునకు తానేమి చేయ వలయునో, యేమి చేయుచున్నాను యీవిషయములే బోధపడవు కావున మన ఉత్తానపాద మహారాజు యిద్దరి భార్యలను సమముగా చూడలేక పోయెను. పెద్దభార్యయగు సునీతి ప్రేమించుట మాని, చిన్నభార్యయగు సురుచిని ప్రేమించి తదనురాగ బద్ధుడై, ఆమె యెట్లు చెప్పిన అట్లు చేయుచుండెను.

పెద్దభార్య, దైవభక్తి, పతిభక్తి, జీందము, మొదలగు సుగుణములు గల యిల్లాలు రాజు మహా మోహావేశుడు

గావున సుగుణ సంపత్తిగల భార్యయందు అనురాగము లేక శృంగార సంపత్తిగల చిన్నభార్యను ప్రేమించు చుండువాడు,

పెద్దభార్యకుమారుడు ధృవుడు. చిన్నభార్యకుమారుడు ఉత్తముడు రాజు చిన్నభార్య యందుండు వ్యామోహముచే ఆకుమారుని మిక్కిలి ప్రీతిచే లాలించుచుండెను. ధృవకుమారుని సామాన్యముగ చూచుచుండును

మానవునకు మోహలంపట మెంతవరకు మానసము నంటియుండునో, అంతవరకు మంచి చెడుగు లాలోచించు తెలివి శూన్యము,

రాజు ఒకానొకదినమున చిన్నభార్యకుమారుని తొడపై నుంచుకొని ముద్దిడుచుండ భార్య వద్దనిలిచియుండ ధృవుడు తండ్రియను సహజప్రేమచే బాలుడుగావున, తండ్రియందుండు పక్షపాతబుద్ధిని తెలియలేక తానును తండ్రి తొడపై నెక్కనుంకిచెను.

వద్దనున్న రక్కసియగు సురిచి తండ్రీ తొడ నెక్కుటకు

గాని, సింహాసనము తాకుటకుగాని నీకు భాగ్యతలేదు నాగర్భ
మున పుట్టియుండిన నీకు సర్వభాగ్యతలు కలిగియుండును, నీవు
చచ్చి మరుజన్మమున నాగర్భమున పుట్టిన సింహాస నాధికార
ము, తండ్రిప్రేమ నీకు గలుగును.

సునీతి బిడ్డడవైన నీకు యీ సౌభాగ్యము కలుగదు,
నీవు తపమాచరించి శ్రీహరిని ప్రత్యక్షము గావించుకొని వచ్చి
నను తండ్రిప్రేమ సంపాదింతువో లేదో. గుమ్మముదిగి వెళ్లు
మని నిష్ఠురము లాడెను,

క్షత్రియ అంకురము గావున ధృవుడు పిన్నతల్లి పలికిన
కఠినపు పలుకులకు అదరిపడక భగవానుని ప్రత్యక్షము చేసు
కొనుటకై మనస్సున నిశ్చయించి' పిన్నతల్లి వంకచూచి తల్లీ
అలాగుననే గావించెదనని నుడివి తన మనస్సును నిశ్చయించు
కొని నిజమాతకైనను యెరుకపరచక కారణము మనస్సున
దాచి తపస్సు చేయుటకై అరణ్యమునకు బయలు దేరెను,

అప్పటికి ధృవునకు ఐదు సంవత్సరములు మానసమున
ఆర్తి గలిగి తపించువారిని శాంతి పరచి భక్తి బీజములు నాటు

ట్టకై మహాఋషులు వేచియుండఁగా కావున నారద ముని మాని యెదురుగా వచ్చి కుమారా? నీవెచ్చటి కేగుచుంటివి? నీవృత్తాంతమేమి, యని ప్రశ్నించిరి, ధృవుడు నారదునింగాంచి మునీంద్రా, నమస్కారము నేను ఉత్తానపాదుని కుమారుడను పిన్నతల్లి వాక్య శూలములచే గృచ్చబడితిని, ఆ ప్రణముల బాధ మాన్పు కొనుటకై పరమేశ్వరుని గొలువ నేగు చున్నాడను.

నా, నాయనా నీవు పిల్లవానివి గదా మానవ మాన ములు బాలురకును మహా యోగులకును లేదు. నీవు యింత సాహసమునకై గడఁగితివి. తపమున మహాఋషులకే సాధ్యము గాని నీవంటి కసుగందులు ఆచరించు నంతటి సులభముగాదు. వెనుకకు మరలి పొమ్మని అతని మనోభావము గనుటకై పలికెను.

ధృవుడు రాజ్యాభిలాషి. పిన్నతల్లి నిష్ఠురములచేత నమానసమున రోషబీజము లంకురించినవి. సహజముగా భక్తిచే తపమాచరించ వెళ్లువాడు కాడు. ఒకానొక కార్య నిర్వాహణకైనను, మానవుల నాశ్రయించు వారి కంటెను,

భగవాను నాశ్రయించువారు గొప్పవారు కారా?

ఫలాపేక్ష హృదయమున నిడుకొనియే పరమేశ్వరు నారాధించు చుండెను; ఆఫలమును పొందిన వెంటనే భగవానుడు తనకు తోడుగ నిచ్చువారు లేరను దార్ఢ్యము యేర్పడును. వెంటనే ఆయనయందు విశ్వాసము కుదురును ఆవెనుక హృదయము దయాపూరిత మగును. క్రోధము నశించును.

"నారదమునీంద్రుడు" తనదివ్యదృష్టిచే, ధృవుని భావి కాల నిర్ణయమున నెరింగి నాయనా! నీవిషయ మంతయు నెరింగితిని భగవాను నారాధించు విధానమును నెరింగించెదను వినుమనియెను.

ధృవుడును వినయ విధేయములు తోలుకాడ వినుట కుద్యుక్తుడాయెను.

క. నారదు డిట్లను సనకు కు
మారక విను నిన్ను మోక్ష మార్గంబున కుఁ

ప్రేరేచిన వాఁ డిప్పుడు
ధీరజ నోత్తముఁడు వాసుదేవుం డగుటన్.

వ. నీవు అమ్మహాత్ముని వజ్రస, ధ్యాన, ప్రవణ, చిత్తుండవై భజింపుము. యమునాతీరమునకు వెళ్లుము; అని వాసుదేవ మంత్రోపదేశము జేసి నారదుఁడు, అదృశ్యుఁ డయ్యెను.

మునీంద్రుని మాటలయందు ధ్రువుడు మిక్కిలి విశ్వాసముంచి మానసమును శాంతిపరచుకొని :—

కం ఆయమునాతటి నీ శుభ
తోయములం గ్రుంకి నిష్ఠతో నచ్చట నా
రాయణునకును నమస్కృతు
లాయతమతి జేసి సేయు యమ నియమములన్,

(భాగవతము.)

ధ్రువుని ధ్యానముచూచుడు

సీ. ఆశ్రిత సత్ప్రసా దాభిముఖుండును
స్నిగ్ధ ప్రసన్నా నసౌకుణుండు

నురు చిర వాసుండు సుభూ్రియుగుండును
సుకపోలతనుడును సుందరుండు
హారి నీల సంశోభి తాంగుండు దరుణుండు
నరు ణావలోక నో ష్ఠా ధరుండు
కరుణాసముద్రుండు పురుషార్థ నిధియును
బ్రణతార్తియుండు శోభన కరుండు

గీ. లలిత శ్రీవత్సలక్షణ లక్షితుండు
సర్వలోక శరణ్యుండు సర్వసాక్షి
పురుష లక్షణ యుక్తుండు పుణ్యశాలి
యసిత మేఘ నిభ శ్యాము డవ్యయుండు.

సీ. హారకిరీట కేయూరకంకణ ఘన
భూషణుం డాశ్రిత పోషణుండు
లాలిత కాంచీక లాపశోభిత కటి
మండలుండంచిత కుండలుండు
మహనీయ కౌస్తుభ మణియుక్తమైన గ్రై
వేయ కుండానంద దాయకుండు

సలలిత ఘనశంఖ చక్రి గదా పద్మ
హస్తుండు భువన ప్రశస్త సహజుడు

గీ కమ్ర సౌరభ వనమాలి కా ధరుండు
హత విమోహుండు నవ్యపీ తాంబరుండు
లలితకాంచన నూపురా లంకృతుండు
నిరతిశయ సద్గుణుడు దర్శనీయ తముడు.

వ. అయిన పురుషోత్తముని పూజింపుచు, ఏకాగ్రచిత్తుడై ధ్యానంబుసేయుచు, ధ్యాతుండైన పురుషోత్తముని దివ్యమంగళ స్వరూపంబు చిత్తంబునం దగిలిన మరలనేరదు. కావున, తదేకనిష్ఠు డయ్యె.

నారదమునివలన వుపదేశింప బడిన యీ పరమేశ్వర ప్రసన్న మంత్రమును, యెవ్వడేని ఏడు దినములు జపించినంచో నానేక దేవతాదర్శన మగు ననియు. ఆరుమాసములు నిష్ఠతో జపించిన, మంత్రాధిష్ఠాన దైవముసాక్షాత్కార మగుననియు చెప్పియున్నారు.

సాధారణముగా మనసంఘములలో మం త్రోపదేశకు లెందరో గలరుగదా? ఉపదేశించుకొనువా రెందరో గలరు. ఆ రుమాసములుగదా? నారదులవారు చెప్పినగడువు; మనము అరవై సంవత్సరములుగామార్చుకొన్నను. సాక్షాత్కారము బడసినవారు అరుదు. ఏలనో యోచించుకొనవలయు మనలో మనము యేలోపమో విమర్శించు కొనవలయును.

ఏవిషయము సాక్షాత్కారమునకు ప్రతిబంధకమో, దానిని తొలగించవలయునని, రామకృష్ణాదులు వచించియు న్నారు.

మనుద్రువుడు చక్కని ధ్యాననిమగ్నుడై నిశ్చలముగా తపస్సుచేసెను

చ అతడు ననన్యదృష్టిని జ
రాచర దేహాశరీర ధారణా
స్థితిగల యీాశునందు తన
జీవిత ముద్ఘటియింప జేసి యై

క్ష్యత గన వహ్ని రోధముల
గైకొని కంపములేసి యీశ్వరుం
డతడు చలింప నిజ్జగము
లన్నియు జంచల మందె భూవరా!

తే. నయనముల విభుమూర్తిఁ బానంబుసేయు
పగిది గనుచును ముఖము జుంబనము సేయు
లీల దగభుజములను నాలింగనంబు
సేయుగతి దాడఁబన్నచు స్తుతులొనర్చె.

పిమ్మట 'భగవానుడు' సాక్షాత్కరించి వత్సా మెచ్చితి; నీయిచ్ఛ వచ్చినవరంబు వేడుమనియె.

యెప్పుడాపరంజ్యోతి స్వరూపంబు సాక్షాత్కరించెనో, అప్పుడే ధ్రువకుమారుని మానస క్షేత్రమున నెలకొనియుండు తుచ్ఛ సామ్రాజ్య భోగసంకల్ప బీజంబు భస్మీభూతంబయ్యె. అతడేమియు తెలుపజాలక మాన్పడిన వానివలె నుండె.

అదిచూచి భగవానుడు- కుమారా! నీవు రాజ్యాభి లాషివై యుంటివిగావా? కోరు మిచ్చెద ననెను.

అందుల కాబాలుడు.

శ్లో. స్థానాభిలాషా త్తపసిస్థితోహం
త్వాం ప్రాప్తవాన్ దేవమునీంద్ర గుహ్యాం
కాచం విచిన్వన్ సముపాప్య రత్నం
స్వామిన్ కృతార్థో స్మివరం నయాచే.

(భక్తిసుధోదయము)

మహానుభావా; ప్రభో; దయామయా! యేను రాజ్యా భిలాషినై తపమాచరించినది సత్యము. పరమయోగీంద్రులు బడయలేని నీ సందర్శనభాగ్యంబు బడసితి. గాజుపెంకుకై దేవు లాడువానికి రత్నము దొరికిన వాడు, ఆగాజుపెంకును మరల కోరునా? నీసందర్శనా నంతరము నాకు రాజ్యాభిలాష లేదు. కృతకృత్యుడనైతి; వరంబువలదు; తమ పాదారవింద దర్శన సౌఖ్యమున నోల లాడుచు నేనిట్లే యుండెద. యింతకన్న మిం చినది కానవచ్చుట లేదనియెను.

చూచితిరా! యీ మహాత్పరిణామము. ధ్రువుడు సంక ల్పత్యాగము గావించి నిష్కామ డయ్యె

కావున నే.— నేటికిని ధ్రువమండలము చాల గొప్పదిగా పరిగణింపబడుచున్నది

కాబట్టి— మానవకోట్లు సకామముగా మొదట భగవదారాధన గావించినను, పర్శవేదిసోకిన యినుము బం మగునట్లు, పరమేశ్వర ఫలముకై ఆరాధించినను, అది ఒక సాధనయేకదా?

శ్రీ వివేకానందస్వామి వద్దకువచ్చి గోరవస్త్రీలు సహితము ఆతని గాంభీర్య సౌందర్యములు జూచి, చంచలులయి స్వామివారిని జూచి యెంతో మోహతప్తలై అది మరుగు పరుచుకొని పలుకరించేవారట. నాలుగుదినములు వారి దరిశనము చేయగానే జ్ఞానోదయము గలిగి వారి సంకల్పములను వారేమార్చుకొని, పుత్రునివలె భావించి కృతార్థుల లగుదురట.

కావున,— పర్శవేదిసోకి యినుమును అదివరకున్న కఠినత్వము మాన్పించి మృదుత్వ మొసంగినట్లు, మానసము

భగవానుని ఏలాగైనను స్మరించినంత మాత్రముననే, దానికి ఒకవిధమైన బలముగలుగును.

భగవన్నామమున నున్న ఘనత తెలిసినవారు యిట్లు చెప్పి యున్నారు.

సాధారణముగా మన గృహస్థులు ఆపత్కాలముల యందు భగవానునియందు మనస్సును వుంచి ఆపద్బాంధవా! మాకు యీకోరికల నిమ్ము; నీకు మేము పత్ర, ఫల, పుష్పము లను, వస్త్ర వాహనముల నిచ్చెదమని, కోరికలు కోరుచు డుట కలదు. నెర వేరినచో భగవానునిపై నాడుమొదలు విశ్వా సము కుదురుటయు గలదు.

యీలాగున కోరికలకై భగవంతు నర్చించి, తుదకు యెందరో నిష్కాము లైనవారు వున్నారు.

"గుణమాలిని" యను రాజకుమార్తె భగవానుని గుణ గణములు; తండ్రి ఆస్థానపండితుడు వుపన్యసించు చుండగా విని, ఆపురుషోత్తముడు నాకు భర్తగా నుండిన కొరత లన్నియు

నశించునుగదా? యని తనమనస్సున నిశ్చయించుకొని, భగవా నుని ఛాయాపటమును తన కన్యాంతఃపురమున నిడుకొని, నిత్యము పూజించుచు చెలులకు కానరాకుండా దాచుచు, రాత్రులయందు తన శయనమందిరమున ఆఛాయాపటమును పూలపాన్పుపై జేర్చి పాదసేవజేయుచున్నట్లుగ భావించుచు, ఆనందించు చుండెను.

తండ్రి అమ్మాయికి వివాహ ప్రయత్నము చేసెను. ఆవిషయము గుణమాలనికి తెలిసినది. పతివ్రతలకు అన్యపురుషాభిలాష తగునా? నేనెట్లు యితరుని పెండ్లియాడుట; తండ్రితో తెలుపుదునా? యని యోచించినది. కాని చెప్పుటకు సాహసించలేదు.

నాటిరాత్రి అంతఃపురమునకు చెలులనుకూడా రానియ్యలేదు తానొక్కతి భగవానుని అనేకవిధముల ప్రార్థించినది. చిత్రపటమును ముందుంచుకొన్నది. ఆర్తి ఆవేదనమిక్కుటమై

సీ. అరుదెంచు మోయి కృష్ణా నీ పదద్వయి
కన్నీటి ధారచే కడుగుదాన

దయచేయు మోయి నాథా మనోంబుజ గత
ప్రేమరసంబు నర్పించుదాన
మేలెంచు మోయినా విభా నీకు మీఁదిడి
నట్టి ప్రియము కానుకఁ బెట్టుదాన
రావోయి యదుకిశోరా మధురాధరో
ష్ఠామృతంబున తాప మార్పుదాన

సీ. వేగవిచ్చేయు మోయి గోపీముఖాబ్జ
దినకరా నీదుసేవ నర్థించుదాన
చిత్రపటరూపమున నను చేరనేల
కదలి రావోయి కనులార గాంచుదాన

ఈప్రకారము ప్రార్థింప భగవానుడు ఆ కన్యాలలామ భక్తికిమెచ్చి ఆ రాత్రియే నచ్చటసాక్షాత్కరించెను. ఆ దివ్యతేజోమయుని జూచినవెంటనే, భర్తయను చింతవదలి భగవంతుఁడను భక్త్యుత్పన్నమై దేహభోగమునకై ప్రార్థించిన అపరాధము మన్నింపు మని. ఆత్మానందమున నోలలాడ ప్రార్థించెను.

నిష్కామురాలయి, మహాయోగినియయ్యెను. కావున, సహేతుక భక్తియు మంచి సాధనయే.

మహాసముద్రమునకై పోవువారు అనేకులు! అందరు ఒకపనికై సముద్రమువద్ద చేరుటలేదు ఒకడు గాలినిపీల్చుటకు వెళ్లును; ఒకడు మత్స్యములకై వెళ్లును; (అనగా చేపలుపట్టుటకు వెళ్లును) ఇంకొకడు పడవలనెక్కిపోయి యెచ్చటనో రత్నములున్నవని, ప్రయాణముచేయుటకు పోవును. యింకొకడు స్నానముచేసితె పుణ్యమురాగల దని వెళ్లుచుండును. ఒక డూరకచూచుటకై వెళ్లుచుండును; ఇట్లు అనేకజీవరాసులకు, అనేకపుపయోగములు సముద్రమునందు యేలాగున నున్నవో, ఆలాగుననే భగవాను ననేకజీవరాసు లు ఆశ్రయించును.

భగవానుని చరిత్రములు వినుచుకొందరు, పాడుచుకొందరు, కోరుచుకొందరు, దైవముగాభావించి కొందరు, పుత్రునిగాభావించి కొందరు, భర్తగాభావించి కొందరు, ప్రభువుగాభావించి కొందరు, తండ్రిగాభావించి కొందరు, సఖుడుగాభావించి కొందరు, బంధువుగాభావించి కొందరు, తల్లిగాభావించి కొం

దరు, ప్రపంచ మంతయు దైవముగా భావించి కొందరు, నిష్కా-
ములు; కొందరు సకాములు

ఇట్లు ప్రపంచనాటకము జరుగుచున్నది.

ప్ర) ఇన్ని భావనలు అపాయకరముకాదా?

ఉ. అపాయకర మేమున్నది? తండ్రిగా భగవానుని
భక్తిచేసినను, తల్లిగా, సఖుడుగా, ప్రియుడుగా, ఎట్లు భక్తి
చేసినను భగవంతుని స్ఫురణ కలిగినచో లాభ ముండకపోదు.

ఎన్నిలాభములయిన తెచ్చును నష్టముకలుగు ననుట
నిజము.

కం. చెడుగరులు హారులు ధనములు
చెడుదురు నిజ సతులు సుతులు చెడు చెనటుల కు
న్నెడక మనునట్టి గుణులకు
జెడని పదార్థములు విష్ణు సేవా నిరతుల్.

ఆ.వె. కర్మతంత్రుండగు కమలాక్షు గొల్చుచు

నుభయ నియతివృత్తి నుండ నేని
జెడును; గర్మమెల్ల శిథిలమై యెల్లన
బరిబలమైన విష్ణు భక్తి చెడదు.

కావున,— కోరికల కొరకై నను భగవానుని ఆరాధించి తిమేని కోరికలవలన లభించునవి అల్పములు; గాన. అవి నశించినను భగవానుని పూజించి, ధ్యానించి. నమస్కరించిన సంస్కార బలముచే వాడు తప్పక మరుజన్మ మందైనను భగవచ్చింతన జేయుటకై ప్రయత్నించును,

కావున నే, 'గీత'యందు:

శ్లో. బహూనాం జన్మ నామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే.

బహు జన్మలు యెత్తిన తర్వాత నన్ను తెలుసుకొన వచ్చును, అని ప్రభువు తెలిపియున్నాడు.

ప్ర. బహుజన్మలైనగాని పరమేశ్వరు నారాధించు భాగ్యము గలుగదా?

ఉ. ఈజన్మమున భగవానుని నారాధించుచున్నా డనిన

వానికి పూర్వ సంస్కారము బలవంతమై యుండితీరవలె లేకున్నచో అంతటి విశుద్ధతరాదు.

ఎంత సంస్కారమో; అంతటి నిర్మలము యుండును.

కావున,- పాప సంస్కారము గలవాడు పాపకార్యము లాచరించును. పుణ్య సంస్కారము గలవాడు పుణ్య కర్మ లాచరించు చుండును.

కావున,- సంస్కార బలమును బట్టి వాని వాని పనులు వాడు చేయును

ప్ర. అట్లు సంస్కార బలముచేతనే మానవ జీవితములు జరుగుచున్నచో యట్లున్న నట్లుజరుగుగాక! యిప్పుడు ప్రయత్నమేలా?

ఉ. ఆలాగుకాదు; నిదానించి యోచించవలె. సంస్కార బలముచేతనే మానవుడు ఆయాకార్యములు చేయుచుండును. దైవవశమున సత్సాంగత్యము కలిగినచో, పాపసంస్కారము చే

చేయుకర్మల నిరోధించు బోధ జరుగును. అలాగున తీవ్రముగా సత్ప్రవర్తనయందు మనస్సును ప్రవేశ పెట్టినచో సంస్కారము మారును.

అలాగే పాపసాంగత్యము బలమైనచో, పుణ్యసంస్కారము నశించును.

కావున,— యెప్పుడును మంచిసంకల్పము, మంచిసాంగత్యము, సంస్కారముచు వృద్ధిచేయును కనుకనే, కోరికలయందును పరులకు మేలుకావలయు నని కోరువారు పుణ్యసంస్కార జీవులు.

పరులకు చెడువు కావలయుననికోరుట యెన్నటికిని తగదు. "వ్యాసభగవానులు" పదునెనిమిది పురాణముల సారము ఒకశ్లోకమున ముగించినారు. అదేదన—

శ్లో. పరోపకారః పుణ్యాయ

పాపాయ పర పీడనం.

పుణ్య పాపవిమర్శనకై యెన్నియో వితర్కము లవసు

ములేదు పరుల కుపకారముచేయుట పుణ్యమనియు, అపకారముచేయుట పాపమనియు సిద్ధాంతీకరించిరి.

కావున.- పరుల కుపకారముచేయుటలో మనస్సు త్యాగసిద్ధాంతము నంగీకరించినట్లగును త్యాగ మంగీకరించినను మనస్సునందు "దయ" స్థాపిత మగును. దయగల హృదయమున భగవానుడు స్ఫురించుచుండును.

భగవానుని స్ఫురణగలిగినచో అన్యస్ఫురణ తగ్గిపోవుచుండును. ఆలాగున తగ్గినకొలది మానవుడు, పవిత్రుడై తన గమ్యస్థానమును తాను గుర్తించును.

సాధారణముగా మానవుని హృదయమున, చిన్నచిన్న కోరికలుత్పన్నము లగుచుండు ననుకొనుడు; ఆకోరికలు చెల్లుటకై పరమేశ్వరు నారాధించు ననుకొనుడు; భగవదారాధన యెక్కుడగుకొలది కోరికలు సన్నగిలి తుదకు మాయమగును. కావున. కోరికలద్వారా భగవాను నారాధించుటయు నొకసాధనయే

ఇంకను కోరికలద్వారా, గాక వ్యక్తిద్వారా భగవానునారాధించువారు గలరు "భీష్ముడు" శంతనమహారాజుకున్ను, గంగాదేవికిన్ని కలిగిన పవిత్రపుత్రుడు. గంగా, శంతనుల సమాగమ కాలమున, భర్తనొక వడబడుపు అడిగినది. (అనగా ఒక ఒప్పందల) యేమనిన, నాకు తామెదురాడిననాడు తమను విడచి వెళ్లిపోదును; ఆనాడు మీరు మారుపలుకకూడదు; అని వొప్పందల గావించుకొన్నది శంతనుడు వొప్పుకొని గాంధర్వ విధియుక్తముగా వివాహము గావించుకొనెను.

కొన్నిదినములకు గంగాదేవి పుత్రుని గాంచెను; రాజు సంతసించెను గాని, ఆపిల్లవానిని ఆతల్లి గంగాజలములయందు పారవేసెను. సజీవ పుత్రుని సింధుప్రవాహమున పారవేయుట యేమియని చూచియు అడుగలేదు.

మోహముచేతనన- ఆమోహమందుండు గారాబముచే పుత్రుడేమైననేమి? భార్యవున్న చాలు ననుకొని మందలించలేదు. మందలించిన విడిచిపోవునను భయముచేత, యేడుగురి బిడ్డలను గంగాప్రవాహములో పారవైచినది.

అప్పటికి రాజుమనస్సు కొంతమారినది. గంగాదేవిని మందలించవలెనని యోచించు చుండగా, యెనిమిదవ పిల్లవానిని ప్రవాహమునందు పడవైచుసమయమున రాజు అడ్డమువచ్చి యీబిడ్డనైనను వుండనియ్యవా? కన్నతల్లులు బిడ్డలను జాపుట నీయందుగానవచ్చుచున్నది; గాని, యెవరియందున గనబడుట లేదు; అని మందలించెను.

గంగాదేవి ప్రత్యక్షముగా చంపిన (ఆదికారణము) చంపబడినవారు వసువులనిన్ని, శాపకారణమున ప్రపంచమున జన్మకలిగిన దనిన్ని, గంగాదేవి వారిని ప్రసవించునట్లు వొప్పుకొనినదనిన్ని, పుట్టగానె వారిని స్వస్థానమునకు పంపుటకయి గంగయందు పడవైచిన దనిన్ని నుడువుదురు

రాజు యెనిమిదవవానిని ఆపెను; పూర్వ ప్రతిజ్ఞాప్రకారము, తాము నాకుయెదురాడినారు కావున, నేను తమనువిడిచివెళ్లుదు నని చెప్పి గంగాదేవి వెడలిపోయెను. ఆయెనిమిదవ పుత్రుడే భీష్ముడు

భీష్ముని తండ్రి ప్రేమించుచు, విద్యాబుద్ధులు నేర్పుచు పెద్దవానినిగా చేసెను.

పిల్లవాడు యువరాజ్యమునకు తగియున్నాడు; యిట్టి సందర్భమున, శంతనుడు గంగాతీరమున విహరించుటకు వెళ్లెను.

నదియందు పడవనడుపుచున్న బెస్తవానికన్య (దాశరాజు అనువానిపుత్రిక) నుజూచి మోహించి ఆకన్యను మందలించెను

అయ్యా? రాజా! కన్యలు యెప్పుడును తల్లి దండ్రుల స్వాధీనమున మెలంగవలయును గానీ, స్వేచ్ఛాప్రవర్తకులు కాకూడదుగదా?

మాతండ్రియాజ్ఞగొని వివాహ మాడవచ్చును; యింతకు తాము రాజులు; మేము పేదలము; పోసగునా? అని వినయముగామాటాడి వెడలిపోయెను.

ప్ర. రాజకొమార్తెలేమి, యితరకన్యలేమి తాముపరులను వరించలేదా? తప్పేమి.

ఉ. వరింపవచ్చును విద్యావతులై పేరిమయననేమొ, మోహమన నేమొ. తారతమ్య మెరిగినవారయినచో బాధ లేదు. మోహావేశులయి, యింగితజ్ఞానశూన్యులై, తాత్కాలితమునకై యెవరినైనను వరించిన వంశహానియు: ధర్మహానియు సంప్రాప్తించును గాన. కన్యలను మొదట విద్యావతులన చేయవలయును

స్త్రీలవిద్యావిధానములు ప్రస్తుతకాలమందు మార్పులు జనించినవి హూణ విద్యయందు పరిచయము అధికమైనది. అయినను, యించుక సంస్కృతము. ఆంధ్ర భాషలనుకూడా అభ్యసించినచో చాలా బుద్ధివిశాలతకు తోడ్పడగలదు; మన హైందవధర్మములు వేరు; పాశ్చాత్యధర్మములు వేరు; హిందువులలో పాతివ్రత్యము స్త్రీలముఖ్యధర్మము; దానిని తెలుపు మన గీర్వాణము పాశ్చాత్యవిద్య మనధర్మముల వంతగా సరకు గొనదు; గాన, తారుమారుగా మార్చవలెను.

రాజు వెషలి యిల్లుచేరి మనస్సంతయు దాసకన్యయందు జేర్చి రాజ్యాంగ విషయములయందు విముఖుడై మంత్రులకు

చెప్పలేక కుమారుడగు భీష్మునితో చెప్పుటకు సిగ్గుపడి. దిన దినము తననిత్యకృత్యములయందు మార్పులుజనించుట మంత్రులుగాంచి, రాజుమనోగత మెరింగి భీష్ముని కెరిగించిరి.

శంతనుడు కొమారునికి యీవృత్తాంతము తెలిసినదని వినియు తనఅభిప్రాయమును మార్చుకొనలేదు; యింద్రియావేగము నడంచుట చాలదుస్తర మని పెద్దలుచెప్పుట అబద్ధమగునా?

పితృభక్తి భీష్ముని ప్రేరేపింప దాశరాజు మందిరంబున కరిగి తండ్రికై దాశరాజును కన్య నిమ్మని వేడెను.

అయ్యా రాజకుమారా! తాముక్షత్రియులు; మేముజాలరులము; బంధుత్వము పొసగునా? పొసగినను నాకొమార్తె కుద్భవించు సంతానము రాజ్యార్హ మగునా? యేటిమాట మిన్నకపొందు; పెద్దకులమువారైననేమి పొసగనిమాట లాడరాదు; అది చెల్లరాదు.

భీ. అయ్యా! నీపుత్రికకు ద్భవించు కుమారునకు రాజ్యమొసంగెదము; సమ్మతింతువా?

దా. అయ్యా! తాముండగా ప్రజలా కార్యము సమ్మతింతురా?

భీ. నేనుసమ్మతముగా రాజ్యము వదలెదను.

శా. రాజ్యంబక్కఱ లేదు నాకు సక
లా రాతిక్షమానాథ సా
మ్రాజ్యంబుల్ వెసగొల్చి తెచ్చెదను నీ
మన్మండై యీసర్వముఁ
పూజ్యండై భరియింపగాగలడు సో
ముఁ డర్కుఁడుఁ సాక్షులే
నేజ్యేష్ఠత్వము వానికిచ్చితిని నీ
కింకేల చింతింపగా

అనిభీష్ముఁడు రాజ్యాభిలాషవదలి తండ్రియభిలాష నెరవేర్ప సమకట్టెను.

దాశరాజు ఆ గీకరించియు కార్యోత్సాహి కాకుండుట జూచి భీష్ముడు అయ్యా యేమిఆలోచించు చుంటిరి?

దా. యేమియులేదు; తాము రాజ్యము విసర్జించినను తమపుత్రులు రాజ్యమునకు బాధ్యులు కారా?

భీ అదియా తమసందేహము;

ఉ. పెండిలియాడినం బిదప
బిడ్డలు బుట్టుటగల్గు నే నిదే
పెండిలి మానుకొంటి నని
బిట్టుప్రతిజ్ఞ యొనర్చితిన్ మహీ
మండలి బ్రహ్మచారినయి
మన్ననకున్ కుదురాదుగాక బ్ర
హ్మాండము మున్గిపోవు నె య
హో ఒకడీగతి నుండిపోయినన్

ఇట్లు పాలిపంచక సుఖములను తుచ్ఛమని పితృభక్తి కొరకై మనఃపూర్వకముగా వదలి తండ్రివద్ద నిలిచెను; తండ్రి సంతసించెను.

నాయనా! నాకై నీవురాజ్యాది విభవము లన్నియు తుచ్ఛమని భావించితివి గావున. నీకు స్వచ్ఛందమరణము గలుగు నట్లు వర మొసంగితి ననెను. (స్వచ్ఛందమరణమన మృత్యువు తనస్వాధీనముగానుండుట ) మృత్యువు స్వాధీనమన్న సామా న్యమా ?

భీష్ముడు నిత్యవైరాగ్యము, బ్రహ్మచర్యము, రెండును గడించి అనవరతము పరమాత్మ దర్శనము కలవాడై మరణ కాలమున భగవానుని స్మరించి ఆతని నిత్యపదవిని పొందెను

కావున— పితృభక్తియు గొప్పసాధనయే.

దశరథేశ్వరుని జ్యేష్ఠపుత్రుడగు శ్రీరామచంద్రమూర్తి పితృభక్తిచేత నేగదా పదునాలుగు సంవత్సరములు అరణ్యవా సముగావించి, సతీ, సోదరుల వెంటనిడుకొని, సకలఋషిఆశ్రమ ముల దర్శించి, సుగ్రీవాది వానరశ్రేష్ఠుల సఖ్యముగావించి, ఆంజనేయాది మహావిశ్వాసుల సేవబడసి, రావణాదిరాక్షసవధ గావించి లోకము నిష్కంటకముగా జేసెను.

కావున— పితృభక్తియు మహాసాధన.

మాతృభక్తియు మిక్కిలి సాధనయే! వేదములు సహితము (మాతృదేవోభవ పితృదేవోభవ) అని చెప్పియుండుటచే తల్లి తనకు అన్నివిషయముల యందును పూజ్యురాలు.

తల్లిని తెలియుట మానవున కొక్కనికే; తల్లి పశుపక్ష్యాదులకు కూడా తెలుసును.

నోరెరుగని పశువులుగూడా అమ్మా! యని అరచుచున్నవి. తల్లినిచూడగానే గూళ్లనుండి పక్షులపిల్లలు నోరు తెరచుచున్నవి. తల్లినిచూడగానే దూడలు అంభారావములు చేయుచున్నవి.

కావున— తెలివిలేని పశువులు, పక్షులు, తెలివిగలిగిన మానవుల వరకు తల్లియే మొదటిదైవమై యున్నది. తల్లిని ప్రేమింపలేని జన్మ మెందులకు? వ్యర్థము.

తల్లులు విజ్ఞానవతులు; గావుననే, కుమారులు విజ్ఞాన

వంతు లగుచున్నారు; అని "క్రైస్తవు" నుడివి యున్నాడు. (గాంధీగారు) మాతల్లి పుత్తలీబాయి గొప్పదనమే నన్నుయింతవానినిగా జేసినది; అనిచెప్పిరి. (స్వామివివేకానంద) మాతల్లి భువనేశ్వరీమాత గారి గొప్పదనమే నన్నింతకుదెచ్చినదని చెప్పిరి.

విన్నకోట వెంకటరత్నశర్మగారు తాము వ్రాసిన శ్రీకృష్ణ చైతన్యావతార మను గ్రంధమునందు కల్ల, కపటము నెరుగనిదియు, అమాయకురాలును, నానిమిత్తమయి తనశరీర ప్రాణ ధనముల నర్పించినదియు, విన్నకోట లక్ష్మీనరిసింహాశర్మ గారి ధర్మపత్నియు, మాతృశ్రీయునగు సుందరమ్మ తల్లిగారి పాదారవిందములకీ గ్రంథము భక్తితో సమర్పింప బడినదని వ్రాసిరి.

తమగ్రంధములను ప్రపంచమున ధనమునొసంగువానికే కృతిని సమర్పింతురు. వానిని గోరంతలు కొండంతలుగా పొగడి యింద్రుడు, చంద్రుడని తుచ్ఛధనమునకై, తనకీర్తికై పొగడుచుందురు.

ఇంకకొందరు ప్రత్యక్షదైవమును విడచి పరోక్షదైవ ములకై ప్రాకులాడి తమగ్రంథముల, తమపూజల నర్పింతురు.

అట్లుకాక మానవులు ఋణత్రయ విముక్తి కానిదే మోక్షమునకు భాధ్యులు కారని యెఱిగి (ఋణత్రయములన మాతాపితరుల రుణము దేవతల రుణము, మానవుల రుణము) కావున వీరు తమమాతాదేవికి అర్పించిరి; ఇష్టే తల్లిదండ్రులకు అర్పణచేస్తూ దేవరుణముతీరుటకై భగవన్నామముజపించుచూ

మానవరుణము తీరుటకై తనకు తెలిసినది ప్రతిఫలము కోరక బోధించుతూ వుండవలయును యివన్నియు పై పేర్కొన్న మహనీయు లందరు జరిపినవారే.

మాతృగౌరవమును చూపని వాడు దైవగౌరవ మేమి తెలియగలడు. తానొకవ్యక్తి ప్రపంచమునతిరుగుటకు మాతృదేవియేగదా? కారణము తనతండ్రిని తెలయచేసినది తల్లియే గదా? తనయాకలి దప్పులు తెలిసి పోషించినది మాతయేగదా? ఆమె పెంచిన శరీరము తోటేగదా మనము సకల ధర్మములు స్థాపించుట; తుదకు ప్రపంచ భోగానుభవము మాతిచ్చిన శరీర మున్నగదా అనుభవించుట?

కావున- మాతృదేవి యెంత ప్రేమతోనే యెన్నికష్ట

ముల కోర్చియొ పెంచినశరీరమును, మాంవుడు దుర్వ్యయము చేయక విశ్వమాతయగు మనభారతమాత సేవకై వినియోగ పరుపవలయును

విశ్వమాతృసేవ చేసినవారును తమశరీర ధారణకర్త్రియగు మాతృసేవ చేసినవారును ఒకటియే; కాని విశ్వమాతృ సేవయందు యింకనొక గొప్పతన మున్నది

అదేమన భారతపుత్రులందరు తమసోదరులను భావము విశాల మగును హృదయవిశాలతయే మానవ ాభ్యున్నతికి కారణము

స్వామివివేకానంద భువనేశ్వరిసేవ జేసియే ఆయానంద మనుభవించియే విశ్వజననియగు భారతమాత సేవ చేయగలి గెను;

గాంధి, రామతీర్థ తిలకు, యిత్యాది వీరులు, ధీరులు; తమ మాతృసేవచేసి సేవానంద మివియని గుర్తించి విశ్వజనని సేవకులై దేశోద్ధారకులైరి; భువనమాతయగు భారతజననిసేవ (పూజ) నేటికిని యెడతెగక సాగుచున్నది.

భక్తసోపానము.

సీసమాలిని:

1 పాలగంగాధరుం డలపట్టు ఛత్రంబు
బలుమోదమున కేలు బట్టినిలువ

2 చిత్తరంజనదాసు చెలగిపటేలు తా
వింజామరంబులు వీచుచుండ

3 దీనబంధుడు దయాబ్ధియు మోతీలాలు
తులలేని మణిహారములనువైవ

4 గాంధీమహాత్ముడు ఘనకిరీటము బెట్ట
జవహారీలాలు జే జే లనంగ

5 సేనుగుప్త సుభాసుచంద్రబోసు లిరువురు
యెత్తినతాంబూల తతు లొసంగ

6 ఆంధ్రరత్నము దుగ్గిరాల్ గోపాలక్రిష్ణయ్య
రమణీయ పుష్పహారములువైవ

7 సత్యశిరోమణి సాధ్వీశిరోమణి కుదురుగా
నుదుట కుంకుమముదిద్ద

8 దేశభక్తుడు స్వర్ణ జలకలశమును వేర
కాసినాథుడు కాళ్లు కడిగియెత్త

9 ఆకాశగంభీరు డరవిందఘోషు తా
తోరంపు ప్రీతి పా డుకలుదొడగ

10 వసిష్ఠులైన భగ వత్సింగ్ సుఖదేవు
లానందమున నృత్య మాడుచుండ

11 మహిమాన్వితవ్యక్తి మళయాళస్వామి తా
చేతులుజోడించి చెంతనిలువ

12 రమణగీతాప్రచా రకులైన వెంకట
రత్నశర్మయు చెంత రాజిలంగ

గీ. ఆంధ్రమాతకెల్ల కర్పూర హారతులిడ
ఖండ ఖండాంతరముల ను ద్దండలీల
వెలిగి తద్దేశవాసుల మెప్పుగాంచి
నీవు నీపుత్రకులకు వన్నియను దెచ్చె
అమలగుణ మాలికోపేత ఆంధ్రమాత.

ఇట్లు ఆంధ్రమాతను సేవజేసినవారు యెందరోగలరు.
కావున— మాతాపితరులసేవ తరించుటకు సోపానము
వంటిది సుమీ!

"ధర్మవ్యాధు" డను వాని చరిత్రము చూడుడు! వాని కులము యెట్టిదయిననేమి! వానినడవడిచేత, వానిమాతాపితృసేవచేత, ఆభక్తిచేత యీశ్వరార్పణ బుద్ధితోటి తన స్వధర్మాచరణ విజ్ఞానమును సంపాదించి యుండెను.

మాతాపితృసేవకంటెను, స్వధర్మముకంటె నుత్తమమయినది తపస్సే గొప్పదను పద్ధతిలో, నొకబ్రాహ్మణుఁడు యేకాంతప్రదేశమునందుచేరి తపస్సుచేయ నారంభించెను.

ధర్మదూరము, దయావిహీనమునగు తపస్సువలన రాజసభావము పెరిగినది; బ్రాహ్మణుఁడు డెరుఁగడు; కన్నులుమూసి కొనియుండుతరి కొన్నిపిట్టలు మేతకయి తిరిగి తిరిగి ఆబ్రాహ్మణుడుతపస్సుచేయు చెట్టుపైవ్రాలినవి; ఆ చెట్టుపైకి మనబ్రాహ్మణుడు చూచునప్పటికి కొన్నిపిట్టలు క్రిందపడినవి; కారణమేమి?

ఒకనాడైనను తన నేత్రములతో పరమేశ్వర సృష్టి విచిత్రమును తిలకించి ఆనందించిన నేత్రములు కావు. దయార్ద్ర దృష్టితో భూతజాలముల జూచిన నేత్రములు కావు.

కన్నులే కాదు. సర్వ అవయవములు పరమేశ్వరు డెందులకు ప్రసాదించెనో యెఱుంగ వలయును.

సీ. సద్వస్తు సందోహ సౌందర్య గరిమంబు
 యెలమిఁజూడగ కన్నులిచ్చితయ్య
అవ్యక్త మధురంబులైన యారావము
 లింపుగ విన వీను లిచ్చితయ్య
షడ్రసంబుల రుచుల్ చవిచూచి తెలియంగ
 నొనరగ రసనంబు నొసగితయ్య
ప్రస్ఫుట. సీతోష్ణ పద్ధతు లెరుగంగ
 నోజఁ ద్వగింద్రియ ముంచితయ్య

గీ. వాసనలజూడ నొసగితి నాసికయును
పాపపుణ్య వివేచనా ప్రాప్తి నెసగ
జ్ఞానమిచ్చితివయ్య విజ్ఞాన గమ్య
సకల కల్యాణ గుణధన్య సర్వమాన్య.

సీ. చెలువమైనట్టి నీ సృష్టి విలాసంబు
 చూడని కన్నులు పాడుదొనలు

నిగమ సంస్తుత్యమౌ నీ చరణములు నకు
గాలని రసనంబు గరగసంబు
జ్ఞాన నేత్రంబున గనక నీరూపంబు
పులక మొందని మేను బోదెగాదె
జగతీశుడగు నిన్ను సంస్మరించుటయందు
బరగని యాబుద్ధి పాడుబుద్ధి

గీ. అఖిల లోకంబులను కుక్షి యందిమిడ్చి
యెందునంటక నన్నిటి యందునిండి
యలరు నీదగు మహిమను దెలియనట్టి
తపసిజన్మము జన్మమే దలచిచూడ
సకలకల్యాణ గుణధన్య సర్వమాన్య.

ఇట్లు సర్వేంద్రియ పవిత్రత గలుగుటకు పరమేశ్వరా రాధనయందు సంచరించుటయే కారణము; మనకా శుకుడు సర్వేంద్రియములను శుష్కింప చేయడమేగాని భగవానుని యందు లయపరచినవాడు కాడు కావున పిట్టలు క్రిందపడినవి,

యిప్పటికిని కన్నులయందు అనేక విధములగు దృష్టి మార్పు లుండుననియు కొందరి చూపుచే ఆరోగ్యము మానవునకు కలుగుననియు వైద్యశాస్త్రములందు గలదని వినియున్నాము దృష్టి తెలివియు జ్ఞానము భావ గలిగినదనియు చెప్పెడి వాడుకలున్నవి

మనదృష్టి గలిగిన కన్నులకు ఆలాటి ఆపద సంబంధమె యుండునను ప్రతీతిగలదు. పిట్టలు క్రిందపడగానే నాతపస్సు సార్థకమైనదని కౌశికుడు తలచెను. చక్కని ప్రబోధలేని కాలమున యితరులకు అపకారముచేసి తాము సంతసించుచుందురు.

ఆలాగున బ్రాహ్మణుడు సంతసించుచు బ్రహ్మచారి గావున ఆకాలమున మాధుకరవృత్తిలో బ్రహ్మచారులుండవలసిన విధిప్రకారము భిక్షకై బయలుదేరి ఒక యింటి గుమ్మము కడ నిలువబడి "భవతి భిక్షాం దేహి" అని బిగ్గరగా అరచెను. ఆ యిల్లాలు పాత్రశుభ్రపరచి భిక్షను తెచ్చుటకు సిద్ధముచేయుచుండ యింతలో ఆమె భర్త స్నానమునకై గంగకరిగినవాడు యింటికి వచ్చెను.

భర్త వచ్చుటచూచి యాసాధ్వి యెదురుగాచని కమండలమందుకొని యింటిలోనికి పిలుచుకొనివెళ్ళి పీటమపర్చి కూర్చుండ జేసెను.

భర్త: ప్రియా? వంటకము లన్నియు సిద్ధమయినవా? నీ గౌరీపూజ గీతాపారాయణము అయినదా?

భార్య: నాథా? తాము స్నానమునకు వెళ్లగానే నేను వంటలన్నియు జేసితిని. తాము నిన్నటిరోజున చెప్పిన గీతాశ్లోకములన్నియు నేడు కంఠస్థము చేసియున్నాను.

భర్త: చాలా సంతోషము నేటి స్త్రీలసభలో నీతోటి సోదరీమణులకేమి బోధ గావించితివి.

భార్య: స్త్రీలకు ఆధ్యాత్మిక ధైర్యము విద్యాకౌశల్యము విశ్వప్రేమ, అతిథిపూజ, పతిసేవ, శిశుపోషణ, గృహకార్యనిర్వాహణము, కార్యాకార్య విచక్షణ, గ్రంథపఠనము, మృదుభాషణము, లోభవర్జనము, దైవభక్తి, పరదూషణావర్జనము, అత్తమామల సేవ, యథోచిత దేహాలంకారము, యి

త్యాదులు నేటిదినమున మామహిళా మండలియందు వ్యాప్తి చేయ బడినది

భర్త: నీవు యెన్నది అనుసరింతువో దానిని చెప్పుము. ఎట్లు చేయుదువో దానిని చెప్పుటయే నిజమైన ఈశ్వరసేవ దేశసేవ

భార్య: యివన్నియు తాము క్రమశిక్షమొయి నాకు నేర్పి నవియే గదా.

భర్త; ప్రేమపీ నేర్పు వారుందురు గానీ నీవలె బుద్ధిశాలియై అనుసరింప వలెగదా?

భార్య: నాథా! స్త్రీయనిన బంగారము ముద్దవంటిది. భర్తయనిన కంసాలివంటి వాడు. యెట్టి నగలుగా మార్చవలె నన్న కంసాలిబంగారమును అట్లుమార్చును తమవలె వుత్తమ ప్రేమగల భర్తయే యైనచో స్త్రీలేల ప్రతిఘటించెదరు; స్త్రీలు ప్రతిఘటించి రసినచో పురుషు లయందు యేదైనను లోటు వుండునని తలంచెదను నిజమా?

భర్త: నీయూహ మాటలయందు కొంత నిజమున్నది. తనయందు యెంత ప్రేమజూపిన అంత ప్రేమ భర్తల యందు భార్యలు చూపుదురు కేవల భోగములకై శారీరక సంబంధ సంపదలకొరకై చర్మ సౌందర్యము కొరకై చూపించు ప్రేమ నిష్ఫలము.

భార్యలను ఆధ్యాత్మిక సేవకై వినియోగపరచి చక్కని నిర్మల ప్రేమచే వారిమనస్సును పెంపొందింప జేసినచో భార్యవంటి బంధువు గలదా? తానట్టి ధర్మములనాచరించునో అట్టి భార్య తప్పక యీశ్వరానుగ్రహముచే ఘటియింప గలదు.

తాను త్రాగుడు బోతైనచో భార్య వ్యభిచారిగా మారగలదు భార్యయనగా తననీడయని ధర్మములు చెప్పుచున్నవి తాను వంకరగా నడచిన తననీడ సక్రమముగా నడచునా? (భార్య గయ్యాళైన ప్రాణనాధుని తప్పు) అన్నట్లు మీ క్రమ మార్గమునకు అక్రమ మార్గమునకు మేము కారణము.

భార్య: ప్రాణేశ్వరా! యిట్లు ప్రబోధించువారు మదీయ భాగ్యవశమున లభించితిరి గాని సామాన్యమా? భర్తయను శబ్దము తమయందు ఆరోపణ కాగానే ప్రేమచూపుట భక్తి నేర్పుట. ఆధ్యాత్మిక ధైర్యంబు గరపుట సీలసంరక్షణార్థమై స్వాతంత్ర్యంబు నొసంగుట మాని దౌర్జన్యము చేయుట హృదయమున పాడుచేయుట కొట్టుట మన్ననలేకపోవుట నీచముగా మాటలాడుట యిత్యాది కార్యములకై గడంగుటచేత గదా.

స్వర్గముగ నుండవలసిన సాంసారిక కృత్యములు నరక తుల్యముగా మారుచున్నవి.

భార్యాభర్తలిరువురును భగవద్విచారములను గావించుచు ప్రేమైక హృదయులై యున్నచో కొదవలేల ఘటించ గలవు, విమానారూఢులై దేవసన్నిధి చేరరా?
భర్త: సత్యము.

భార్య: నాథా భోజనము గావించితిరి నీ శయనముపై విశ్రమింపుడు

భర్త: (భోజనము చేసిన పిమ్మట) ప్రేయసీ! నీ భోజనము శీఘ్రముగా గావించుకొని రమ్ము. భగవద్గీతపై నొక మహనీయుడు అమిత విపులముగా వ్యాఖ్యానము వ్రాసి యున్నాడు. నీకు వినిపించెదను

భార్య: చిత్తము నాథా వాకిట నెవరో భిక్షాం దేహీ యని అరచిరి. తమ మధురసంభాషణల మరచితి.

భర్త: జీవితేశ్వరీ! యెంతతప్పు. ముందువెళ్లి వారిఆకలి తీర్చి నీవు భోజనము చేయుము,

భార్య: పాత్రయందు అన్నము కూరలు తీసుకొని అయ్యా తాము యెంద తడవయినదో వచ్చి క్షమింపుము భిక్షగొనుడు

భిక్షు: నేనువచ్చిన వెంటనే పెట్టియుండిన యిప్పటికెంత దూరమో పోయి యుందుగదా? లేదని చెప్పియుండినను పోయి యుందును మాబోటి తపస్వికుల నాదరించని మీగృహస్థధర్మ మేల మీకన్నులకు మేమంత యెల్లిదమే. మాప్రభావము మీ బోంట్లకేమి తెలియును, లోపలికేగినదానవు మరలి రాకుండు టకు మీాసంపన్న గర్వము కారణముగాక వేరుండునా?

స్త్రీ: అయ్యా మన్నింప వలయును. నాపతి వచ్చుటచే

వాఁడు సేవయందు నుంచుకలవారి విషయము మరువు తగిలినది యింతరయే.

భి: మాబోంట్ల కన్నను నీపతి యంత యెక్కువయా? తాపసులన్న యేమను కొంటివి. మాకు తామసము గలుగ చేయువారు చాలా కష్టముల పాలగుదురు. తెలియునా? మా నోటి వెంట కోపోద్దీపితమైన పలుకులు వెలిబడెనా! వానిగతి అధోగతి కావలసినదే ఇంతయెందులకు; మేము చుర చుర చూచిన చాలును భస్మీపటలము చేయజాలమా?

స్త్రీ. స్వామీ! తాము శాంతించవలయును, శమధను లు తాము యిట్లు కోపించుట న్యాయమా? సకల ధర్మము తెరింగిన తామె యిట్లు బలికిన మాబోటి గృహస్థులకు ధర్మ బోధ గావించు వారెవరు. శాంతి భిక్ష స్వీకరింపుడు

భి. నీవు చేసిన అపరాధము నీవెరుంగక నన్నే శాం తింపు మనియెదవు. స్త్రీలకున్నంత శాంతము మాబోటి తాప సులకు లేకపోయిన దనుకొంటివా? మీరుదుక్కలి ధర్మ బోధ

గావించెదవా? చాలింపుము నీ యధిక ప్రసంగమును.

స్త్రీ తాపసోత్తమా! ధర్మాచరణములేక భూతదయలేక పరమేశ్వర పాదారవింద భక్తి లేక; వూరకె ఇంద్రియముల న్నొప్పి పంజేసి తపస్సువలననే జ్ఞానోదయ మైనదని సంతసించితివి, యెంతపొరబడితివి; శమదమాదు లాచరింపక, వైరాగ్యము లేక వూరక క్రోధ రాహిత్యము గలుగును అనుకొంటిరా? క్రోధమున్నవాడు భగవదారాధనం చేయగలడా? ఈశ్వర చింతన లేనివాడు యెప్పటికప్పుడు పొటమరించు దుర్గుణముల నడంచగలడా?

చెరువుల యందు (మండూకములు) కప్పలు వుండును. వానలనికాలమున అవి ఎండెండి ప్రాణమున్నట్లు కానుపింపవు, వర్షబిందువులు పడునప్పటికి చేతనమును ధరించును.

అలాగున నీవు ప్రాణాయామాది యోగమ లొనర్చి యింద్రియములను తాత్కాలికముగా అరికట్టితివి. కానీ యా కుంభకమునుండి దాటగానే యధాప్రకారము యింద్రియములు చెలరేగి మానసము కోపతాపముల వెంటబడుచున్నది.

కేవల ప్రాణాయామమున కన్నను ధ్యానము, భక్తి విషయచింతనా వర్జితము ధర్మప్రవర్తన నామజపము యివన్నియు కలసిన నేగాని మానవుడు గమ్యస్థానమును చేరలేడు.

గీతామాత రెండవ అధ్యాయము (59) శ్లోకమున యేమి చెప్పు చున్నదో చూతుము.

గీ. ౨ అ ౫౯ శ్లో.

విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః
రసవర్జం రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

రోగికిగాని బలవంతమగు పట్టుదల గలవానికిగాని వుపవాసములున్న వానికిగాని యింద్రియముల బాధలేదు. కాని యింద్రియసుఖములపై నుండురుచి ఆవాసనవారికి నశించదు.

కావున బలము గలిగినప్పుడు అవకాశము గలిగినప్పుడు యింద్రియముల వెంటబడక తప్పదు. ఐతే స్థితప్రజ్ఞగలవానికో భగవ(ద్దర్శనమువలన) సాక్షాత్కారమువలన ఆవాస

నయు నశించగా తాను నిత్యానంద మూర్తియగును. అంత వరకు యిట్టికోపములు తాపములు, దుఃఖములు, గర్వములు, యివన్నియు నశించవు.

అయ్యా తమ చూపుసగిలి పిట్టలు క్రిందపడగానే చేయవలసిన పనులన్నియు చేసితిని కృతకృత్యుడనైతినని తలంచెదవా? యెంతపొరపాటు. నీచూపునందు చల్లదన మున్నప్పుడే నీహృదయము చల్లగానుండును. పలుకులు చల్లగా నుండును. నీచూపు క్రూరపు చూపు మనస్సు క్రూరము పలుకు కఠినము యివన్నియు సవరించుకొనక పోయినచో లోకోపకారమునకు యెట్లు పనికి వత్తువు, ప్రాణికోట్లకేమి మేలుచేయుదువు. పైన స్త్రీలకున్నంత శాంతము మాబోటితాపసులకు లేదా' అంటివి శాంతమనునది స్త్రీ గాదు పురుషుడును గాదు శాంతమనునది యీశ్వరుని కరుణ. అయ్యాది యే అదృష్టవంతులు బడయుదురో వారు ధన్యులు. కేవల శారీరకదృష్టి మూర్ఖకొనుము.

సర్వజీవ దయాపరుడగు పరమేశ్వరు నారాధింపుము. పెద్దలసేవ గావింపుము.

ముని: అమ్మా సాధ్వీ! నీ ప్రబోధముచే నాకున్న అహంకారము పోయినది. నేనే తపోబలము సంపాదించితి ననియు స్త్రీలకు యీపాటిబుద్ధి లేదని నేను తలంచి యుంటిని. నాకు చక్కని ప్రబోధ గావించితివి.

నాకు మాతృదేవివై జ్ఞానభిక్ష పెట్టితివి. నేను పిట్టలను చూచుటయు అవిక్రింద బడుటయు యెవ్వరెరుంగరు నీకెట్లు తెలియబడియె యిట్టి ప్రభోధ అమ్మా? నీకెందుండి గలిగెను, నాకు దెలుపు మన నవుడు,

యా సాధ్వి తాపసా! మిథిలానగరమున ధర్మవ్యాధుడను వ్యాధుడున్నవాడు. (బోయవాడు) అతనికడ కేగుము. ధర్మోపదేశము గావింప గలడు. పొమ్ము. పెద్దకాలము ప్రబోధింప ధర్మవ్యాధుడు తగును అనవుడు యాతాపసి మిధిలానగరమున కేగుచు నొక చెట్టునీడ విశ్రమించి యా ప్రతివ్రతామతల్లినుద్దేశించి యిట్లు వితర్కించుకొనియె ఔరా నేనెన్ని ప్రాచదువులు గుణించినను ప్రాణాయామము లాచరించినను మనో నైర్మల్యము సంపాదింప నేరనైతి నే స్త్రీలన్నచో నా మానసమున నీచభావముగా భావించితి నే.

యెంతపొరపాటు ఆమాతృదేవియేగదా నన్ను నిజముగా నొకదారిన పొమ్మని చెప్పెను. ఆహా యేమి ఆభార్యాభర్తల ధర్మదృష్టి ఆవిజ్ఞానము ఆతల్లి చల్లని వాక్యమే నామానసమున కెంతో హాయిని గొలిపెను ఆమె చేతిభిక్ష నాకెంతో అహంకారనాశనమునకు కారణమయ్యెను అని అనుకొనుచూ యాతడు మిథిలానగరము చేరెను

ధర్మవ్యాధుడున్న వీధి చేరెను. ఆతడున్న కుటీరము వద్ద నిలువబడి యుండుట ధర్మవ్యాధుడు చూచి అయ్యా! బ్రాహ్మణోత్తమా యెంత దూరమునుండి వచ్చితిరో! మార్గాయాసముతీర యిచ్చట విశ్రమింపుడు ఒకానొక సాధ్వీమతల్లి పంపిన తామే తెంచితిరి గదా అనియెను,

తాపసుడు ఆశ్చర్య విముగ్ధుడై అయ్యా నేను వచ్చిన విషయము తమకెట్లు బోధపడియె:

ధర్మ: స్వామీ తాము కూర్చొనుడు విన్నవించెదను దాహమునకై క్షీరములున్నవి గైకొనుడు.

బ్రాహ్మ: మంచిది క్షీరములు పుచ్చుకొనియెదను [బ్రాహ్మణుడు తనలో] ఆహా వీడు చేయుపని చాలానింద్యమైనది వీని వినయవిధేయతలు అమోఘమైనవి, యేమి చిత్రము నాకు బోధపడలేదు, నేనెంత తపస్సు చేసినను మానసమున యించుకయినను శాంతి గలుగుటలేదు, కుంభకమున నున్నంతసేపు యేమియు తెలియకుండును. తర్వాత హృదయ శాంతి లేదు, యేమి చేయుదును,

ధర్మ: స్వామీ తాము గృహము లోనికి దయచేయవలయును,

బ్రాహ్మ: లోపలకి రావలయునా పోదము,

ధర్మ: యీపీఠముపై కూర్చొనుడు తమబోంట్ల దర్శనముచే మాజన్మ ధన్యమైనది, మా గృహము పావన మైనది, నేను మా పితరుల సేవకై వెళ్లవలయును కాలము మీరుచున్నది, క్షమింపుడు తర్వాత తమతో కలిసి మాటలాడెదను.

బ్రాహ్మ: వెళ్ళిరండు

ధర్మవ్యాధుడు వెళ్ళెను.

బ్రాహ్మ: ఆహా మాతాపితరుల సేవయట నేనొక్క నాడైనను వృద్ధులగు మాతాపితరుల సేవింపలేదుగదా? మానవుడు చేయవలసిన ధర్మములు అనేకము లున్నట్లున్నవి, కేవల తపస్సుచాలునని ఆలోచించియుంటిని ఇంతలో ధర్మవ్యాధుడొచ్చె

ధర్మ: అయ్యా స్వామీ కూర్చొని యున్నారా?

బ్రాహ్మ: ఔను రమ్ము మాతాపితరుల పూజ అంత ముఖ్యమైనదా ప్రతిమానవుడు చేయవలయునా?

ధర్మ: యేమిట్లడుగు చుంటిరి. మాతాపితరుల ప్రత్యక్ష దైవములుగదా? వారియందు దైవదృష్టి లేనివాడు యింకదేనియందు దైవదృష్టి చేయగలడు?

శ్లో॥ శరీరమాద్యం ఖలు ధర్మసాధనం,

అని పెద్దలు చెప్పుచుందురు గదా? ధర్మసాధనముగా దేహమును పెంచి సకలధర్మములు ఆచరించవలె అట్టి ధర్మ

సాధకు యేర్పడిన శరీరము మాతాపితరులవల్ల కలిగినది. యింతఉపకారము మనకు గావించినవారు తల్లిదండ్రులు; గాన వారికి కృతజ్ఞత జూపనివాడు పాపికాడా?

భోగసాధనకుగాను శరీరమును కొందరు పెంచుచుందురు. అట్టివారు యిట్టిధర్మమును గ్రహించుట దుర్లభము.

బాలి. అయ్యా! దేహాభిమాన మున్నవారు అన్నిధర్మములు ఆచరించవలె. అదిలేనివారు?

ధర్మ. స్వామీ! ఆకలి దప్పు లున్నంతవరకు శరీరము ఉండునుగదా! యథోచితసేవ లేకపోయినచో శరీరముండదు అది వుండువరకు ధర్మమునందే వర్తింపజేయవలె గాన, యీశ్వరసేవ యెట్టిదో మాతాపితరులసేవ యట్టిది.

బాలి. మాతాపితరులసేవ యెట్లుచేయ వలయును?

సీ. ఉదయకాలమునందు నిదుర మేల్కొని వచ్చి
 యొగ్గి తల్లిదండ్రుల కొనర మ్రొక్కి

మ్రొక్కి యుష్ణోదకమున భక్తినిండార
దాన మాడించియు దడియునొత్తి
యొత్తి ధౌతంబులౌ మెత్తని వలువలు
మేనికినిండగ మెలగగట్టి
కట్టియు రసపూర్తి నుట్టిపడెడు దివ్య
షడ్రసోపేత భోజన మమర్చి

గీ. యిచ్ఛ యెలరంగ తాంబూల మిచ్చి యుక్క
రెసగ మెసగంగ పితృపూజ నెనయ జేయు
టదియె సత్పూజయందురో అమలకీర్తి
సుగుణసంభావ్యసర్వేశ సుప్రకాశా

బా. అయ్యా! యిదివర కెవరైనను చేసియున్నారా? యిట్టి మాతాపితృపూజ నీవే చేయుచున్నావా?

ధర్మ. స్వామీ! యెందరో పుణ్యాత్ములు ఆచరించి యున్నారు, యెందరో ఆచరింప నున్నారు.

సీ. తల్లిదండ్రులపూజ దనర చేసియెగదా
　　　　పుండరీకుడు స్వర్గపురము జేరె
తల్లిదండ్రులపూజ దనర జేసియెగదా
　　　　యల సుధన్వుడు దివ్య ఫలముఁబొందె
తల్లిదండ్రులపూజ దనర జేసియెగదా
　　　　గురుపుత్రుఁడా బ్రహ్మపురముజేరె
తల్లిదండ్రులపూజ దనర జేసియెగదా
　　　　పరశురాముడు మహాభాగుడయ్యె

గీ. తల్లిదండ్రుల నెప్పుడు నుల్లమలర
పూజజేసెడివాడె పో పుత్రుడవని
వాడె భక్తులలో పెద్ద వాడు విప్ర
సుగుణసంభావ్య సర్వేశ సుప్రకాశా.

ధర్మ. విప్రోత్తమా! యిట్లెందరేని తరించిరి. ప్రేమా స్పదులగు తల్లిదండ్రులయందు దైవభావన లేనివాడు మిగిలిన భూతజాలముల యందు దైవభావన చేయగలడా? చరాచర భూతముల యందుగూడా దైవభావన కుదిరినగాని మానవుని

హృదయము శుద్ధత్వమును పొందదు; తానెంత మహనీయు లైనను తల్లిదండ్రుల అంశమే నాయందు పెంపొందుచున్న దని యెవనికి తెలియదో వాడు చాలా తెలియనివాడు.

బా॥ అయ్యా! జీవుడు పరమాత్మ అంశమని చెప్పు చుందురే, తాము తల్లిదండ్రుల అంశ మందు రేల?

ధ॥ జీవునకు గొప్ప కొలదులు లేవు; గొప్ప కొలదులు మానస సంబంధములు; ఒకడు నేనుగొప్పవాడను, విద్యావంతు డను, ధనవంతుడను, యిత్యాదులన్నియు మనోసంబంధములు

ఆమనస్సులోనే నేనుకొద్దివాడను, నీచుడను, యిత్యా దులుగూడ గాన మానసమున యిట్టిభావనలు అనవరతము వాడముచుండును.

తమకై దేహసౌఖ్యములను త్యాగముగావించిన తల్లి దండ్రుల అంశము తనయందున్నది; వారలను చక్కగాపూ జించినప్పుడే తాను పరమేశ్వ రాంశమని బోధపడగలదు.

లేనిచో తనయందు దయ్యావు ఎంశలే బోధపడుచుండును తాను ప్రపంచమునుండి తరింపగోరువాడు మాతాపితృ సేవచే సుఖముగా తరింపవచ్చు

మనము మనశరీరమును కాపాడుకోలేని సమయమున మనతల్లిదండ్రులు మనకై వారెట్టి కష్టములనైనను వోర్చి పెద్ద జేసిరిగదా! వారిత్యాగము, వారిప్రేమ తలచినచో యేమా నవుడు ప్రేమచూపక వుండగలడు?

మొదట తాను తనహృదయమున పవిత్ర ప్రేమ సుపా దించవలయును; ఆప్రేమను మొదట పూజ్యులయందు, తరు వాత యిష్టులయందు, తర్వాత బంధువులయందు, ఆవెనుక తమగ్రామమున నున్నవారియందు, తర్వాత పాపులయందు, తనకు చెడ్డచేసినవానియందు. (విశ్వమందు) మానవలోకమున నున్న సర్వప్రాణికోట్ల యందును, యిట్లు ప్రేమింపగా తుదకు దయార్ద్రహృదయు డగును.

సర్వకలుషములు నాశన మగును; తద్వారా ఆ సౌ

కరణము నవి తలికాగలదు; భావశుద్ధి: జ్ఞానశుద్ధే గావున, మోక్షమునకు చేరువగదా?

కావున,- మాతాపితృసేవ చాలాగొప్పది

మానవునకు ముఖ్య కర్తవ్యము మాతాపితరుల వలన తానుపొందిన గొప్పమేలు ఒకటి కానవచ్చు చున్నది,

యేదియన అయిదు సంవత్సరముల ప్రాయము మొదలు క్రమశిక్షనిచ్చి దేహసంరక్షణేగాక [మానస సంరక్షణ] అనగా బాల్యచాపల్యమున యెన్నియో విధముల మనస్సు అక్రమముగా వెళ్లుటకు ఆస్పదములు వుండును, తల్లిదండ్రాదులు అట్లు పోనియ్యక క్రమశిక్షనిచ్చి పెంచుదురు, గావున వారు మొదటి గురువులు కావున ఆరాధనీయులు,

బ్రాహ్మ; అయ్యా తాము యింతధర్మజ్ఞులయ్యు మాంస విక్రయము గావించు చున్నారే ధర్మవిరుద్ధము గాదా?

ధర్మ; స్వామీ అయ్యది అధర్మమని తాము భావించి

తీరి కాబోలు; మానవుడు తనస్వధర్మదీక్షను విడవాడరా దని తమబోట్లు శాసించియే యున్నారు.

గీతాశాస్త్రమునందు గూడా. 3 అ. 35. శ్లో

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః.

గుణరహితముగా నున్నను తనకుటుంబధర్మము తనకు శ్రేయోదాయకము; తనధర్మమునందు తను మరణించినను మేలు

మానవుని జీవితమునందు కొన్నిమార్పులు స్వధర్మములుగా కానుపించు చుండును; బాల్యమునందు తనతల్లియే సమస్తము అని, అమ్మనువిడిచి ఒక గంటవుండలేడు; ఆకాలమునకు అది స్వధర్మముగా కానుపించును; కొన్ని దినములకు తనతండ్రిని బాగా గుర్తుతెలిసినవెంటనే తండ్రివెంట తిరగడం, తండ్రివెళ్లినచోటికి వెళ్లడం కావలసినవి తండ్రినిఅడిగి పుచ్చుకోవడం ఆలాగున మారి అప్పటికి అది స్వధర్మముగా యుండును.

తర్వాత స్నేహితులతో గలిసి తిరగడం. విద్య నభ్యసించడం, పలు దేశముల విషయములు తెలుసుకోవడం అప్పు డది స్వధర్మముగా మారగలదు.

యవ్వన మంకురించగానే హృదయము కొన్నిమార్పులకు లోబడును; లోకమున కానవచ్చు స్త్రీల నందరిని తల్లులవలె భావించినను తనభార్యను అలాగున చూచుటకు వీలు పడదుగదా?

అప్పుడు భార్య ను యేలాగున ప్రేమింప వలయునో యేస్థానము నిచ్చి గౌరవింప వలయునో ఆమె హృదయమున నున్న మధురభావములు తా నేలాగున గ్రహించ వలయునో తనప్రేమ ఆమె కెంతవరకు నుపయోగమో, తనశాసనము ఆమెయందు యెట్లు చెల్లుబడి కావలయునో ఆ గృహాలక్ష్మి ఆ అర్ధాంగిని తనసంసార ధర్మములయందు యెట్లు నడిపించవలయునో కోరిన కోరికలువిని తగుననినవి సమకూర్చి, తగనివి పరధర్మములు ప్రేమచే మందలించి, విడిపింపవలయునో యివన్నియు తెలియుట ఆకాలమునకు స్వధర్మములు

ముఖ్యముగా అందముగల వేశ్యకన్నను, కురూపియగు తనభార్యమేలు. బాగా నాలుగుసాధకములుగలిసిన పూటకూలి అన్నముకంటెను పచ్చడీఅన్నము యింటవండినదిమేలు; పుత్తమ్మకన్నను అత్తమ్మ మేలు; అనుసామెతి వినలేదా? బాగా దిద్దితీర్చిన యితరుల బంగారుకంటెను తనపూరిగుడిసె మేలు.

బాగాఆదరించు పరులకంటెను కొంచ మాదరణ తక్కువ అయినను తనవారు మేలు; పొరుగుగ్రామమున ఆదాయము కన్నను పున్నపూరి నష్టమయినను మేలు.

కావున,— క్షణక్షణము మారుచుండును; మానవుని జీవితము యేకాలమునకు యేది అవసరమో ఆలాగున మార్పు మనము అంగీకరింపకున్నను జరిగితీరును,

పరధర్మము సుఖముగా నున్నను స్వధర్మము కన్న గొప్పదిగాదు. నా స్వధర్మము నేనాచరించు చున్నాను.

మానవలోకమున ఒక్కొక్కడు ఒక్కొక్కవృత్తి నవ

లంభించి అదిస్వధర్మముగా నెంచుకొని ఆచరించు చుండును యేవృత్తి చేయువారి యందు తనజన్మ గలుగునో ఆవృత్తి తన స్వధర్మ మని తలచి పరంపరలు వారలచేత బోధింపబడి ఆవృత్తి చేయుచుండును.

బ్రా. అయ్యా రాక్షసధర్మము సర్వులను బాధించుట గదా? అదివారిస్వధర్మముగదా! ప్రహ్లాదుడు స్వధర్మమునింద్య మని భావించి విడనాడి దేవతా ధర్మము బాగున్న దని అవలంభించెనే, ప్రహ్లాదుడు స్వధర్మ భ్రష్టుండా?

కొన్ని దినములకుముందు మనవారు గ్రంథములయందు యెనిమిది సంవత్సరములప్రాయముగల కన్యలకు వివాహము చేయవలయు నని శాసనముగావించిరి; క్రమముగా మారిపోయి నది వితంతువులు ఆజన్మము బ్రహ్మచర్యదీక్ష వుడవలెనని; అవిమారినవి.

బ్రాహ్మణుడు తపస్సే చేయవలయు ననిరి. అవియుమారి నవి; పురుషులు యేకపత్నీవ్రతులు కావలయు ననిరి; క్రమక్ర

మిముగా బహుపత్నీ వ్రతు లయిరి; అదియు మారినది; గ్రంథ ములయందు "సంపతులు పుత్రోత్పాదయము" నరకే దాంపత్య ధర్మమునందు చరించవలె; తర్వాత వానప్రస్థులు కావలె

అనగా— తర్వాతయిద్దరు "బ్రహ్మచర్యదీక్ష" పూనవలె నని వ్రాసియున్నవి యీకాలమున కనటం, తినటం రెండేపనులు; అవియు మారినవి.

కావున— సమస్తములు క్షణక్షణమునకు మార్పుగలుగుచునే యుండును; ప్రకృతిచిత్రమే అటువంటిది; యిట్టి విషమ స్థితులలో మానవుని స్వధర్మ మిదియని నిర్ణయించుటయెట్లు?

భ స్వామీ! అంగీకరింపవలయు; విశేష ధర్మములని యు, సామాన్య ధర్మము లనియు గలవు వంశ వృత్తి సంబంధమగు ధర్మము సామాన్య ధర్మము. అహంకార మమకారములు వదలి, ఆశాపాశములఁ దెగద్రుంచి, కేవల పరమేశ్వర చింతయందే తనచిత్తమును జేర్చినవాడు ఆ గొప్ప సం

స్కారమునుబట్టి తన స్వధర్మము నతిక్రమించి విశేషధర్మము నవలంభించును.

అట్టి సమయమున సామాన్య ధర్మము లన్నియు విశేష ధర్మమున విలీనమగును. అట్టివాడు తన స్వధర్మము కేవల ఆత్మానుభవము (బ్రహ్మానుభవము, దైవానుభవము) కానీ వేరు గాదనియు, మిగిలిన ధర్మము లన్నియు మనోకల్పన లనియు తెలిసినవాడై ఆనంద మనుభవించును.

అయ్యవి సామాన్యుల కన్వయింపవు

దేహాభిమానములు, సంఘాభిమానములువదలిన మహానీయుల విషయము సామాన్యు లందరు తమతమపూర్వకర్మానుభవమును బట్టి తమ కేర్పడియుండు వృత్తి నవలంబించి చరించవలయు. తా నేపని జేయునో ఆ వృత్తియందే కర్తృత్వాభిమానము వదలి ఈశ్వరార్పణ బుద్ధితో జేసినయెడల నిషిద్ధ కర్మగా యున్నను దానియందు దోషము తన కంటదని పెద్దలచే వినియున్నాను. కర్మ యెట్టిదైనను కర్మయందు బంధము లేదు. బంధము లన్నియు మనస్సునందు యున్నవి.

చక్కెర యెంతతీయనిదైనను నాలుకయందు పైత్యప్రకోగ చిహ్నము యుండగా తీయదనము లేదని తోచును. అది చక్కెర దోషమూ? కాదు, నాలుక దోషము.

నిజముగా మనోభావము మూలినవాడైనచో కర్మదోష మంటదని చెప్పిరిగాని వేరుగాదు

బా: అయ్యా! జన్మాంతర సంస్కారమునుబట్టి వాని వాని వృత్తి యేర్పడు నంటిరే! జన్మాంతర మెట్లు యుండునది యెట్లు తెలియును.

భ: ఇప్పుడు వాడు చేయుపనినిబట్టియే అదినిర్ణయము; నేనుపూర్వభవనమున సకలశాస్త్రంబుల నెరింగిన బాహ్మణుడను; ఒకానొక రాజకుమారుని సాంగిత్యము చే వేటకుబోవుట తటస్థించెను; వానితోటి బాణవిద్యయు నేర్చి యుంటిని; యుద్ధరమ.. దుష్టమృగముల వేటాడు చుంటిమి.

ఒకపొదయందు దుష్టమృగము కదలినట్లు తోచెను; బాణము విసరితిని; కానీ— అది మృగముకాదు; మునికుమారా

రుడు. భయబడితిని; ప్రమాదముగలిగెగదా యని దుఃఖించితిని; వెంటనే వాని తల్లిదండ్రులువచ్చి నన్నుచూచి నీవా! నాయీ పిల్లవాని మృతికి కారణ మని అడిగిరి నేను పాదములపై బడి పొరపాటును క్షమించు మని వేడితిని గానీ, ఫలము లేకపోయినది

వారు పుత్రశోకముచే బాధితులై నన్నుశపించిరి; నీవు బ్రాహ్మణుడవై యుండియు నీచాతినీచమగు మృగములజంపు వృత్తికై గడంగితివి; కావున- కిరాతుడవై జనింపుము అని పలికిరి.

తక్షణమే ఆ శరీరము బాయవలసివచ్చెను; ఆసమయమున నేననేక విధముల వేడుకొంటిని; వారుయించుక కరుణ వుంచి నీవు బోయవై నను జ్ఞానివై పూర్వజన్మ స్మృతి గలిగి భగవధ్యానము, మాతాపితృసేవజేసి పాపపరిహారము గావించుకొని అంత్యమున భగవానునికరుణచే మోక్షము పొందుమనిరి.

కావున- నేనిట్లున్నాను; యిదినావృత్తాంతమని చెప్పెను.

బ్రాహ్మణుడు సంతసించి అయ్యా! మీబోధచే నేను

కృతార్థుఁడనైతిని; ధర్మప్రవర్తకుఁడనై మనియెదను పోయువత్తు ననెను.

భ: బ్రాహ్మణోత్తమా! వందనశతంబును పోయిరమ్ము.

బ్రాహ్మణుఁడు యింటికేతెంచి మాతాపితరులు వృద్ధులగుటచే వారిసేవచేసి తరించెను

కావున— మాతాపితరుల భక్తియు మంచిసాధన,

ప్ర, యేసాధన లేనివాఁడు యీశ్వరుని పొందుటకు వీలులేదా?

ఉ; పొందుట అను వాక్యములోనే కొన్ని యర్థము లిమిడియున్నవి; ఒకమార్గము వెంట బోయిగదా వొకదానిని పొందవలె: ఆపోవుమార్గమునకు సాధన యని పేరు,

ప్ర: యెన్నిమార్గములయినను యీశ్వరునే చేర్చునా?

ఉ యెన్నిమార్గము లయినను తుదకు పరమేశ్వరుని

చేరునుగాని, భావమునుబట్టి కొన్నిమార్పు లుండును; అందు వలననే (బహుమార్గదృష్టంబై సూక్ష్మంబై యుండు) అని పరమేశ్వర సంహిత మార్గము లనేకము లుండుననియు, స్వేష్టాస్పదము గమ్య మొక్కటియనియు ఆర్యులు నుడివిరి; గురుభక్తి నాధారముగాగొని కొందరు సాధనగావించు చుందురు.

(యథా దేవే తథా గురౌ) దైవమెట్లు ఆరాధనీయుడో గురువట్లు ఆరాధనీయుడు; (నగురోరధికం) గురువుకన్నను అధికుడు లేడు; 'త్యాగరాజు' గారును, [గురులేక యెటువంటి గుణికి తెలియగబోదు] అని వారు గానముచేసియున్నారు.

యెట్టివానిని గురువుగా నంగీకరించవలయునో 'నైష్కర్మ్యసిద్ధి'యందు వ్రాసియున్నారు.

శ్లో: శ్రోత్రియో బ్రహ్మనిష్ఠోయః ప్రశాన్తస్సమ దర్శనః
నిర్మమో నిరహంకారో నిర్ద్వంద్వో నిష్పరిగ్రహః
అనపేక్షః శుచిః దక్షః కరుణామృత సాగరః
ఏవం లక్షణ సంపన్నః సగురుర్బ్రహ్మవిత్తమః
ఉపపాద్యః ప్రయత్నేన జిజ్ఞాసో స్స్వార్థసిద్ధయే.

వేదార్థజ్ఞానము, బ్రహ్మనిష్ఠ, శాంతి, సమదృష్టి, ఇది నాదియనియు, నేనుచేయుచున్నా ననియు, యిట్టి భావములు లేమియు, సుఖదుఃఖములకు లోబడమియు, అపేక్షలేమియు, పరిశుద్ధతయు, శిష్యుని తరింపఁజేయవలయు నను దయగలవాఁడు గురువని చెప్పబడును; ఇవ్విధమగు గురువును శిష్యుఁడు తత్వము తెలిసికొనుటకై యాశ్రయింప వలయును.

శ్లో: అవిద్యా హృదయగ్రంధి బంధమోక్షో భవేద్యతః
తమేవ గురురిత్యాహు ర్గురు శబ్దార్థ వేదినః.

యెవరివలన అజ్ఞానముచే గలిగిన అహంకారమను బంధమునుండి విముక్తిగలుగునో ఆతడేగురువని పెద్దలుచెప్పుదురు.

శ్లో: స్వయముత్తీర్య పరాంతారయతి.

తానుతరించి యితరుల తరింపఁజేయ ప్రయత్నింపవలె.

అటువంటిగురువును శిష్యు డెట్లు భావించవలె ననగా-

శ్లో: శివయేవ గురుసాక్షాత్ గురు రేవ శివస్స్వయం
ఉభయోరంతరం కించిత్ నద్రష్టవ్యం ముముక్షుభిః

శివుడే గురువనియు, గురుడే శివుడనియు నెంచవలయును గాని, యిరువురియందు స్వల్పమైనను భేధమువుంచరాదు.

గురుభక్తివలన కిరాతుడైన "ఏకలవ్యుడు" తరించెను.

యేకలవ్యుడు "ద్రోణాచార్యుల"వద్దకువచ్చి స్వామీ! విలువిద్య నాకు నేర్పుడు; ఆవిద్య నేర్వవలయునని నాకుమిక్కిలి కుతూహలముగానున్నదని వేడుకొనియెను.

అందులకు ద్రోణుడు విలువిద్య వుత్తమక్షత్రియులు నేర్వవలసినవిద్యగానీ, నీవంటికిరాతు డభ్యసించిన ఆవిద్యయెప్పుడెట్లు ఉపయోగించవలయునో తెలియక తారుమారుగావింతువు డాననీకు ముప్పువాటిల్లును; అనిచెప్పెను.

అందులకా కిరాతుడు; నాప్రాణమునకు ముప్పువాటిల్లినను నేనుసహింతును; నాకావిద్యయందు మిగుల కాంక్షగలదు;

అని ప్రతిమాలుకొనెను.

అందులకు ద్రోణాచార్యులు; కిరాతా! నేనొకవుదాహరణము చెప్పెదవినుము; 'స్త్రీలపై' కాంతిగలుగును గానీ, చీరలపై గలుగదుగదా! పురుషులకు-

కావున— నీకు మృగములపై నాశజనించిన నీవంశగతముగా వచ్చిన విల్లమ్ములు చాలునుగానీ. సుక్షత్రియ యోగ్యమగు మహాస్త్రములు నీకువలదు; పొమ్ము అని సమాధానపరచెను.

వాడు నిరాశుడై తనకుటీరమునకు వెడలిపోయి అందు ద్రోణునివంటి విగ్రహమును మట్టితోచేసి పూచుకొని, గురుభక్తి మనస్సునిండునట్లు ధ్యానించి, బాణవిద్యల వారి సమక్షమున అభ్యసించుచున్నానని భావించి బాణవిద్యలనేర్చెను.

దివ్యాస్త్రము లన్నియు వుపక్రమ వుపసంహారము లన్నియు యథావిధి గ్రహించెను.

ఆహా! యేమివాని చిత్తైకాగ్రత; వాని గురుభక్తి; గురువుయెదుటనుండి చెప్పుచుండినను యెన్నియో సందేహంబులుండునే! అట్టిది బొమ్మను గురువుగా గ్రహించి బాణవిద్య చేయిపట్టుకొని నేర్పినగాని రాని బాణవిద్య. విల్లు వంచుటకు యెన్నోదినములు నేర్చవలసిన బాణవిద్య, యెదురుతిరిగినచో తనప్రాణమును అపహరించు బాణవిద్య, తానెంతభక్తిచేనభ్యసించి యుండవలె; ఆవిగ్రహామే తనగురువను నమ్మిక యెంత యుండవలె

కావున— మానవునకు హృదయమున నమ్మికగలుగవలెగానీ, సాధ్యముగాని పనియుండదు.

"శ్రీరామకృష్ణపరమహంస" రాతిబొమ్మముందు తన యిష్టదైవమునుచూచి పలుకరించలేదా? ఆవిగ్రహము పలుకలేదా? నమ్మినవానిసొమ్ము దైవము అను నుడి సార్థకపరచిరి.

కావున– "యేకలవ్యుడు" గురువుగారి బొమ్మముందర నమస్కరించి విద్యాభ్యాసను పూర్తిగావించినాడు.

"అర్జునుడు" ద్రోణునియొద్ద యొకవరము గయికొని యుండెను; తనకంటెను ద్రోణుని శిష్యులలో, గొప్పవాడుండ రాదని; ఆకోరిక ప్రకారము ద్రోణాచార్యులు అర్జునునకు అస్త్రపాండిత్య మంతయు ధారపోసి యున్నవాడు.

ఒకదినమున ద్రోణుడు, శిష్యు లందరుగలిసి వాహ్యాళి వెడలిరి; అచ్చటికొక అడివిపంది మిక్కిలి వేగముగా పరుగెత్తి వచ్చినది దానిముఖమున ఐదుబాణములు ఒకేచోటున గ్రుచ్చ బడి యుండినవి చూచిరి; ఇంతలాఘవముగా, యింత కౌశ లముగా యెవరు బాణప్రయోగము గావించియుండవలె! ఐదు బాణములు ఒకేపర్యాయము ప్రయోగించు హస్తకౌశలము ద్రోణాచార్యుల శిష్యవర్గమువారికి గానీ, అన్యులవలన సాధ్యముగాదు.

అందున గురునివిధేయుడు, బుద్ధిమంతుడగు అర్జును నకు గాక, యితరులకు సాధ్యమేకాదు.

అదిచూచి అర్జునుడు- గురువర్యా! తమశిష్యులలో

నన్నధికునిచేసెద నంటిరి; నావంటివారు యింకెంతమంది గలరో తమ చ్ఛాత్రులలో యెరుకపరుపుడు అనిపలికెను.

ద్రో: అర్జునా! యింతకౌశలము నావద్దనుండి నీవు గ్రహించితివి; నేను పక్షపాతరహితముగ నే అందరికి చెప్పుదును; నీప్రతిజ్ఞ ప్రకారము నీవు పండితుడవైతివి; నేను వేయిసార్లా శీర్వదించినను బుద్ధిశాలివై కష్టపడకున్నచో వచ్చునా?

శ్రద్ధాభక్తులకు 'విద్య' దాసియనుకొనుము; యీాయపవి పంది యెచ్చటనుండి వచ్చెనో అవయిపుపను పోవునము; యీ బాణప్రయోగ మెవరిదో కనుగొనవలసి యున్నది.

అ: గురువర్యా దక్షిణపుదెసనుండి యీమృగము పరుగిడివచ్చినది; అవైపునకే పోవుదము; బాణప్రయోగము మెవరుగావించిరో తెలియఁగలదు

ద్రో: అవును; నడువుము; అందరుకలసి దక్షిణముఖముగా వెళ్లిరి.

అచ్చట 'యేకలవ్యుడు' ద్రోణుని పఠమునుంచుకొని పూజించి నమస్కరించుచుండుట గాంచిరి; సమీపించిరి.

తానారాధించు దైవము తనకన్నులకు గానుపించిన మానవుని సంతోషమునకు మేరయుండునా?

ద్రోణాచార్యులను చూచునప్పటికి యేకలవ్యుడు పొంగిపోయినాడు; ఆనందసముద్రమున నోలలాడినాడు; కానీ— యించుక భయము చెందినాడు; కారణ మేమియనగా, వారిఅనుమతిలేనిదే నేనిట్లుచేయుచున్నానే; యిది సూక్ష్మముగా యోచించినచో అవిధేయత కాదా? అనిమనస్సున యించుక భయము కలిగినది కానీ— ద్రోణాదులను రమ్మనిపిలిచి వినయవిధేయములతోటి పూజించెను.

ద్రో. నాయనా! యీపూజయేమి?

ఏ: గురువర్యా! తమ ఆరాధనయే.

ద్రో: యేలా!

కి: స్వామీ! బాణవిద్యాభ్యాసమునకయి తమవద్ద కేతెంచితిని గాదే; తాము 'కిరాతుడు' దివ్యాస్త్రముల నభ్యసింపగూడ దంటిరి; నామనోశీవ్రితచే తమప్రతినిధి నుంచుకొని దివ్యాస్త్రముల ఉపక్రమ, ఉపసంహారములను క్రమముగా నేర్చితిని.

ద్రో॥ నాయనా! మంచిపనిగావించితివి; యిట్టిబాణముల నెవరికడ నుపయోగింతువు?

కి: దేవా! ఉత్సాహపూరితుడనయి నేర్చితి గాని— నాకేమి రాజ్యమా, భాగ్యమా, శత్రురాజులు వత్తురు; అపహరింతురు; అనుటకు, ధర్మయుద్ధము లాచరించుటకు అవియేమియు లేవు. యీఅరణ్యమునగల మృగములే నాకుశత్రువులు. వాటి యందే నాబాణవిద్య నుపయోగపరతును.

ద్రో॥ పిచ్చుకపై బ్రహ్మాస్త్ర మన్నట్లు దివ్యాస్త్రములు మృగములపై ప్రయోగింతువా? లేక నిరపరాధులను చంప నుద్యమింతువా? జిహ్వాచాపల్యమునకయి నీచమృగము

లను చంపితివి నీకు దివ్యాస్త్రముల ఉపయోగ మెట్లు తెలియ గలదు. నేర్చుట గొప్పకాదు; యెప్పుడేది బయలుపరుప వల యునో, యెప్పుడేది ఉపయోగపడునో, యేసమయము ఎట్టి దియో తెలియనివాడు యేవిద్యయందు యెంతవిద్వాంసు డయి నను వ్యర్థుఁడుగదా!

నీవు దివ్యాస్త్రములను పందులపైన, కుక్కలపైన, పులులపైన, యెలుగులపైన ప్రయోగించిన యెవరుసంతసింప వలయు? నీకేమిలాభము గలుగవలయు? "సన్యాసి" జ్ఞానము లేక చెడినట్లు; "గృహస్థు" ధర్మములేక చెడినట్లు; వ్యాపారి నీతిలేక చెడినట్లు; పురుషుడు యేకపత్నీవ్రతములేక చెడినట్లు; స్త్రీ పాతివ్రత్యములేక చెడినట్లు; బాలుడు విద్యలేక చెడినట్లు; బాలిక శిక్షలేక చెడినట్లు; సుక్షత్రియుడు నేర్పులేక చెడినట్లు; కిరాతుని బాణవిద్య చెడును.

కి: దేవా! బాణవిద్యయందు చెడు పేమిగలదు?

దే॰ 9. బాణవిద్యయందు చెడువులేదు; యెప్పుడుప్రయో గించవలె; యెవరియందు ప్రయోగించవలె నని తెలియనివానికి

చేతు తెచ్చును. యేలనందువా! నీవ్రపవిత్రములగు బాణములను సుఖ తియుడు యుద్ధకాలమున సారథినికొట్టవలసినవి నీవు పంది ముఖముపై ప్రయోగించితివి గాన, నీకు వుపయుక్తమైనవి నేర్పదను; నేర్చుకొనుము.

కి: స్వామీ! చిత్తము; నేర్చినవిద్య సమయము తెలి యనిచో కారుమారు కాగలదు గాన, నాఖడిచేతిబొటనవ్రేలు తమకు కానుకగా సమర్పించెదను. గ్రైకొనుడు అని చెప్పి తన చేతి వ్రేలిని ఖండించి గురుదక్షిణగా సమర్పించెను చూచితిరా! యెంతగురుభక్తి

భక్తిగలిగిన వస్తువాహనములు యిచ్చువారు గలరు, భోజనములు పెట్టువారు గలరు. దేహములోనున్న అంగములను త్రెంచియిచ్చువారు గలరా?

అదిచూచి ద్రోణాచార్యు డాశ్చర్యపడెను. అర్జునుడు మేముగురుభక్తి గలిగినవారమని విజ్ఞపీగుచుంటిమే! యితనివలె అంగములను ఖండించి గురువునకు యివ్వగలిగితిమా! యేమివీని త్యాగము అని ఆశ్చర్య పడెను. తర్వాత ద్రోణుడు కిరాతునకు

ఉచితవిద్యను నేర్పి కృతార్థునిజేసెను.

గురువులయందు విశుద్ధభక్తి యున్నచో అదియొక సాధనయే.

ప్ర: స్త్రీలకు ఉత్తమసాధన యెయ్యది?

ఉ: యిదివరకే తెలుపబడియున్నది స్త్రీలకొక సాధనయు, పురుషుల కొక సాధనయులేదు. అయినను స్త్రీల కింకొక చక్కనిసాధనయున్నది; పతిభక్తిగలిగినస్త్రీ అమితసులభముగా పరమును సాధించగలదు. "త్రిమూర్తులు" ఆమెచేతిబిడ్డలవలె మెలగగలరు. మృత్యువు ఆమెయాజ్ఞల మెలగగలదు; సూర్య చంద్రాదులు మొలవమన్న మొలతురు; కూడదన్న నిలుతురు.

యిట్టిమహాశక్తి ఉత్తమపతిభక్తియందిమిడి యున్నది.

ప్ర: యిప్పటికాలమున అట్టిస్త్రీలు అరుదుగానున్నారని తలచెద.

ఉ: లేకపోలేదు; అయినను అది కేవలము స్త్రీపారపాకే గాదు; పురుషులయందును అట్టిపారపాట్లిమిడి యున్నవి. ప్రతి

స్త్రీయందును మృదుత్వము, దయ, ప్రేమ యిమిడి యున్నది గానీ, చక్కనిమార్గముగా నడిపించువానినిబట్టి కొన్నిమార్పులు కలుగును.

యెంతవ్రతముగల వనితయైనను అనవరతము చింతలకు లోనయినచో, మనస్సు మారును. పూర్వకాలపు స్త్రీలకు తండ్రులయింటనే చక్కని శిక్ష, విద్య, ధర్మము తెలుసుకొని తనగుణమునకు తగువైన భర్తనువరించి, వారి ప్రేమ తమజీవన మని భావించి తనసర్వస్వము భర్తప్రేమకయి త్యాగము గావించు చుండిరి.

ప్రస్తుతకాలమున ప్రేమయనగా శరీరమునకు సంబంధ మేగానీ- అనగా భోగసంబంధముగానీ ఆత్మసంబంధముగాదనే అభిప్రాయములలోనికి జారినది.

కావుననే- దేహముమారగానే భోగానుకూలము తగ్గ గానే ప్రేమలుమారుట యేర్పడినవి.

కావుననే- వ్రతములు తారుమారగు చున్నవి; ప్రస్తుత

కాలము నుబట్టి అట్టివ్రతములను పునరుద్ధరణము కావలసియుండినచో, "స్వామివివేకానందులు" ఒకమాట తెలిపియున్నారు.

యేవృత్తి చేయువారు ఆవృత్తియందువుండు కన్యలను వివాహ మాడవలయును; యెచ్చట ఉత్తమగుణ ముండునో అచ్చట ప్రేమనిలుచును; యెచ్చట ప్రేమనిలుచునో అచ్చట వ్రతము నిలుచును.

కావున— ఒకవృత్తి చేయువాడు యింకొక వృత్తిచేయు వారి కన్యలకనువివాహమాడరాదు; ఒకరిని ప్రేమించిన కన్యను వివాహమాడరాదు; తనవృత్తి, తనచదువు, తనరూపముచూచు కొని అంతకుసరిపోవు కన్యను వివాహమాడవలయును; తాను నల్లగవుండి పచ్చటి భార్యకావలె ననుకోవడం తప్పు; తాను మొద్దువలెనుండి చదువుగల భార్యరావలె ననుకోవడం తప్పు; తానువిద్యాసంపన్నుడై యుండియు డబ్బుకుఆశపడి విద్యావిహీను రాలయినను పెండ్లిచేసుకోవడం తప్పు; స్త్రీల 'సతీత్వ'మును కాపాడవలయు నన్నచో, భారతదేశము పూర్వస్థితిని పొంద వలె నన్నయెడల వారి శీలవ్రతము దక్కవలయు నన్నచో, పురుషులు తగుకట్టుబాట్లు యేర్పరచుకొన వలయును.

వారిమనస్సునకు తగునైన తరిబీను యివ్వవలయును; హైందవస్త్రీలకు పాతివ్రత్యమే ధనము; యెంతధన ముండినను శీలధనములేని స్త్రీ దైవసన్నిధి చేరజాలదు.

"మనభారతదేశము పతివ్రత" లకు పునాదియని ఖండ ఖండాంతరములవారు నేటికిని తలంచు చుందురు. అని వారు నుడివియున్నారు.

సూక్ష్మదృష్టితో చూచిన ఇవన్నియు నిజములని తోపక మానదు; కొనికొన్ని దాంపత్యములు అన్యోన్యభావములులేక పతనమగుటకు కారణము లగుచున్నవి; 'స్త్రీకి ఓర్పు' పాతి వ్రత్యము:వల్లనే; శాంతి పాతివ్రత్యమువల్లనే.

కావున— పాతివ్రత్యమును మించినవ్రతము లేనేలేదు.

భార్య అనుశబ్దమునకు పాతివ్రత్యమును భరించునదిఅని అర్థమనిరి. భర్తయనగా భార్య పవిత్రప్రేమను భరించు వాడనిరి; తెలిసినవారు భర్త యందు పూర్ణముగా దైవభావన చేసి ఆరాధించి. వారిదర్శనమే పరమపావన మని తాత్పర్య యుక్తముగా జూడవలయును.

పవిత్ర ప్రేమకున్ను, శారీరాలంకార ప్రేమకున్ను భేదమున్నది.

'సత్యాదేవి' వద్దకు నారదుడేతెంచి అమ్మా! శ్రీకృష్ణ భగవానులు యింటిలోలేరా యనియడిగిరి

స: ఆర్యా! నారదమునీంద్రా! యింతలోనే వత్తురు యీపీఠము నలంకరింపుడు.

నా: కూర్చుండుదును; అమ్మా! సత్యాదేవి; నీసౌందర్యమునకు, ఆభగవానుని సౌందర్యమునకును బంగారమునకు యెలిగార మతికిన చందమున నున్నది; చూచువారికి మాబోంట్లకు యెంతో ఆనందము,

స: మునీంద్రా! నా అందచందములకు చిక్కి శ్రీకృష్ణుడు నాయందే అనురాగముగలిగి వర్తించు చుండును; ఆ మోహనాంగుని రూపమునకు నేను నిమగ్ననై పోవుచుందును గానీ— మునీంద్రా! శ్రీకృష్ణుడు యెచ్చటికివెళ్లక నా యింటియందే

యుండునట్లు మహనీయులగు తామ యంత్రమో, తంత్రమో సెలవిండు; ఆప్రభావముచే అనవరతము గోపాలుడు మాయింటనే కాలుకదపక యుండులాగున గావించుకొనియెదను.

నా: అట్లయిన సర్వలక్షణసంపన్నుడగు నొకయోగికి నీప్రాణనాథుని దానమొసంగుము.

స: అయ్యో మగనిని దానమొసంగుదురా: యిట్టిమతిపోయెడిదానము లెవ్వరైనా చేయుదురా!

నా: అమ్మా! మరల బంగారమో, పదార్థమో తూనికయందుంచి నీవుభర్తను తూచుకొనవచ్చును; నీకోరికయు పూర్తియగును; అట్లుగావింపుము—

స: అట్లు గావింతును; అనుచుండగనే శ్రీకృష్ణపరమాత్మ విచ్చేసెను.

స: ప్రాణేశ్వరా! నారదమహామునివల్ల నే నొకవ్రతము గ్రహించి యున్నాను తా మంగీకరింప వలయు నని ప్రార్థించెదను.

కృ: సత్యా! నీవేమికోరిన అదిచేయుటయే. మీరు పలుకుట నాపనికాదు; కానిమ్ము: నారదులంతటివారు చెప్పిన వ్రతమునందు మహిమ లేకపోవునా?

స: మనోహరా! యీవ్రతమునకు "భర్తృదానవ్రత" మని పేరు.

కృ: యేమీ! భర్తను దానమిత్తురా! పతివ్రతలు భరింపగలరా? నీవు నన్నువిడచి యుండగలవా! నిన్నువిడచి నేనుండగలనా? సత్యా—

స: యెంతమాట! తమనుదానమిచ్చి నేనూరకుందునా

కృ: మరేమిచేసెదవు?

స: మరలా మిమ్ములనుకొని కైకొందును.

కృ: సరే! కానిమ్ము.

అనుటయు నారదుని పిలిచి "శ్రీకృష్ణుని" దాన మొసఁగెను మరలఁగైకొనుటకయి తనకు "శమంతక మణివల్ల"గలిగిన స్వర్ణమంతయు వుంచి తూచినను తూఁగలేదు, సత్యభయము జెదినది.

ఇంకను యింటనున్న పదార్థములను చి తూచినది; తూఁగలేదు కారణ మేమియనిన! కేవల సౌందర్యప్రేమయే గానీ- అంతరంగిక పవిత్రప్రేమగాదు; ప్రేమ, గౌరవములు చేరి భక్తి యగుచుండును.

ఇదియునుగాక- తాను ఖండితనాయకి గావున, కేవల సౌందర్యదృష్టియే గానీ- యింకొకటి యెఱుఁగదు.

శ్రీకృష్ణుఁడు, సత్యాదేవికి ఆత్మప్రేమ యిటువంటి దని తెలియజేయుటకు గాను, బరువైన యెంతబంగార ముంచినను యెన్ని పదార్థము లుంచినను త్రాసు తారుమారుగా మార్పుగావించెను

సత్యభామ మిక్కిలి చింతాక్రాంతురాలై నారదమునీంద్రు

వంకఁజూచి, మునీంద్రా! యిట్టి వ్రతములను అమాయకురాలి నగునాకు నుపదేశించి. నాభర్తనపహరించి యెవరికియ్యఁదలంచి తివి? నాసౌందర్యరాశియైనకృష్ణుని తెలియక నీళ్లధారవోసితిని.

నా: అమ్మా! నిదానించి పలుకుము; "నీహృదయ పూర్వకముగా ప్రేమరసము" నుంచి తూచుకొనుము; పవిత్ర ప్రేమకు తూగనిది యీ లోకమున అణుమాత్రమును లేదు. విదుషీమణివి; నీకు నే నెఱిగింపవలయునే

స: మునీంద్రా! నా సుందరమూర్తియందు నాకు ప్రేమ లేదనియా! నీయూహ?

నా: శ్రీకృష్ణుడు తూగలేదని నీవు చింతించుచున్నావు; గావున, పలికితిని. అంతియేగాని- నీకు ప్రేమ వుండుటయు, లేకుండుటయు గోపాలదేవునకు తెలియును; నాకేమి తెలియునమ్మా

స: జీవితేశ్వరా! నీసుందరాకృతి దర్శనము లేని క్షణము నాకు యుగసహస్రములయి కానుపించునే; యేక్షణమున నెట్లు శృంగారించుకొనిన నీవు హర్షింతువో యని నేన

శృంగారించుకొందునే; నీవెఱుగవా? యివన్నియు నీ మాయయే యని తోచుచున్నది; నేనర్ధాంగిని గానా? నా వ్యాకులము నీకు మోదమా?

కృ: సత్యా నీయందు మేలిగుణములు లేవని నాయభిప్రాయమా; యెంతపొరబడితివి? వ్రతసాంగమునకై సంతసించవలె గాని చింతించుట తగునా?

స: నాథా! ఇంతయగునని యెఱుంగను.

కృ: యిప్పుడేమయినది; నన్ను తూచుటకై నీవద్ద ధనము లేదా? నీతండ్రిచే నీయబడిన నిత్యాలంకారమునకయి యేర్పడియుండు శమంతకమణి లేదా? ఆలస్య మాచరించినచో నీకుదక్కుదునో లేక యెవరైన నన్నుతూచుకొని యెవరో వెవక చింతిం తువు; త్వరపడుము.

స: నాథా! అన్నియు త్రాసునకే సమర్పించితిని; నిష్ఫలము; నిష్ఫలము.

నా: అమ్మా సత్యాదేవి! నీవల్ల గాదుగదా! యింక యేమైనా ఆశయున్నదా?

స: మునీంద్రా! యెంతపని జేసితివి.

నా: అమ్మా! చెప్పెదవినుము; యింక యెవరుతూచుకొందురో వారిసొమ్ము శ్రీకృష్ణుడు; యింక యిష్టముగదా?

స: అయ్యా! యెంతసాహసుడవు. నాభర్తను యితరుల అమ్మెదువా?

నా: అమ్మా! యితరులైన నేమి; నీవయిన నేమి; నాకిచ్చినది నాయిష్టముచొప్పున చేసుకొందును.

స: ఓ కలహప్రియా! నాసవతియగు రుక్మిణికయినను తెలిపి ఆమెనైనను శ్రీకృష్ణుని తూచఁగలధన ముండిన రమ్మని యెదను; ఇతరుల కియ్యకు తాపసా?

నా. అమ్మా! యెవరైన నాకేమి,

పిమ్మట సత్యాదేవి రుక్మిణీదేవి యింటికి వెళ్లి చూచునప్పటికి ఆరుక్మిణి 'శ్రీకృష్ణప్రభువును' మనస్సులో ధ్యానించుచుండెను;

స. అక్కా! రుక్మిణీదేవీ; నేనుచేసిన అవివేకమును నీవు సవరించి మన్నింపవలయును; అని వేడుకొని వృత్తాంతము విశదీకరించినది.

రు: సోదరీ! భయపడకుము; 'పతిభక్తి' మనస్సును బలపరచి ఆత్మ ధైర్యము నొసంగును. ఏల బేలవయ్యెదవు హృదయపూర్వక పవిత్రప్రేమ మనకున్నచో పతి, యితరుల కెట్లు స్వాధీనము కాగలడు.

సాధారణముగా మానవకోట్లలో అత్యధిక విశ్వాసము దేనియందు గలుగునో అయ్యది మనస్సున స్థాపితమగును ఆలాగున నే రుక్మిణీమనోస్థాపితుడగు కృష్ణుని యెవ్వరుకదిలింపజాలరు

సత్యా! పతియందు నీవు చూపెడు ప్రేమ ఆంతరంగికముగాదు, కేవల సౌందర్యమునందే నీమనస్సు లగ్నమైనది, భోగలాలస బుద్ధిచే యిట్టి వ్రతమును గావించితివి.

పతివ్రత యగు లతాంగికి అన్యపురుషుల ఉపదేశమేల? నీవేల నారదు నుపదేశింపుమని ప్రార్థించితివి? నీకు తెలియుటకొరకే ఇట్టి వ్రతోపదేశము గావించెను. భర్త అంగీకరించెను. సర్వకాలము పతి తనయందు అనురాగవంతుడు కావలయునని నీవలె వ్రతములు, మంత్రములు, మందులు నేర్చి భర్తప్రేమను సంపాదింప ప్రయత్నించువారు గలరు, అవన్నియు సతీలక్షణములుగావు.

పతిప్రేమ సంపాదింప దలచిన అనవరతము వారిసేవ, వారిపాదధ్యానము, వారియందే తనమనస్సును లయపరచుట, తదేకనిష్ఠ సలుపవలయును; యిదియే వుత్తమసతీత్వ లక్షణము,

పూర్వపు సతీమతల్లుల చరిత్రములు చూడుము.

ఆ వె॥ సిగ్గుపడుటగల్గి సింగారమును గల్గి
భక్తిగల్గి చాల భయముగలిగి
నయము ప్రియముగలిగి నరనాథు చిత్తంబు
సీత తనకు [illegible] యె

చూచితివా! యిన్నిలక్షణములు సతులయందు మూర్తీభవించవలె; అప్పుడే సతీత్వము తనయందు నిలువగలదు; లేనిచో సువాసనలేని పుష్పమువలె నలంకారముమాత్రమే నిలుచును; సతీత్వము సున్నయగును.

పతియందు తాను నిర్వర్తించు విధులు తప్పినచో తనకే సద్గతికి హాని; సతియందు పురుషులును తమ విధి ప్రకారము నిర్వర్తించని యెడల సద్గతికే హాని యని వేరే చెప్పవలయునా.

కావుననే, శ్రీకృష్ణుడు నీవుచెప్పినట్లు జేసెను; నీ నీమము మరచితివి గావుననే, యిట్టిచింతకు కారణ మైనది.

స: అక్కా నీహితోపదేశముచే కేవల వలపులగుళికించు శృంగారపు దృష్టిమాని భక్తియే పరమార్థసాధక మని గ్రహించితిని గాని— పతిని దారాదత్తముచేసిన నా అవివేక మెట్లు పరిణమింపఁగలదో; నా మానసము డోలాయమాన మగుచున్నది; రమ్ము పోదము.

రు: నేనురావలయునే; నీవే పూర్ణభక్తిచే పువ్వొత్తుగా పతిని తూపజాలవా?

పోమ్మా; యీపుష్పము నిచ్చెదను; నిందుభక్తిచే పతి పాదారవిందములను ధ్యానించి, నీమానసమును ప్రేమరస నిమగ్నముగావించి, యారసాభిషేక పూర్వకముగా తల్లీనవై నీవు నామ మాత్రావశిష్టమూర్తివై పుష్పరాజము నందు ము; ముల్లోకంబులు తూఁగఁగలవు.

సత్యదేవి– రుక్మిణి యొసంగిన పుష్పమును భక్తియుక్తముగా తెచ్చి తుల యందుంచెను.

"భక్తి పుష్పమే, ఆ ప్రేమపుష్పమే ఆ చిత్తైకాగ్రతా పుష్పమే" బరువై "శ్రీకృష్ణుడు" తేలికయై పోయెను.

ఆశ్చర్యమేమున్నది! తన మనోపుష్పమును పవిత్ర ప్రేమచే ఆర్ద్రపరచి తడిపి పతి పాదారవిందములయందు అర్పించిన సాధ్వీమతల్లికి దుస్సాధ్య ముండునా? వుండదు.

ఇట్టి ధృఢవ్రతముగల తల్లులకు దైవము వెంటతిరుగును. స్త్రీలు తరించుటకు యిది చక్కనిమార్గము.

ప్ర: భర్తృవిహీనయైన స్త్రీ గతియేమి?

ఉ: గతియేమున్నది; తల్లిదండ్రులు చక్కని విద్యాభ్యాసము చేయించి, తాము బ్రహ్మచర్యము నందుండి, ఆ బిడ్డనుకూడా బ్రహ్మచర్యదీక్ష యందుంచుట చాలామంచిపని.

కొందరు తమ వితంతు పుత్రికల విద్యాభివృద్ధికై పుణ్యాశ్రమములయందు వుంచి, విద్యతోబాటు జ్ఞాన మార్జింప అనుకూలములు కల్పించు చుందురు. కాని– యిట్లు కల్పించుటలో బహుజాగ్రతగలిగి యుండవలయును. లేనిచో, కొన్ని సంకటములు బయలు దేరును.

ఒక గృహస్థు నింట నలుగురుకుమార్తె లుండిరి. అందరికిని వివాహములు గావించిరి; అందులో యిద్దరు బ్రహ్మచర్యవ్రతము నవలంబింపవలసివచ్చినది; వలనన భర్తృవిహీనలైరి. ఆపిల్లల తల్లిదండ్రులొకనాడు కూర్చొని యిటుల ఆలోచింపసాగిరి,

భా: ప్రాణేశ్వరా! యిద్దరు పుత్రికలు యీలాగున దుఃఖసముద్రమున మునిగిరి; యేమిచేయవలయును?

భ: చేయున దేమున్నది; మరల వివాహము గావించిన సంఘమునందు చాలా దూషితుల వాదము.

భా: దేవుణ్యాశ్రమ మనకైనా పంపివిద్యా జ్ఞానము నభ్యాసము గావింతము.

భ: ఆశ్రమమునకు పంప నేల; మనవూరియందు శుద్ధబ్రహ్మచారి బాల్యమునుండి బ్రహ్మచర్యమునందే దీక్షా వ్రతము నబూని, పదహారు సంవత్సరములకే సన్యసించినవారు. వారిని మనయింటికి భిక్షకుపిలిచి మనఅమ్మాయికి ఉపదేశము చేయింతము; దాన ధన్యురాలై జపము గావించుకొనును.

భా: నాథా! బాలసన్యాసుల విషయము—

భ: కొంతమాట! వారిని నేనెరుగుదును; వారుచాలా మరిచివారు; చక్కగ చదువుకొన్నవారు; మనఅమ్మాయికి విద్యకూడా నేర్పుదురు.

భా: ఇంకకొన్ని దినములు యోచింతము.

భ: యోచించుచుండిన వారు యీప్రాంతియందే వుందు రని యేమినమ్మకము? వారు త్రిలోకసంచారులు; కావున— (శుభస్య శీఘ్రం) అన్నట్లు నేడే వారిని పిలుచుకొనివచ్చెదను.

భా: భిక్ష యీదినమే చేయుదము

భ: ఉపదేశము ఇంకొకదినము చేయించుద మనియా! నీయభిప్రాయము? అట్లుగాదు; యీదినమే అన్నియు.

భా: తమచిత్తము.

రంగారావుగారు; మఠమునకు వెళ్లిరి.

స్వా: రండు; రంగారావుగారు! అందు కూర్చొనుడు. కుటుంబమున సౌఖ్యమా! మీకుమార్తెల నేమైనా చదివించు చున్నారా?

రం: స్వామీ! తాము యెమొచదువ చుంటిరి; అ గ్రంథము నామధేయ మేమి?

స్వా: ఇయ్యది సర్వవేదాంత సంగ్రహము.

రం: తాము మాయింటికి భిక్షకు దయచేయవలయును. మాయింటనుండు దుఃఖరాక్షస గ్రహోచ్చాటన మంత్రజ్ఞులు గావలయును.

స్వా: యేమది?

రం: మా అమ్మాయికి ఇటీవల భర్త చనిపోయినాడు ఆదుఃఖమును తాము దయయుంచి పోగొట్ట వలయును.

స్వా: దుఃఖముపోవుటకు "జ్ఞానము" కావలయును; జ్ఞానదానము కావలయును.

రం: జ్ఞానదానమునకై తమవద్ద మా అమ్మాయికి ఉపదేశము చేయించఁదలఁచియే యీదినం యిచ్చటికి వచ్చినాను.

స్వా: యోచించెదను.

రం. యోచించుటగాదు నేడే రావలయును.

స్వా: యెన్నిఘంటలకు రావలయును?

రం. పదిఘంటలకు దయచేయ వలయును.

స్వా. ఆలాగే వచ్చెదను.

భా. స్వాములవారితో మాటలాడితిరా?

రం. మాటలాడితిని; వచ్చెద ననిరి; 'భిక్షకు' పదార్థములు సిద్ధపరుపుము.

భార్య భిక్షసిద్ధముచేసినది; పదిఘంట లైనది; స్వాములవారు యథావిధిగా బయలుదేరి వచ్చిచేరిరి.

రం. పాదములుగడిగి దయచేయుడు.

స్వా. కూర్చొంచి; మీయిల్లు చాలారమ్యముగానున్నది.

రం. తమబోటిపెద్దలు మాయింటికి చాలామంది వచ్చు

చుందురు; వారందరు మీావలెనే సంతసించు చుందురు; అమ్మా యిని రమ్మనుము; స్వామికి నమస్కరించవలయును.

భా. స్నానము చేయుచున్నది.

రం. తొందరగా రమ్మనుము.

భా; కమలాదేవి! ఇటువచ్చి శ్రీ శ్రీ శ్రీ స్వాముల వారికి నమస్కారము లర్పింపుము.

కమ. స్వాములవారి ముఖముజూచి [స్వగతము] ఆహా! యేమిసుందర విగ్రహము; వీరు సన్న్యాసిగా నుండదగిన వారుకారు [ప్రకాశముగా] స్వామీ! కమలాదేవి వందనము లర్పించు చున్నది.

స్వా; కమలాదేవిని జూచి, తలవ్రూచి నా రా య ణ అని స్మరించికూర్చొనుము!

కమలాదేవి కూర్చొనును-

స్వా; నీవేమి గ్రంథముల నిత్యము చూచుచుందువు?

క; నా కింకను గ్రంథములుచదివిన అర్థ మగునంత తెలివిలేదు.

స్వా; రంగారావుగారు! మీపుత్రిని చక్కగా చదివించ గూడదా?

రం; తామేదిక్కు; తాము ఉపదేశముచేసి, విద్యా బుద్ధులు నేర్పి కడతేర్చవలయును.

స్వా; సరి! పూజాద్రవ్యములు సమకూర్చుడు.

రం; సిద్ధముగా నున్నవి.

కమలాదేవి; స్వామివద్ద కూర్చుండును; హస్త, మస్తక న్యాయముగా ఉపదేశము పూర్తియైనది; భిక్ష జరిగినది; అంద రు భోజనములు చేసిరి.

స్వామి రంగారావుగారూ! నేను మఠమునకు వెళ్లెదను.

౪౦. స్వామీజీ! తాము ఉపదేశించిన విషయములను మరచునేమో మా అమ్మాయి.

స్వా: మఠమున కంపినచో ప్రతిదిన ముపదేశము జరుగును. [ఈవాక్యమును భార్యాభర్తల లంగీకరించి ప్రతినిత్యము కమలాదేవిని మఠమునకు పంపుచుండిరి.

ఒకనాడు స్వామి, కమలాదేవినికూర్చుండజేసి, కమలా యీగ్రంథమును చదువుమనెను. కమలాదేవి చదివెను.

స్వా: పాఠము పూర్తిగారాలేదు; కష్టపడిచదువవలెను

కమ: కానీ, స్వామీ! తామెన్నిరోజు లైనది? సన్యసించి

స్వా: నాలుగు సంవత్సరము లైనది.

కమ: నిత్యమును బిక్షకు పరుల యిండ్లకు వెళ్లవలసిన దేనా?

స్వా: భక్తినుంచువారు పరులెట్లగుదురు. విశ్వాసమున్నవారు పరులుగారు. వారును మనవారే, మీరందరు మాయందు ప్రేమగలవారుగారా

కమ: అవును. తాము ప్రేమైక హృదయులు గావున నే యేకొదువలు లేవు.

స్వా: నీవు పాఠమును చదివితివా?

కమ: స్వామీ! చదివితిని తాము జెప్పిన మంత్రజపము చేయుచున్నాను. ఎన్నివేలు జపించినను మానసము స్థిమితము లేకయున్నది.

స్వా: మనోవిషయము రేపు బోధపరుతును.

కమ: ఐన నే నింటి కేగుదునా?

స్వా: అప్పుడే వెళ్లెదవా; కూర్చుండుము.

కమలాదేవి కూర్చుండును.

స్వా: కమలాదేవీ! అభేదప్రపత్తియే లోకమున దివ్య జ్ఞానముగా వాడుచుండునది. ఎచ్చట బేధముండినను ద్వైవ జ్ఞానము గలుగజాలదు.

కమ. స్వామీ! ఆత్మబేధ రహితమైనను సకల వ్యవహారములు భిన్నముగానే పరివర్తించును. అట్లు పరివర్తించనిచో కొన్ని యిక్కట్టులు సంప్రాప్తించు నని గ్రంథములు చెప్పుచున్నవే.

స్వా ఈ సకల వ్యవహారములు, ఆ అఖండమైన అబేధ బ్రహ్మమునందు లీనముకావలసిన వే సుమా; ఇంకొకటి వ్యవహారికము అనునది లేనేలేదు అంతయు బ్రహ్మమే. ఇట్టి బ్రహ్మ దృష్టికలిగినవెనుక అన్నియు బ్రహ్మమే

కమ: స్వామీ! అన్నియు బ్రహ్మమని తాము చెప్పుచున్నారు; బ్రహ్మమనగా నిర్గుణమని తా ము నిన్నటిదినమున సెలవిచ్చితిరి ఈ సకల ప్రపంచము నిర్గుణమునుండి సంభవించు టెట్లు? గుణము లుండినగదా వ్యవహారము.

కమలయందు స్వాములవారికి మోహదృష్టి యుండుట చే మాటలాడినను, తిరుగుచుండినను, ప్రశ్న లడుగుచుండినను ఆ తెలివితేటలు గమనించుచుండుటచే తన మనస్సులోని బ్రహ్మదృష్టి యెగిరిపోయినది.

కమల; సౌందర్యఖని, సన్యాసి; యవ్వనుడు, ఇద్దరు విద్యావంతులు, యిద్దరు సౌందర్యవంతులు, యిద్దరు యవ్వన వంతులు యిటువంటివారు ఏకాంతముగా మఠమునందుచేరి సంభాషణలకు ప్రారంభించినప్పుడు; సన్యాసి మనస్సు. కమల మునందు తుమ్మెద వ్రాలినట్లు కమలాదేవిపై వ్రాలినది. మ నస్సును త్రిప్పుకొనలేకపోయినాడు. కమలాదేవి అడిగినమాట లకు జవాబులేదు.

స్వామి; సమాధి నిష్టయందు నిమగ్నుడైనాడని కమ లాదేవి తలచుకొనినది కొంతసేపటికి స్వాములవారు నిజస్థితికి వచ్చి, కమలాదేవీ! ఉన్నావా!

కమ: ఇచ్చటనేయున్నాను తాము నేను చూచుటకు తీపుగా కానుపించుచున్నారు కారణమేమి?

స్వా: కారణ మేమియులేదు. నేటిదినమున దేహము నందు యించుక స్వస్థత దప్పినది.

కమ: కారణమేమి? స్వామివారు! పదిరోజులు మా యింటికి దయచేయుడు కొంత నెమ్మది అయిన తర్వాత వత్తురుగాని.

స్వా: అవసరములేదు. నే నిచ్చటనే యుందును యెప్పుడును మాబోంట్లు యేకాంతవాసముగా నుండవలయునుగాని సంఘము పనికిరాదు.

కమ: సరే నేను వెళ్లివచ్చెదను.

కమల వెళ్లినది. సన్న్యాసి తన మనస్సున కమల నుద్దేశించి యీలాగున వ్యాకులపడ జొచ్చెను.

స్వా: ఆహా నే నేల సన్న్యాసి బట్టల ధరించితిని. దీని యందు నిజముగా సుఖములేదు. ఆతురపడి సన్న్యసించితిని. ఆశ్రమ విరుద్ధముగా ప్రవర్తించుట తగదు కాని కమలను

చూచినప్పటి నుండియు మనస్సుపారిపోవుచున్నది ఏమిచేయు టకును తోచుట లేదు.

స్వాములవారు యిట్లాలోచించుచుండగనే తెల్లవారెను. కొంతసేపటికి మరల కమలాదేవి వచ్చి స్వామినిచూచి,

స్వామీ! ఏమి ఆలోచించుచున్నారు?

స్వా: ఆలోచన యేమున్నది రమ్ము యేమి ఇంత ఆల స్యము చేసితివి

కమ: ఏమియులేదు. మా పినతండ్రి కుమారుడు వచ్చి యున్నాడు. సన్యాసుల మఠములకు మావంటివారిని పంప గూడదనియు, అయ్యది అనర్థ కారణమనియు, మా తండ్రికి బోధ జేయుచున్నాడు; నేనింక రాగలుగుదునో రాలేనో మన్నింపవలయు.

స్వా: ఏమీ? కమలాదేవీ! నీవు పాఠములను పూర్తిగా చేయుదువా? యింకను నీకు నేర్పవలసినవి యున్నవి. అవన్ని

యు నేర్చిన తర్వాత నీవు నిలిచినను బాగు. మీ వారితో నేను చెప్పెదను. నీకు వచ్చిన భయమేమి? యిచ్చట నే యుందుము. నీ జీవితాధార మైనవి మానుకుందువా?

కమ: స్వామీ! సరే నా జీవితాధార మగునది విద్య దానిని నే మానుదునా!

స్వా: (స్వగతము) అయ్యో నా మనోగతమును గూఢముగా బోధపరచితిని యీ ముగ్ధకు తెలియలేదు (ప్రకాశముగ) కమలా దేవీ! అట్లు విద్యయే నేర్చుచుండినచో ప్రయోజనము లేదు. సమత్వము నేర్వవలయును, భేదము మనస్సున నశించవలయును. అంతయు బ్రహ్మస్వరూపమే. నీవు వేరు, నేను వేరనునది జ్ఞానమునకు అడ్డుతగులును తెలియునా.

కమ: సమత్వ మనగా యెట్టిది?

స్వా; మరల యడిగెదవే చెప్పితిని గదా.

కమ: స్వామీ! మీరు చెప్పునది సత్యమే; లోకమంత

యు భేదదృష్టిగనే కానుపించు చున్నది.

స్వా: అదియట్లుండనిమ్ము; మొదట గురుశిష్యులయందు భేదముండిన జ్ఞానమేరాదు.

కమ: మనకిప్పుడు భేదమే మున్నది? మాయింట తాము భుజించు చున్నారు; మమ్ము తాకుదురు; భేదములేక వర్తించు చుంటిమిగదా! మనలో భేదమే మున్నది?

స్వా: కమలాదేవీ! నీతోటి యెవరును రాలేదా? ఒకదానివే వచ్చితివా?

కమ: నేడెవరును రాలేదు; ఒకదానినే వచ్చితిని.

స్వా: అయిన యిటురమ్ము; యింక రానునుచున్నావు; ముఖ్యమగు విషయము చెప్పెదను.

కమ: నేను త్వరగా వెళ్లవలయును; తాము తెలుపవలసిన దేదియో తెలుపుడు.

స్వా: కమలాదేవీ! నా మనోరథము తెలుపుదును. నీవు చేలవుగావు; చక్కఁగా చదువుకొన్నదానవు; ఆలోచించి ప్రత్యుత్తర మిచ్చెదవా?

కమ: యతిచంద్రా! తమ కింకను మనోరథములా! ఆశ్చర్యము; సర్వమనోరథములు విసర్జించుటగదా సన్యాసము; తమబోంట్లకు మనోరథము లున్నచో, సామాన్యులగతి యేమి?

స్వా: తొందర పడెద వేల?

కమ: తొందర నాకుగాదు; తమబోంట్లు సహితము మనోరథ శృంఖలాబద్ధు లగుచుండ యిఁకలోకమున తొందర లేక శాంతి యెవరికి? తాము మొదట భిక్షకు మాయింటి కేతెంచిననాడు తమ తరుణవయస్సు, దేహసౌందర్యము చూచి సన్యాసులుగా నుండ తగరని తలఁచితిని; నాయూహ సరిపోయెనది; స్వామీ! నేను తమసన్నిధానమున నుండు సమయమున తామున్నతీరు; నే వెడలుదు నన్నప్పుడు తాముపడు సంతాపము

చూచుచునే యున్నాను; కాని- పవిత్రప్రేమగల సుస్వభావులు అందరయందును ఒకవిధమగు ప్రేమనే చూపుచుందురు. యిందు ఆశ్చర్య మేమిగల దని తలంచుచుందురు. తమప్రేమ అట్లుకాదు; మనోరథములపై ఆధారపడినది; (అనగా కోరికలపై ఆధారపడినది) తమప్రేమ నిర్వ్యాజముకాదు.

స్వా: కమలాదేవీ! నేను తెలుపకయే నీవెన్ని యూహాలవెంట పోవుచున్నావు.

కమ: స్వామీ! నన్నేకాంతమున తాము ప్రశ్నించు మనోరథము వెలిపరచవలయు నను యూహకూడా! తమకు వాడముచున్నదా! కానిండు చూతము.

స్వా: కమలాదేవీ! సుందరాంగులను చూచిన సాధారణముగా మానవుల హృదయమున నేమియూహపొడమును? చెప్పుము చూతము?

కమ: ఈశ్వరవిలాస మని తోచుచుండును. మీబోటివారు యీలాగున భావించరు; చూడుడు!

సీ. ఉపమాన రహిత 'మీ యుర్వి నొక్కనిమోము
నీరేజముల మీరు నేత్రయుగము
పరికింప నొక్కని పల్కు తేనియలొల్కు
పలువాల. కట్నలపంక్తి గేరు
కాంచనొక్కని నడ కడు రమ్యమైయొప్పు
జూడ నంగమ్ములు సొంపుమీరు
రమ్యమా నొకని యు, రంబు గాంచిన యంత
కర చరణంబులు ఘనతమీరు

గీ: అహహ నీసృష్టిచిత్రము నరసిచూడ
నిట్టిదిట్టిదియని యూహ నెఱుగలేను
పొగడ దరమా నె నీశక్తి పూతచరిత
నిన్నుచూతురు నేతలు నేర్పుమీర.

స్వా: ఇట్లు సకలసౌందర్యములు ఆపరమేశ్వరుని విలాస
మేకాని వేరేమియు కాదు.

స్వా: కమలాదేవీ! నేనా యీశ్వరవిలాస మంతయు
నీ ముఖ సౌందర్యమున చూచు చున్నాను. చూచుకొలది

మనస్సు మరలింపజాలక అనవరతము నీ సాన్నిధ్య సౌఖ్యము ననుభవింప దలంచు చుండును; వెయ్యేల; నిన్ను విడిచిన నాము నుగడ దుర్లభ మని తోచుచున్నది.

నీవేమొ యీశ్వరవిలాస మనియు, మనోరథములు సన్యాసులకు త్యాజ్యము లనియు పలుకుచున్నావు; నే నెన్ని మో గ్రంధములు చదినవాడను; యెటువంటి గ్రంథముల నైనను కవనములల్లి వ్రాయుదును; నాకు తెలియునివి లేవు నీవేమొ నాకు విద్యగరప నాలోచించెదవు; నీమాత్రము నాకు తెలియ దనియా నీయూహ.

ఇవన్నియు కట్టియుంపుము; యిచ్చటకాకున్న విదేశ ముల కేగుదము; మనదాంపత్యమునకు కొదువయుండదు.

కమ: ఎంతమాట! స్వాములు భామలగోరుట తగునా! తా మెంత గొప్పవా రని మేమనుకొంటిమో అంతనీచగుణము తమయందు కానుపించు చున్నది

యేమియెరుగని ముగ్ధలను జ్ఞానోపదేశము చేయుచు

మని దగ్గరచేర్చుకొని, తుదకు యిట్టి జ్ఞానోపదేశ కర్తలగు చున్నారు.

ఇట్టి పరమనీచులు పట్టి ప్రగల్భములు పలుకుచు, లోకముననున్న వుత్తమాంగనలపాలిటి మిత్తువులై యున్నారు. యెందరు మీబోట్లకు లోబడి తప్పించుకొనలేక కష్టములపాలై వ్యసనమున కుందుచున్నారో! యిట్టివారి కాఆశ్రమములు, మఠములు, శిష్యులు ఆహా! యెంతఘోరము!

ఓ ధూర్తసన్యాసీ! బుద్ధిగలిగి బ్రతుకుము; సిగ్గులేదా? ఇట్టి "పావన ఆశ్రమస్వీకారము" యెందులకు స్వీకరించితివో మరచితివా? యిట్టి వేషములద్వారా వ్యభిచరించిన మాసిపోవు నని తలంచితివా? ఇంకయు మాబోంట్లకు "చిత్తచాంచల్యము" గలిగినచో, న్యాయముకా దని బోధించవలసిన తమరు; మును ముందు యిట్టి కైంకర్యమునకు పూనుకొంటిరి; చాలా తెలివిని గడించితిరి; చాలు చాలు; యింకనయినను బుద్ధి గలిగి యింద్రియని గ్రహులై, యిట్టిసంకల్పములను పూర్ణముగా విసర్జించి ఆశ్రమోచితజ్ఞాన మార్జింపుడు.

స్వా: కమలా! నీవంటి జ్ఞానోపదేశ కర్తలు యింతవ రకు లభించ నేలేదు; యేలబింకములు పలికెదవు; నేనొక వార్త చెప్పెదను; అంతయు బ్రహ్మము; యింద్రియ వ్యాపారములు బ్రహ్మమే; యేలయిట్లు యెగిరిపడుచుందువు

కమ: అయ్యా యింద్రియ వ్యాపారములు అన్నియు బ్రహ్మమా? అట్లయినచో గమచెంపలపై నెవరైనను నాలుగు ఆదితాళములు వాయించిన అదియు బ్రహ్మమేగదా? తాము భేదరహితులుగదా!

స్వా: ఓసీ! గడుసుదానవువలె కానుపించు చున్నావు. సూబోంట్లను యెదిరించి పలుకుదువా? మీ స్త్రీజాతి స్వభావముగనే చపలలు; కావుననే యిట్లుపలికితివి

కమ: ఔరా మీ! స్త్రీజాతి చపలమా? నీవంటి కపటస న్యాసులు స్థిరబుద్ధులా? నీకు విఫలతగలిగినయెడల స్త్రీలు చపలులందువు; నీకు సఫలత గలిగిన స్త్రీలు పవిత్రులందువా? యిప్పటి కెందరిని నీవాతివేసుకొని, జ్ఞానహీనుల గావించితివో!

నీది ఆశ్రమమా? పిశాచములు నివసించు స్మశానమా; యోచించు కొనుము.

బుద్ధిగలిగి యింకనైనను స్త్రీలను మాతృస్థానీయులుగా భావించి, అన్నిటియందును పరమాత్మాంశ స్థాపింపబడి యున్న దను విశ్వాసముగలిగి, ద్వైతచింతన జేయుచు, యింకనైనను దుష్టచింతలువదలి, జీవితమును గడుపుము. (నీతోటి) దుష్టాత్ముల నందరిని "యీ శ్వరుడు" మంచిదారి నొసగి బ్రోవుమగాక యని ప్రార్థించుము; యింతకన్నను నీకు గత్యంతరము లేదు.

స్వా: కమలాదేవీ! నీవు వాకొక (యాదస్మరాలవై)తివి. వివేకము శూన్యమైనకాలమున ఆదరించువారు ఆరుదు, సంకల్ప ప్రవాహమున యెంతవరకు కొట్టుకొని పోవుదునో తెలియదు నీవు నావవైయె నన్నాదరించితివి. ( కామాతురాణాం నభయం నలజ్జా ) అను వచనము సత్యము.

యెంతశాస్త్రజ్ఞాన మున్నను, యింద్రియనిగ్రహమునితో సరిరాదు, నాకు చక్కని ప్రబోధగావించితివి. నే నిదిమొదలు

తీర్థయాత్రలుచేయుచు, భిక్షలు, పాదపూజలు, శిష్యజనఘూటిలు మానుకొని పరమేశ్వరు నారాధించుచు, జీవితము పవిత్రముగావించు కొనియెదను.

అమ్మా సాధ్వీ! నాచేసిన నేరములు లెక్కింపనలవిగాదు. యీవేషము వేసి లోకుల నెందరినో మోసముచేసి, అమాయకులైన స్త్రీలకు దుర్బోధలు గావించి, నావశమగునట్లు చేసి, కామసంచారినై తిని. నాయాచరించినవి మన్నింప నెవరు దిక్కు.

అమ్మా! మీయింటికి నేను భిక్షకు వచ్చిన నాటనుండి నీయందు నాకుండిన సంకల్పము దుష్టసంకల్పమేగాని వేరులేదు.

నీ వోక్కదానవే మా యొవరిని చూచినను తెలదను స్త్రీయని పేరుంచిన రాతిబొమ్మను జూచినను సద్భావన చేసి తెరుగను.

నామానసము నిప్పులబోరలి నట్లున్నదీ; నాగతియేమి?

అమ్మా! చిన్నవయస్సుయినను, స్త్రీవైనను, చదువులు వేయి చదువకపోయినను, పరమేశ్వర కరుణచే నీకు "బ్రహ్మచర్య జ్ఞానము" అనగా [ఇంద్రియ నిగ్రహము] కలిగి మాబోంట్లకు ఆదర్శప్రాయురాల వైతివి; నీకు నమస్కారము; నేనీయూరను డజాల; నాకేల యీ ఆశ్రమబాహుళ్యము; పరమేశ్వరుని భజించుచు నాజీవితశేషమును గడుపుకొందును.

కమ: అయ్యా! పాపమునకు పశ్చాత్తాపము మందు వంటిది. తాము పవిత్రులైతిరి. తమబోంట్లు విద్వాంసులు గావున ప్రమాద పడినను అతిశీఘ్రకాలమున పవిత్రులగుదురు.

విశ్వామిత్ర, పరాశరాదులుగూడ ప్రమాదపడినవారే (ప్రమాదో ధీమతామపి) అన్నట్లు బుద్ధిమంతులు ప్రమాదపడుట తటస్థించినను వెంబడె మార్చుకొనగలరు. నే పోయివత్తును

స్వా: అమ్మా! నేనునూ నేటిరాత్రియే యీయంజనఘాటము కంతటయు స్వస్తిచెప్పి వెడలిపోయెదను.

"స్వయముత్తీర్య పరాంశ్చారయతి" అన్నట్లు నేనుత్తీర్ణుడ నైనగదా పరులఁ దరింపఁజేయుట? నేనొకానొక స్వార్థమునకై యిచ్చట, మఠము నొకదానిని నిర్మించుకొంటిని, నా నేరము నాకు తెలిసినది.

కమ: తనతప్పు తనకు తెలిసిననే బాగుపడుటకు ఆధారము. తన నేరములు యితరులు తెలిపిన కోపముగలుగును. తనకే తెలిసినచో శీఘ్రముగానే నిర్మలుడగును.

గాన– మీరు ధన్యులు నమస్కారము. వెడలుదు.

కమలాదేవి యింటికి వచ్చులోపల తండ్రి యెదురుగా వచ్చి; అమ్మాయీ! యింత ఆలస్యమైన దేమి? పాఠములు యెక్కువగా నుండినవా? స్వామివారు ఏమైనను బోధగావించుచుండిరా?

కమ: నానగారూ! ఏమియులేదు శాస్త్రవిచారముఁ జేయుచుంటిమి.

రం: స్వామివారు ఎచ్చటికో ప్రయాణముగానున్నారే?

స్వా: రంగారావుగారూ! నేటిదినము తీర్థయాత్రలు సేవించుటకును, దేశసేవ జేయుటకును బయలు దేరుచున్నాను.

రం: తమకేమి తీర్థయాత్రలు, తమకేమి దేశసేవ తమ కింకను చేయు తపస్సు, తాము పూర్ణులుగదా?

స్వా: రంగారావుగారూ! యిదివరకు నేనును అట్లే తలంచి యుంటిని యిప్పటి నాస్థితి చక్కగా విమర్శించు కొంటిని. నేనింకను చేయవలసినవి చాలగలవు.

నే నిప్పుడే యీ ఆడంబరముల త్యజించి మానవుని కర్తవ్యము నూహించి బయలు దేరుచున్నాను.

రం: అమ్మాయికి ఏమి సమాధానము చెప్పి వెళ్లు చున్నారు? రేపటినుండి ఆమె యే దీక్షగలిగి వర్తించవలయును?

ఆయుత్తమ గుణసంపత్తిగల సాధ్వికి యితరులు

చెప్ప ని యు లేదు.

సద్గుణములు భగవానుని దయచే గలవారలకు పనులు చెప్పునది నిమిత్తమాత్రము. మీ కుటుంబమునకు నమస్కారము నే పోయివచ్చెదను

రంగారావుగారు, కమలాంబయు యిల్లుచేరిరి. నిత్యము కమలాంబ సద్గ్రంథపఠనము, భగవన్నామము జపించుకొనుచు కాలము గడుపుకొనెను.

పరమేశ్వర కరుణచే బుద్ధిదార్ఢ్యము గలిగినది కావున బ్రహ్మచర్యము, శీలము గాపాడుకొనగలిగినది. లేకున్నచో ఆయువతి జన్మము నాశము కావలసినదేగదా?

కావున తమ వితంతు పుత్రికలను తలిదండ్రులు చక్కగా వారి ప్రవర్తనను చూచి; ఏవిద్యయందు ప్రవేశపెట్టవలయునో యోచించి వైరాగ్యము, శీలము, ధైర్యము విద్య మొదలగు ఆత్మోన్నతి మార్గములను తాము నేర్పుట చాలా మంచిది.

అట్టి స్త్రీలు ఉండిన వారివద్ద చేర్చి తగు అనుభవము

గావించిన చాలా శ్రేష్ఠము.

ఇంతకన్నను వితంతు స్త్రీలకు ఆత్మోన్నతికి మార్గము కారాదు. పరమేశ్వరుని చేరుటకు ఇదియే చక్కనిమార్గము.

స్త్రీలైనను, పురుషులైనను చక్కని జిజ్ఞాస చేయ నిచో ప్రబుద్ధులు కాజాలరు.

జిజ్ఞాసాభక్తి పరమేశ్వరుని సాన్నిధ్యము శీఘ్రముగా చేర్చగలదు.

(జ్ఞాతుమిచ్ఛా జిజ్ఞాసా) పరమేశ్వర జ్ఞానమును తెలుసు కొనగోరువాడు 'జిజ్ఞాసు' సద్గ్రంథపఠనము చేయువారు, శ్రవణము చేయువారు, నిష్కామబుద్ధితో పూజలు, దానములు, చేయువారు,

ఇట్టివారెల్లరు జిజ్ఞాసులే. యిట్టిజిజ్ఞాసులు తాము తెలి యగోరు అతిరహస్యమగు, ఆత్మజ్ఞానరూపమగు పరమభక్తిని పొందువరకు దీక్షవహింతురు.

శ్లో: ప్రారభ్యతే నఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్ననిహతా విరమన్తి మధ్యాః
విఘ్నైర్ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధ ముత్తమగుణా నపరిత్యజన్తి.

[భర్తృహరి]

అధములు విఘ్నములు సంభవించునని కార్యము నారంభింప వెరతురు. మధ్యములు ఆరంభించి విఘ్నములు వచ్చినప్పుడు వదలెదరు, ధీరు లెన్ని పర్యాయములు మెట్టి విఘ్నములు వచ్చినను తాము పట్టిన కార్యమును విడువరు.

కావున సన్యాసి కాశీపట్టణము చేరి శివప్రతిష్ఠను పూని భగవాను నారాధించుచు ఇంద్రియ జయములేక ఆశల నడచలేక చేలమై ఆతురతతో సన్యాసముబూని ఉభయ భ్రష్టుడ నైతిని.

భారతీయుల భాగ్యదేవతయగు భగవద్గీతను ఎన్నిసార్లు పఠించితిని గానీ విద్యాగర్వముచే అనుభవజ్ఞాన దూరుడ నైతి.

గీ. 1 అ 6 శ్లో.

శ్లో. సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధి గచ్ఛతి.

తా కర్మయోగ మాచరింపని సన్న్యాసమును నిర్వ
హించుట కష్టతరము, నిష్కామ కర్మయోగానంతరమునపొందు
సన్న్యాసముచే అచిరకాలములో ముక్తిపొందును.

కావున- గర్వము సర్వనాశన మనునది నిజమయ్యె.

సకల శాస్త్రములు చదివితిని యజ్ఞయాగాది క్రతువు
లాచరించితిని, ఇంద్రియ నిగ్రహమున కవి తోడు పడమి
చింతించుచున్నాను.

శాస్త్రజన్య జ్ఞానముగాని, చాంద్రాయణాది వ్రతములు
గాని, ఆహారనియమములు గాని, పాటింపకయే కమలాదేవి
యెంత యో మనోనిగ్రహముగలిగి జ్ఞానార్జనము గావించినది.
యిది కడుచిత్రము.

# భక్తిసోపానము.

ఇట్లు తాసస్వామీజీ; వితర్కించుచుండ అచ్చటి కొక్క సాధు వేతెంచి-

సా: స్వామివారేమొ పరధ్యానముగా నున్నారే! మా బోంట్లకు సంభాషణావకాశము లేదా?

స్వా: లేకేమి; యింద్రియనిగ్రహమునకు చక్కని సాధనలేవి యని ఆలోచనగావించుచు గంగాతరంగ శోభాయమానంబు దిలకించుచు యిచ్చటగూర్చుండి యున్నాను.

సా: అయ్యా! సకలశాస్త్రవేత్తలే కాము; ఇదియును గాక; తా మొక ఆశ్రమనిర్మాణము గావించి, అందనేకులకు సద్బోధలు గావించుచున్నారని వినియున్నాను; ఆశ్రమస్వీకారానంతరమా యింద్రియ నిగ్రహాలోచన?

స్వా: సాధూజీ! శాస్త్రములఁ జదివి, ఆశ్రమ నిర్మాణముఁగావించి, పరులకు బోధించుటసులభము; మనోనిగ్రహము చాలా కష్టతరము; వస్తుసమక్షమున మనోనిగ్రహము మిగుల కష్టసాధ్యము.

సా: యేలా? అనవరత భగవచ్చింతన గలిగి, త్యాగియై సర్వకార్యములు యీశ్వరార్పణముగా చేయుచు, యెల్లప్రాణుల యందు సమాన దైవప్రేమ యుంచి, మౌనముద్రను వహించి, ప్రాణధారణకై భుజింపుచు, (రుచుల విడచి) శీతబాధ నివర్తించుటకై వస్త్రధారణ గావించుచు, నిరభిమానుడై, యుండు కామములేని ప్రేమయోగికి మనోనిగ్రహము సులభమై యుండును

సులభమేమి? మనోలయము, వాసనారహితము, స్వాత్మరతి యిట్టివానిని జ్ఞానియన్నను, నిత్యానందుడన్నను, స్థితప్రజ్ఞుడన్నను జెల్లును.

ఇట్టివారే రామకృష్ణాది పరమహంస బిరుదాంకితులు. యిట్టివారే సులభ చూడాలాది పరమ యోగినులు.

ఉత్తమశ్రద్ధలేనివానికి జ్ఞానము గగనకుసుమమువంటిది.

గీ. 4 అ. 39 శ్లో.

శ్లో: శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయతేంద్రియః

జ్ఞానం లబ్ధ్వాపరాంశాంతి మచిరేణాధి గచ్ఛతి.

తా: శ్రద్ధ, ఆసక్తి. సేవ గురువాక్యముల యందు విశ్వాసమును, యింద్రియ నిగ్రహముఁగలవానికి అచిరకాలము లోనె జ్ఞానముఁగలుగును. జ్ఞానము; అనుభవములోనికి వచ్చిన వెంటనే మోక్షము గలుగును. అపుడే శాంతి చేకూరును

ఉత్తమశ్రద్ధవల్లనే మానవుడు జయమును పొందగలడు.

సాధుసేవవలన వుత్తము శ్రద్ధాశబ్దార్థము బోధపడఁగలదను విషయము "స్వామీజీ" చక్కఁగ నెరిఁగి కృతకృత్యత వహించెను.

సాధువు; తన స్వాత్మానందానుభవమున నోలలాడు చుండెను.

పాఠకమహాశయులారా! శ్రీశైల భజనకీర్తనలు అను చిన్నపొత్తము (నటేశలీల) అనునది "పెండ్యాల బుచ్చికృష్ణ దాసుగారు" వరంగల్ (నైజాం) వారిచే రచింప బడినది.

యూపాత్తమునకు పీఠిక వ్రాసినవారు; ఇట్లు బుధజన విధేయుఁడు; ముదిగొండ వీరమల్లికార్జునుడు అని తమ నామ ధేయమును వ్రాసికొని యున్నాడు;

ఇదియునుగాక, (సాంగ వేద విద్యాస్థానము వరంగల్) అని వ్రాసికొని యున్నాడు.

వీరువ్రాసిన పీఠిక; చక్కని భాషాశైలి మృధుమధుర ముగా నుండుటంబట్టి సాంతముగా మదీయ ప్రేమపుత్రులు విన్న కోట వెంకటరత్నశర్మగారు [ గీతాప్రచారకులు ] చదువుచు నాకొసంగిరి. అందు పీఠిక మూడవ పేజీయందు [యదేచ్ఛముగా ప్రమత్తములై జరించు నింద్రియముల నిగ్రహించుటకు శాస్త్ర జ్ఞాన మత్యవసరము] అని వ్రాసియుండెను

ఇంద్రియనిగ్రహమునకై శాస్త్రమభ్యసింపవలయు నని గీతాది గ్రంథములు బలుకుట లేదు. విరాగముఁగలిగి భక్తి శ్రద్ధ లున్నచో, ఇంద్రియనిగ్రహముఁ గలుగునే గానీ, శాస్త్ర ములు జదివినంతమాత్రముననే ఇంద్రియములు స్వాధీన మగు ననుటకు వీలులేదు.

భగవద్విశ్వాసము, తీవ్రవైరాగ్యము ఆవేదనఁగలిగి "శ్రీరామకృష్ణుడును" అనవరత భగవన్నామ గానముచే, "త్యాగరాజుగారును" నిశ్చలధ్యానముచే 'గుహుడును' తీవ్ర జపనిష్ఠచే 'శబరియు', ఇంద్రియనిగ్రహులై భగవత్సాక్షాత్కారమును పొందినట్లు తెలియుచున్నది.

'విశ్వామిత్రాదులు' సకలశాస్త్రముల నభ్యసించినవారలేగదా? యేల శృంగార రస నిమగ్నులై మేనకాది వనితల వలలకు చిక్కి తమ తపోబల మంతయు ధారవోసికొనిరి.

చక్కగా విచారించిచూచిన, భగవద్భక్తి, తన్నామస్మరణ, శకలభూత ప్రేమ, ఆశావర్జితము, ఓర్పు యిత్యాదులు యెవరి మానసక్షేత్రమున సుస్థిరములై యుండునో, వారింద్రియముల నవశ్యము జయింతురు.

'రామకృష్ణపరమహంస' గారి సతీమణియగు 'శ్రీశారదాదేవి' వద్దకు అనేక స్త్రీలేతెంచి, అమ్మా! విద్యావిషయ స్వల్పుల మగు మాబోంట్లకు భగవత్సాక్షాత్కార జ్ఞాన మెట్లు

లభించును; నియమించి తెలుపు డని ప్రశ్నించిరి.

ఆగమయామయి అమ్మలారా! గృహకార్యము లన్నియు యీశ్వరసేవయను దృఢవిశ్వాసము నలవరచుకొనుడు. క్రమ క్రమముగా యీ విశ్వాస మీశ్వరుని చెందును; తద్వారా యింద్రియజయలాభము కలుగును. దానివలన మీరు భగవత్సాక్షాత్కార జ్ఞానమును సమీపింతు రనియెను.

ఇట్లు పరమపూజ్యుల వచనము లెన్నిగోని యింద్రియ నిగ్రహమున కాదర్శములై యున్నవి; శాస్త్రజ్ఞానము లేక పోయె ననియు, ఇంద్రియ జయమునకు మార్గాంతరము లేదనియు నిరుత్సాహపడ నవసరము లేదు.

'శ్రీ గాంధిమహాత్ముడు' సహితము తాము గాంధిస్థాన స్లోకములో యిట్లు నుడివిరి.

భగవన్నామ విశ్వాసము, తగుబ్రహ్మచర్యము గలిగిన వారు, నిరుత్సాహపడ నవసరము లేదు; తప్పక యింద్రియ

జయముఁగలిగి కృతకృత్యులు కావచ్చు ననిరి.

కానీ- శాస్త్రజ్ఞానము నప్రయోజన మనియు. శాస్త్రమును చదువ నవసరము లేదనియు వ్రాయసాహసించలేదు.

గీ 6. అ. 24 శ్లో.

శ్లో: తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య వ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం కర్మకర్తు మిహార్హసి.

అని 'గీతాచార్యుడు' నుడివియున్నాడు!

అర్జునా సందేహము గలిగినప్పుడు శాస్త్రమును చూచుకొనుము; శాస్త్రము చెప్పినట్లు చేయుము; శాస్త్రమును నిరాకరింప వలదని శ్రీకృష్ణభగవానులు నుడివియుండ మనము నిరాకరింపఁగలమా?

(విచారమాల)

శ్లో. వేదాః త్యాగశ్చ యజ్ఞాశ్చ నియమాశ్చ తపాంసిచ

న విపరీతస్య భావస్య సిద్ధిం గచ్ఛంతి కర్హిచిత్.

తా. వేదాధ్యయనము చేతఁగాని, సన్యాసము చేతఁగాని, యజ్ఞములచేతఁగాని, నియమముల చేఁగాని, తపస్సుచేతఁగాని పవిత్ర వర్తనము లేనివానికి సిద్ధిగలుగదు.

కావున- శాస్త్రార్థ జ్ఞానము సత్ప్రవర్తన తోఁడ్పాటు లేక ఏమియు చేయజాయలము.

ఒకటికాదు ఆరుశాస్త్రములు, నాలుగు వేదములు, పదునెనిమిది పురాణములు వ్యాసములవలె వ్రాసిన వేద వ్యాసులు సహితము 'గోమతీ తీరముజేరి ఎన్నియో వ్రాసితిని గానీ నామనస్సు శాంతివహించలేదే! ప్రధానేంద్రియ మిట్లు కాతరభావము జెందియున్న గతి యేమని' చింతించినట్లును, 'నారదు లేతెంచి వ్యాసభగవానునిచింతాకారణమరసి భగవద్గుణానుభవముల వ్రాయుచు మానసము తత్పరతంజెందునట్లు చేయుము. దాన శాంతి చేకూరు' నని నుడివినట్లును, తుదకు 'భాగవతమువ్రాసి వేదవ్యాసమహర్షి శాంతివహించినట్లును పురాణము లుద్ఘోషించుచున్నవి.

గీ. 2 అ. 61 శ్లో.

శ్లో. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః
వశేహి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా.

అర్జునా! ఇంద్రియము లన్నియు నాపరము (భగవత్పరము చేసినచో లోబడును. ఇంద్రియము లెవనికి లోబడి యున్నవో వాని ప్రజ్ఞ గొప్పది.

కావున చక్కని పట్టుదల గలిగి, ధర్మ జిజ్ఞాసా, సత్య జిజ్ఞాసా చేయువానికి తప్పక జయము సంప్రాప్తించును,

(కఠోపనిషత్తులో:)

నచికేతుడను 'మునికుమారుడు; చక్కని జిజ్ఞాసు; యమధర్మరాజునొద్దకు పోవుట తటస్థించెను; అప్పు డాముని కుమారునిజూచి యీ సమవర్తి యిట్లుపలికెను.

నాయనా! నీవేమొ అడుగనుద్యుక్తునివలె కానుపించు చుంటివి; నిర్భయముగా ఆ ఃము కాను;

అందుల కా మునిపుమారుడు; వ కేతరాజా!

(ఉపనిషత్)

యేయం ప్రేతే విచికిత్సామనుష్యే అస్తీత్యే కేనాయమస్తీతి
చైకే ఏతద్విద్యామనుశిష్ట స్త్వయాహం వరణాం ఏషవర
స్తృతీయః.

తా. మనుజుడు; మరణించగా ఆత్మయున్న దని కొం
దరందురు; లేదని కొందరందురు. ఈవిషయమును గూర్చి
నాకు తెలియచేయుడు అని, నచికేతనుడు వినయముతోప
పలికెను

అదివిని యముడు; నాయనా! ఇంతచిన్నవయస్సుననే
యింతటి ప్రశ్న వేయతగదు; ఇట్టి ప్రశ్నలవలన నీకేమిప్రయో
జనము? నీకు కావలయు ననిన యేమైనను యిచ్చెదను కోరు
కొనుము. అని-

శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ
బహూన్ పశూన్ హస్తి హిరణ్య మశ్వాన్

భూమే ర్మహాదాయతనం వృణీష్వ స్వయంచ
జీవశరీరో యావదిచ్ఛసి........మరణంమాను ప్రాక్షీః.

తా. అయ్యా నచికేతుడా! నీవు నూరేండ్లాయుస్సును కోరుకొనుము. నూరేండ్లు బ్రతుకుము; పుత్రపౌత్రుల కోరుకొనుము; పశువులను, ఏనుగులను, గుఱ్ఱములను, బంగారమును, భూరాజ్యమును నీయిష్టమైనవి కోరుకొనుము; మరణాంతర విషయమును మాత్రము కోరకుము అని యముడుపలికెను.

అందులకా నచికేతుడు; యీలాగున పలికెను.

నవిత్తేన తర్పణీయో మనుష్యో లప్స్యా మహేవిత్త
మద్రాక్ష్మచేత్త్వా జీవిష్యామోయావదీ శిష్యసి
త్వం వరస్తు మేవరణీయస్సఏవ.

తా మనుష్యులకు ధనమువలన తృప్తి లేదు; ఇది మా యనుభవమేగదా! నీవంటి మహానుభావుని చూచినతరువాత కూడా మరల పుట్టుచుంటిమిగదా? కావున— నేను కోరదగిన వర మదియే.

అజీర్యతా మమృతానా ముపేత్య జీర్యన్మర్త్యః
క్వధస్థః ప్రజానన్ అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదా
నతి దీర్ఘే జీవితే కో రమేత.

తా. ముసలితనము చేతను, మరణముచేతను బాధ పడుచున్న ఎవడుగాని, ఈ రెండునులేని మీవంటివారి దరిని చేరి కూడా తన అల్పజీవితమును, అల్పసుఖములలో రమించుటకు కోరునా?

యస్మిన్నిదం విచికిత్సన్తి మృత్యో
యత్సాంపరాయే మహతి బ్రూహినస్తత్
యోయం వరో గూఢ మను ప్రవిష్టో
నాన్యం తస్మా న్నచికేతా వృణీ తే.

తా. యేమరణాంతర విషయమునుగూర్చి అతిరహస్య మని చెప్పితివో, దేనినిగూర్చి అనేకులు సందేహాస్పదులై యుండిరని చెప్పితివో, దానినే నాయందు కరుణచే చెప్పుము, అని నచికేతుడు పలికెను.

నచికేతుని పట్టుదల, శ్రద్ధచూచి నిజముగు జిజ్ఞాసు వని తెలిసి సంతసించి, యూప రేతరాజు; వానికి (ఆత్మజ్ఞాన ముప దేశించి) మరణ మనునది ఆత్మలక్షణము కాదని తెలిపెను.

నచికేతుడు; కృతకృత్యుడై వెడలిపోయెను.

కావున– భగవదనుభవము కలుగువరకు విసుగుచెందక సాధనగావించువాడే జిజ్ఞాసు వనబడును.

"శ్రీత్యాగరాజుగారు" ఒకానొక సాధువు నాశ్రయించి అయ్యా సాధూజీ! 'మానవుడు' భగవద్దర్శనమునకై యెట్టి ప్రయత్న మాచరింపవలయును; దయచేసి సెలవిండు.

సా. నాయనా! కష్టసాధ్యము; యొందరికో నీ కున్న కోరిక కలదుగాని,– ప్రయత్నింతురు; భంగముగలుగు నని భయపడుదురు; ఎట్టియిక్కట్టులు వాటిల్లినను విసుగుగొననివాడు కృతకృత్యు డగును.

త్యా. మహాత్మా! తమబోటివారి నాదర్శముగాగొని

యెట్టిభంగము వాటిల్లినను సరకుగొనక భగవానుని కరుణకు పాత్రుడు కావలయు నని ఉత్సాహపడుచున్నాను.

సా. నాయనా! నీవంటి జిజ్ఞాసువునకు తప్పక జయము గలుగఁగలదు నీవు ప్రతిదినము [ఒకలక్ష] మారులు శ్రీరామ నామజపముఁ గావింపుము; తొమ్మిదికోట్లు జపించినచో, భగవదనుగ్రహము కలుగగలదు; ఈతొమ్మిదికోట్లు పూర్తి యగువరకు దినమునకు [ఒకలక్షనామము] తప్పక విడువక యెట్టివిషమస్థితి కలిగినను మరువక ఆచరింపవలయును.

త్యా. మహాత్మా! చిత్తము; అటులనే కావించెదను. అని మనస్సున నిశ్చయించి యీలాగున నీమముతప్పక ఆచరించుచుండ, భగవానుడు మనోపరిశోధకకర్త కావున, యెన్నియోయిక్కట్లు వాటిల్లఁజేసెను.

కానీ— నిశ్చయమైన భక్తి, వైరాగ్యము, నమ్మకము ప్రేమ కలిగినవాఁడు కావున, "త్యాగరాజు" మధ్య కలుగు భంగములను సరకుగొనక అన్నియు ఆపరమేశ్వర చిత్రములే

యని భావించుచు తొమ్మిదికోట్ల నామజపము హెచ్చుములేని భక్తితో గావించెను, తొమ్మిదవకోటి పూర్తియగునాటిరాత్రి "శ్రీరామమూర్తి" కరుణాసముద్రుడు, భక్తోద్ధారకుడు, అమహాత్యాగి, మహాభక్తుడు త్యాగరాజు వున్నచోటికి కేతెంచి, కుమారా! యనిపిలిచెను.

త్యాగరాజు; శ్రీరామనామమునందు తనమానసము లయపరచి తన్మయుడై యుండుటచే భగవానుడు పిలిచిన పిలుపు వినబడదయ్యెను; రెండవపర్యాయము శ్రీరామచంద్రదేవుడు తనపావనహస్తము ఆతనిశిరస్సుపైనుంచి కుమారా! లెమ్మి; నీ వేనామము జీవితఫలముగాదలంచి, సకలబాధలకోర్చి జపించితివో ఆనామాధిష్టితమూర్తిని దర్శింపుము; లెమ్మి; అని హెచ్చరించెను.

అప్పుడు త్యాగరాజు; కన్నులుతెరచి ఆ మంగళమూర్తిని దర్శించి, ఆనందబాష్పములు కన్నులవెంటఁ జారుచుండగా ప్రభో! ధన్యోస్మి, ధన్యోస్మి యని బిగ్గరగా బలుకుచు, నృత్యము గావించెను.

అప్పుడు శ్రీరామచంద్రమూర్తి; కుమారా! వరము వేడుము యిచ్చెద ననియెను.

త్యా: నామనోరధరమా! నాపతితమమూర్తీ; నాకువర మెందులకు? అనవరతము నీపై కబ్బము లల్లి గానము చేయు చుందును. నిన్ను బాసి నేనుండజాల యింతయే; అన్నియునీవై యుండ నిన్నుమించినది యొకటియున్నగదా! నేనుకోరుట. నాకు నీనామమే కోరఁదగినది; అన్యమేమియు లేదు; నాకదియిమ్ము అంతయేచాలు ననియెను.

భగవానుడు; అతని విశుద్ధహృదయమునకు మెచ్చి కు మారా! నీవు అనవరతము [అనగా నీదేహాపతనపర్యంతము] నా నామము గానముచేయుచు ఆనందముగా దేశమంతటయు వెదజల్లి ఆ నేకులకు నామామృతరహస్యమును తెలిపి తుదకు నాసాయుజ్యమును చేరుము.

ఇట్లుచెప్పి భగవానుడు; అంతర్ధాన మొనరించెను.

అది మొదలు త్యాగరాజు; వీణెచేతబూని అపరనార

దుడా అన్నట్లు అనేకరాగములు పీణెలో మేళగించి శ్రీరాముపై అనేకకృతులు పాడెను,

నాడుమొదలు నేటివరకు భక్తి కోరువానికిని, భుక్తికోరువానికిని " త్యాగయ్యగారి కృతులు " ఆధారములై వెలసియున్నది.

కావున— తానెంత భగవత్తత్వమునుగూర్చి విచారించుచుండునో, అంతభక్తి, మాధుర్యము చవిజూచి క్రమక్రమముగా భక్తిసోపానముల నధిష్టించు చున్నాడు.

ఒకమహామ్మదీయభక్తుడు "అబ్దుల్ ఫజుల్" అనువాడు ఈశ్వరవిలాస మంతయు నేనొక పుష్పమునందుచూచుచున్నానని తానువ్రాసిన [అయానీ అగ్బర్] అను గ్రంథములో వ్రాసియున్నాడు.

ఇట్టివారల యనుభవమునకు జిజ్ఞాసయే కారణము. జిజ్ఞాసు వగు వానికి తృణాంకూరమును, ప్రత్యణువును అనంత

భావములవురికొల్పి ఈశ్వరలీలా మాధుర్యము చవిచూపును;
వేయేల సృష్టి వైచిత్రమే అట్టిది; చూడుడు!

సీ. గుత్తమై నిగనిగల్ గుల్కు రేకులగూర్చి
పత్రినించుకయు లేక నతికినావు
వితతచ్ఛాయల వితతి నెయ్యములాడ
ననుజాళువానిగ్గు నునిచినావు
ఆమధ్య మృదుకేసరాళి సరాళింప
నాధారమును లేక నాటినావు
ముద్దులొల్కెడుదిమ్మ మిద్దెయొకటినుంచి
పూసల నందదు పూడ్చినావు

గీ. ఆహాహ పూవునకుతూండ్లు నడుగున అలమికొనగ
అర్కునకు చందమామకు నలరముడువ
యజ్జని గ్రామణమెటుచేసితయ్య చెపుమ
సుగుణ సంభావ్య సర్వేశ సుపరికావ.

పాఠకమహాశయులారా! "జిజ్ఞాసాభక్తి" భగవానుని

పొందుటకు చక్కనిమార్గము.

భక్తిసోపానముల నుద్దేశించి దీర్ఘ విమర్శన గావింప బడినది.

ఐనను యింకకొన్ని సోపానముల విమర్శన కావలసి యున్నది.

ప్ర. యెట్టివాడిట్టి జిజ్ఞాసా చేయఁగలడు?

ఉ. అర్తిలేనివాడు జిజ్ఞాసా చేయఁజాలడు.

జన్మకర్మలయందు విసుగుజనించి భగవానుడుగాక వేరు దిక్కు కానరానివాఁడు ఆర్తుఁడు. అట్టివానిభక్తి ఆర్తభక్తి.

సాధారణముగా లోకములో ఒకానొక ఆపత్తు గలిగిన సమయమున ఓ వెంకటేశ్వర్లు స్వామీ! మాకు ఈ ఆపత్తును తొలఁగింపుము; నీవేదిక్కు అని మొక్కుచుందురు; ఇవన్నియు ఆర్తభక్తి లక్షణములు.

"గజేంద్రుడు" రుద్రుడు; ఈతడు మనకెల్లరకు చిర పరిచితుడు!

త్రికూటపర్వత సాను ప్రదేశములయందు తానును, తనతోటి అనేక యేనుగులును విహరించుచు, అచ్చట ఆనందంబులను అనుభవించుచు. కొంతకాలము సంచరించి చిగురు జొంపంబులు మెక్కి దాహముఁగొని, నీటికై నొక కొలనుచేరి, ఆకొలనుయొక్క రమణీయతకు ఆశ్చర్యముపొంది మనవంటి పది వేలయేనుగులు త్రావినను తరుగని నీరు చేనిండియున్నదని ఆనందించి, తోటియేనుగులు చూచుచుండ ప్రభువగు తాను, ఆ కొలనులోనికి దిగి, రెండుకాళ్లు నీటియందుంచి, రెండుకాళ్లు గట్టుననుంచుకొని దానియందుండు పుష్పముల నెల్ల తొండముతో లాగి ప్రక్కననుండు ఆడుయేనుగులపై చల్లుచు, సరసములాడుచు, నీరు కడుపునిండా త్రావి అన్ని యేనుగులను త్రాగుటకు సెలవొసంగెను.

అవన్నియు త్రాగి గట్టుచేరెను; తానును ఆకాసరపు నీటిని అతలకుతలముఁగావించి గట్టుచేర నుద్యుక్తుఁడగు సమయ

మున లోపలనున్న యొక మొసలి ఆ మదపుటేనుగుయొక్క
కుడిపాదమును పట్టెను. విడిపించుకొనుటకై అనేక ప్రయత్న
ములుఁ గావించియు, నిష్ఫలమయ్యెను.

ఇట్లెన్ని దినములో గడచినవి; తోటిరేనుగులు భర్త
నువిడచి పోజాలక నిలువఁబడి చూచుచు దుఃఖించుచుండెను.

యెంతో వైభవముతో అరణ్యములన్నియు నిర్భయ
ముగా సంచరించిన యీ మదనాగము, మిక్కిలి భయముఁ జెంది
దిక్కుగానక పూర్వజన్మసుకృతముచే పరమేశ్వరుఁడు తల్పు
నకు రాగా—

శా. నానానేక పయూధముల్

వనములోనం బెద్దకాలంబు స

న్మానింపన్ దశలక్షకోటి

కరిణీ నాథుండనై యుండి మ

ద్దానాంభః పరిపుష్ట చం

దన లతాంతచ్ఛాయ లందుండలే

కీ నీరాశ నికేలవచ్చితి
భయంబేల్లోక దే యీశ్వరా.

ఉ. ఎవ్వనిచేజనించు జగమెవ్వని
లోపల నుండు లీనమై
యెవ్వనియందుడిందు పరమేశ్వరు
డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాది మధ్యలయు డెవ్వడు
సర్వము తానె యైనవా
డెవ్వడు వానినాత్మభవు నీశ్వరు నే
శరణంబు వేడెదన్.

ఇట్లనేకవిధంబుల పరమేశ్వరుని ప్రార్థించి తనస్థితి
అంతయు మార్పుజనింపగా-

శా. లావొక్కింతయులేదు ధైర్యము
విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె
దనువుండస్సెన్ శ్రమంబయ్యెడిన్

నీవేతప్ప నితః పరంబెరుఁగ
మన్నింపందగుం దీనునిన్
రావే యీశ్వర కావవే వరద
సంరక్షింపు భద్రాత్మకా.

అని యాగజేంద్రుండు మొఱపెట్టెను; "జీవుల మొఱలు జీవదయాపరుఁడగు పరమేశ్వరుఁడు గాక, మఱెవ్వరు ఆలించఁగలరు". కరుణామయుఁడగు భగవానుఁడు గజేంద్రుని మొఱవిని రక్షింపఁదలంచి—

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం
కేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁ డభ్రగపతిం
బన్నింపఁడా కర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు వివాద
ప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజ
ప్రాణావనోత్సాహియై,

ఇట్లు ప్రాణాధారుఁడగు పరమేశ్వరుఁడు తనసుదర్శనా యుధమును పంపి, నీటియందుండిన మొసలి తలదుంచునట్లు ఆజ్ఞాపించెను.

మొసలితల తెగగానే! యేనుగు గట్టుచేరెను. తేజోమయుఁడును, జగత్పతియు నగు పరమేశ్వర దర్శనముఁ గావించెను.

శల్యగత ప్రాణుఁడగు గజేంద్రుని; దయామూర్తియగు భగవానుఁడు తనహస్తముచే నిమిరెను

అంతట వాఁడా దేహమునుచాలించి గంధర్వుఁడై పరమేశ్వరుని వినుతించి గంధర్వలోకము చేరెను. తోటియేనుగు లెల్ల గంధర్వస్త్రీలై భర్త ననుసరించిరి.

కావున—

గీ. కరణత్రితుండగుచు కమలాక్షు గొల్చుచు
నుభయ నియతవృత్తి నుండెనేని

చెడునుకర్మమెల్ల శిధిలమై యెల్లన
ప్రిభలమైన విష్ణుభక్తి చెడదు.

కం. చెడుకరులు హారులు ధనములు
చెడుదురు నిజసతులు సుతులు చెడు చెనటులకుఁ
జెడక మనునట్టి గుణులకు
చెడనిపదార్థంబు విష్ణు సేవా నిరతుల్.

కావున– ఆపత్కాలమున ఆర్తుడు; భగవానుని మిక్కిలి అక్కరతో ప్రార్థించును. భగవానుడు దుద్ధరించును ఆపదుద్ధారకుఁడను బిరుదు సార్థకపరుచుకొనెను.

ఆర్తభక్తియు; చక్కని సోపానము; భగవానుని పొందుటకు.

మహాసాధ్వియగు 'ద్రౌపతియు' దుర్మార్గులగు దుర్యోధనాదులు; నిండుసభలో తన్ను చీరలొలిచి మానభంగముఁ గావించు సమయమున మహాఆర్తిచే, భగవానుని ఆపదుద్ధారకా! అనాధరక్షకా! పతులు యేవురుండియు దాయాదులచే

జిక్కి, ధర్మపాశబద్ధులై నన్ను యడకునుండి తప్పింపఁజాల కున్నారు. ఈయాపత్తునుండి నీవురక్షింపకున్న వేరుదిక్కు లేదు.

ఈసభయందు; భీష్మాదులుసైతము చూచుచున్నారు గానీ- వాడిగాదని మందలింపఁజాల కున్నారు. జగన్నాథా! శ్రీకృష్ణా! యేకవస్త్రనై యున్న నన్ను దుండగీడులు పలు గాములు పెట్టుచున్నారు; నన్నీభంగములనుండి తప్పించువారె వరు? ఆపద్బాంధవా! దీనురాలనై వేడెదను; పతివ్రతలపాలి కల్పతరువు; నీవుగాక నేరెవ్వరు?

అలనాడు " దమయంతిని " ఆరణ్యమధ్యమున కిరాతు నిచే భంగమువాటిల్లు సమయమున యా మహాసాధ్వి సతీత్వము గాపాడలేదా!

ఇట్లెందరో సతీమతల్లులు; తమశీలమునకు, భంగపాటు వాటిల్లినసమయమున నిన్నుధ్యానింపగా వారిని వుద్ధరింపలేదా? ద్వారకావాసా! సతీసంరక్షదీక్షా! ఆర్తావనా!నన్నురక్షింపు

మని యాద్రౌపది మొరపెట్టినదది తనయత్నములన్నియు మాని భక్తిపరవశురాలై నిలువఁబడినది.

దయామయుఁడగు శ్రీకృష్ణుడు; ఆసమయమున "అక్షయవలువ" లొసంగి ఆదీనురాలిని, తన్నేనమ్మిన భక్తురాలిని మహాసాధ్వియు నగు యా పాంచాలిని రక్షించెను.

యాపాండవపత్ని; నవమానింపఁ దలంచిన దుర్యోధనాదులు తామే భంగపడిరి.

కావున- ఆర్తభక్తియందును మనోభావములు భగవానునిపై మరల్ప చక్కని మార్గమై యున్నది.

అర్థార్థులుకూఁడా; భగవాను నారాధించువారే! అదియు నొకసోపానమే.

ద్వారకానగరంబున 'సత్రాజిత్తు'నువాఁడు; సూర్యభగవాను నారాధించి అనేకవిధముల ప్రార్థించెను. యాదిననాధుఁడు ప్రత్యక్షమై వత్సా!నా వేడిమికోర్చి వ్రుగతప మాచ

రించితివి; మెచ్చితి వరంబు వేడుము.

స　మహానుభావా! నా కెన్నాళ్లనుండియో సకలైశ్వర్యముల తులదూఁగ వలయు ననియు, రాజు లందరికన్నను నేనెక్కుడు సంపద్విభూతి గలవాఁడుగా నుండవలయు ననియు కోర్కె గలదు దాని నొసంగుడు.

సూ, సత్రాజిత్తా! అలాగుననే అగుఁగాక; నేనొక "మణి"నొసంగెద; దానిని నీవుభద్రపరచుకొనుము; యామణి దినదినము బంగారము నొసంగును; నీవు హిరణ్యవృద్ధుడవై మెలంగుము. అయిన నొక్కటిగలదు; దీని నెవరైననుచూచి నీ కిందుల కసి మందలించినచో వారి కిచ్చివేయుము; లేకున్న నీకిది ప్రాణాంతముఁగాగలదు; జ్ఞప్తియం దుంచుకొనుము అని హెచ్చరించి తిరోహితుఁడయ్యెను.

మణినితీసుకొని రాజు; నిజమందిరంబున కరిగెను. బంధువుల దరు మణినిగాంచి సత్రా! నీకష్టము గట్టెక్కినది; దీనిని పూజగావించి బంధుజాలమునకు విందులొనర్పు మని మంపలించిరి.

బంధువుల అభిప్రాయము ననుసరించి, మణి పూజంగా వింప సమకట్టి బంధుజాలముల కందరకు శుభలేఖ లందజేసెను.

ఇంతలో నారదులేతెంచిరి; సత్రాజిత్తు నారదున కెదురేగి పూజించి తాము త్రిలోకపూజ్యు లని పొగడె

సీ. శ్రుతము నాచారంబు నతిశయవంతంబు లెడ
సహంకార మొక్కింతి యేని
లేదు శీలముగడు లెస్స వేషము నిర్వికారంబ
మత్సర గర్వ మరుదు
జ్ఞానంబు దపము దేజంబును బుద్ధియు
వినయంబు నయమును విశ్రుతములు
ధైర్యంబు వచనమాధుర్యంబు శౌర్య
దైన్య క్రోధ లోభ నిరాసకత్వ

ఆ. మోజ యతనీయందు నైజంబు లీర్ష్యయు
నుద్ధతియు ననూయయును నవజ్ఞయును
నెరుంగ డట్టి మునివరు నారదు నిఖిల
జనులు బొగడు టరుదె యధిప.

ఇట్టిపూజ్యులు వ్రారక మార్గమునకు వత్తురే, యే మికార్యము నిమిత్తము తామువచ్చితిరో తెలవియ్యవలయు.

నా. అయ్యా! నేనువచ్చిన కార్యము తెలుపుదునుగాని నీకు కోపము రాదుగదా?

స్వామీ, యెంతమాట! తాము యేది తెలిపినను నాకే యేల లోకమునకే సుఖప్రదముగా నుండునుగదా.

నా. నీవు తపోబలముచే శమంతకమణిని బడసితి వని విని చూడ నేతెంచితిని.

స, సేవకా; మణియుండు దేవగృహమునకు యీ ము నీంద్రునకు దారిచూపుము; మునీంద్రా దర్శించిరండు.

నారదుడు మణినిచూచివచ్చి:

నా, అయ్యా సత్రాజిత్తూ! మణిని చూచితిని; యి య్యది ఒక్కని యుపయోగమున కన్నను సర్వజనోపకరణ ముగా నుండిన లోకమునకు కల్యాణకరముగా నుండును.

స. దేవా! యెంతమాట సెలవిచ్చితిరి; నేను గతప మాచరించి యీమణిని బడసితిని; యియ్యది నాసౌఖ్యమునకు గాక మరి యెవ్వరి కియ్యమందురు? యెవరార్జించినది వారనుభ వింపరా దనియెూ! తమధర్మోపదేశము?

నా. యేల యట్లుతొందరపడెదవు?

స. మునీంద్రా! తొందరగాక మరేమున్నది; నాప్రా ణాధిక్య మగు శమంతకమణి విషయమున తాము హేతుగర్భ ముగా సంభాషణగావించితిరి.

నా. అయ్యా! హేతుగర్భ మేమియులేదు. ఘనపదా ర్థములు జగత్కల్యాణదాయకములు; అయ్యవి భరించువారు లోకకల్యాణమూర్తులే; సామాన్యులకయ్యవి ప్రాణాపత్కర మనివచించితిని,

స. అత్యంతసౌఖ్యదాయకము లగు పదార్థములను తమబోటి విరక్తులు ప్రాణాపత్తు లనియే చెప్పుచుందురు.

నా. నాయనా! నిజమే; నేనుపోయివత్తును.

స. చిత్తము నమస్కారము; తామెచ్చటి కేగుచుంటిరి?

నా. నేను శ్రీకృష్ణుని సన్నిధానమున కేగుచుంటిని

స. అయ్యా! కృష్ణుడు నామణిమాట విన్నచో తనకు లేకపోయెనని వుడుకును.

నా. సత్రాజిత్తూ! వివేకమున్నట్లు లేదు; తెలిసిమాట లాడుము; యోగేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణభగవానుడు నీయల్ప మణి నుద్దేశించి వుడుకునా? ఆమణిని నీవేమొ ఘనమని భావించి గర్వించుచున్నావు కానీ- శ్రీకృష్ణభగవానిని దృష్టియందు నీమణి అల్పపదార్థమే సుమా!

స. (స్వగతము) అల్పపదార్థమైనచో యేలగడించి యుండరాదు? యెంతయో తపమాచరించి పరప్రసాధముగా బడసిన మణిరాజము, అల్పమట! మునుల కేమి తెలియును. పదార్థభావనలు వారికన్నియు బ్రహ్మభావనలే; పదార్థమా

ధుర్యము వీరి కేమి తెలియును; (ప్రకాశము) మునీంద్రా! తాము ఆరుక్మిణీకాంతు నెదుట మనయిరువురి సంభాషణ బయటపెట్టుదురా?

నా యేమి ప్రస్తావము గలిగిన

నారదుఁడు; నారాయణనామస్మరణఁ గావించుకొనుచు వెడలిపోయెను.

శ్రీకృష్ణసన్నిధానము చేరెను. తిగుమన్ననలుఁ బడసి సత్రాజిత్తునకును తనకును జరిగిన ప్రస్తావన లన్నియు తెలిపి, వెడలిపోయెను.

మరుసటిరోజున సత్రాజిత్తునియింట శమంతకమణి పూజగావింపఁబడియె రాజు లందరు వచ్చిరి, శ్రీకృష్ణుడును వచ్చియుండెను. పూజ కోలాహలముగా జరుపఁబడెను. విందులారగించి యథావిధిగా నందరు యిష్టాగోష్ఠి సలుపుచుండిరి.

శ్రీకృష్ణుడు సత్రాజిత్తూ! యీశమంతకమణి విషయమై

నారదమునీంద్రునకును శ్రీకృష్ణునకును కొంతసంభాషణజరిగినదనివింటిని

స. గోపాలా! మహీంద్రులమాటల కేమి; వారన్నియు త్యజించినవారు; నీవా మునీంద్రులమాటలను వేదవాక్యములుగా అంగీకరింతువు; నేనంతగా అంగీకరింపను; వారిమాటలు సులభములుగావు.

కృ. మహాత్ములమాటలు తాముచెప్పినట్లు సులభములుగావు

స. మాధవా! యెట్లు సులభములు? మణిని లోకకల్యాణమునకై వుపయోగపరుపవలెనట, యివ్వి సులభములా మరి?

కృ. వారు పరులకష్టము లోర్వరు గాన, అట్లుచెప్పుచుందురు.

స. పరులసుఖము లోర్వరని పలుకుము.

కృ. పామరులకు అజ్ఞానముచే కష్టములు సుఖములుగా

కానవచ్చును; మహాత్ములకు యీతుచ్ఛము లన్నియు కష్టము లని వారి యుద్దేశ్యము.

ఇట్లందు కూర్చుండి యిష్టాగోష్టిగా ప్రసంగించు కొనుచుండ, అంతఃపుర మేడనుండి గోపాలదేవుని దర్శించి, యా మోహనాకారమునందు తనమనోలయముఁగాంచి నిశ్చేష్టయై నిలిచియున్న "సత్యభామను" శ్రీకృష్ణుడు చూచెను. చూచి తానును యీకన్యకామణిని అదును వేచి స్వీకరింప సంకల్పముఁ గావించెను.

సత్రాజిత్తు సోదరుడు ఆ"శమంతకమణిని" కంఠమున ధరించి చక్కఁగా అలంకరించుకొని వేటకై అరణ్యమునకు వెడలెను. వేటాడి అలసి యొకచెట్టునీడ నిద్రించుచుండ వానిని యొకపెద్దపులి పైబడి చంపి యామణిని చూచి, అదియొకమాంసపు కబళిక యను భ్రాంతితో తానెత్తుకొని పోవుచుండ, ఆయరణ్యమున "జాంబవంతుడు" అను (యొకయెలుగుబంటు) నివసించుచుండెను. అది యామణి నెత్తుకొనిపోవుచుండిన పెద్దపులిని చూచి అదియేమో చిత్రపదార్థ మని భావించి, యాపెద్దపు

లినిచంపి మణిని తానెత్తుకొనిపోయి తనపుత్రిక యగు జాంబవతి చేతికిచ్చి-

అమ్మా! నీ తూఁగుటుయ్యాలయందు దీనిని జారఁగట్టుకొని ఆనందింపు మనెను; ఆసుందరాంగి అట్లే గావించెను.

సత్రాజిత్తు; వేటకై పోయిన సోదరుఁడు నాలుగుదినములైనను రానందులకు చింతించుచు, యెదురుచూచు చుండెను.

వేటకై వెంటనరిగిన భటులు లేతెంచి, అయ్యా! తమసోదరుని విషయము యేమనిచెప్పుదుము, వేటాడి యలసి అందరును యెవరికివారు చెట్లనీడల నాశ్రయించి నిద్రించితిమి; మేమందరము లేచి చూచునప్పటికి తమసోదరుని శరీరము ప్రాణరహిత మయినది; అంతయేకాదు చిత్రవధ కావింపఁబడి యుండినది.

అదిగాంచి తమతో యీవార్త చెప్పుటకు గాను పరుగిడి వచ్చితిమి.

ఆదివిని సత్రాజిత్తు; మిగుల దుఃఖించి ప్రియసోదరా! అకాలమరణమా నీకు సంప్రాప్తించి నందులకు దుఃఖింతునా! ఉగ్రతప మాచరించి తెచ్చిన మణికయి దుఃఖింతునా యేమిచే యుదును?

(బాగుగా నాలోచించిన) యిదియంతయు వేఱువిధము గా నాకు తోచుచున్నది. "శమంతకము" నావద్ద నుండుటను సహింపని దుండగీండ్రు నాసోదరుని వధగావించి, మణి నపహరించి రనుట స్పష్టము.

ఎవరీపనికై తెగించియుందురు, నారదమునివలన వినినప్పటినుండియు మణిపై కాంక్షఁగలిగి, మణిపూజాకాలంబున సంతసింపనివగిది మాటలాడిన ఆధూర్త గోపాలుఁడే; యింక సందేహ మేమున్నది!

ఆహా! యెంతటిపనికైనను ఓడని ఆకులపాంసుని యేమి చేయనగును. నే నర్థార్థినై సూర్యభగవాను నారాధించిన దంతయు వ్యర్థమై పోయెఁగదా! అయినను కృష్ణు నూరక లేను;

హస్తినాపురికే యున్నాడట.

ఈ గ్నియు మాయావుల పన్నాగములు; శ్రీకృష్ణుడిట్టి ధూర్తుడని చాటుచుండిరి; ద్వారకాపట్టణ మంతయు యీవార్త ఆబాలవృద్ధులాదిగా ఆశ్చర్యచకితులై అనుకొనసాగిరి.

ఈ వదంతి శ్రీకృష్ణునికి తెలిసినది; అనుమానముంగల వారు అపనిందలు ఆరోపణ చేయుచుందురు.

దుర్మార్గులు తాము దురాశాపేక్షితులు కావున, పరుల ననరాని మాటల నాడుచుందురు; వారలకది సహజమని తలంచి మానవున కపకీర్తి యనునది సంకటదాయకము; దానిని వాడు కొనుటకు నుపాయ మాలోచింపవలెనని, లోకమునకు యెరుక పరుపుటకాయన్నట్లు శ్రీకృష్ణుడు; మణిరొక్కపోబడి నెరుంగుటకై బయలు దేరి అరణ్యమంతయు వెదకి జాడల నెరింగి, జాంబవంతు డుండు గుహాచేరి లోపల ప్రవేశించి కన్యామణియగు 'జాంబవతిని' శమంతకమణిని చూచి జాంబవతిని అడిగెను.

కృ. కాంతా! ఈమణి యిచ్చటికెట్లువచ్చినది?

జాం. పురుషపుంగవా! యిది మాతండ్రియగు జాంబవంతుడు తెచ్చి యిందుంచి యున్నవాఁడు; యెట్లువచ్చినదియు నేనెఱుంగను.

కృ. యీమణిని నేనెత్తుకొని పోవుదును; మీతండ్రి తో చెప్పుము.

జాం. మాతండ్రి యనుజ్ఞఁబడసి గొనిపొండు.

ఇయ్యది మాసొమ్ము; మేమెత్తుకొని పోయెదము; పరుల అనుజ్ఞ యేలా?

జాం. ఇచ్చట తమసొమ్ముకాని దేమున్నది. యెంతమీ సొమ్మైనను పరులయొద్ద నుండుటచే అట్లుపలికితిని.

కృ. మీతండ్రి యెప్పుడువచ్చును?

జాం. అదిగో వచ్చుచున్నాడు; తమ కేదైనను ఆపత్తి గలుగునేమొ?

కృ. ఆపత్తు యేలకలుగును? నేనల్పసత్త్వుడనుగాను; భయపడవలదు

జాంబవంతుడు యెవడు యేకతంబుననున్న నాపుత్రికతో సంభాషించువాడు యెవడవురా నీవు?

కృ. నేనెవడనైననేమి శమంతకమణి నెత్తుకొనిపోవ వచ్చియున్నాను.

జాంబ. ఆహా! యెంతపొగరుబోతువు; బాలికలు వేడుకమై క్రీడించునవి నీకేల?

కృ. బాలికలతో క్రీడించుటకే

జాంబ. చచ్చితివి; నాముష్టిచే. (కొట్టును)

శ్రీకృష్ణుడు; రామచంద్రమూర్తియై జాంబవంతునికి దర్శన మొసంగెను.

జాంబ. పాదములపై వ్రాలి; ప్రభో! వివేకహీనముచే

మూర్తిభేదము నన్నుఁ దొందరింప పాపినై నిన్నవమానించి తిని. ఇది మొదలు అన్నియు "యిష్టమూర్తిస్వరూపము" లని భావించెద; క్షమింప వేడుచున్నాను.

కృ. జాంబవంతా! నీవు మహాభక్తుఁడవు; నిన్ను నే నెరుఁగనా! నామాయ దాటరానిది; కావున, నీవట్లు భ్రమ పడితివి.

జాంబ శ్రీకృష్ణా! "యీమణియేకాదు యీకన్యామ ణిని సయితము తమ పాదార్పితముఁ గావించెదను.

జాంబ. అమ్మాయీ! గోపాలమూర్తిని సేవించి తరిం పుము; జాంబవతిని, శమంతమును శ్రీకృష్ణున కొసంగెను.

శ్రీకృష్ణుఁడు; మణిద్వయమును' గైకొని ద్వారక చేరి, శమంతమును సత్రాజిత్తున కొసంగెను, ఆసమయమునకు నారద మునితెంచిరి; "సత్రాజిత్తు" సత్యమునెరింగి మిగుల పశ్చాత్తా పపడి నారదునిఁగాంచి; మునీంద్రా తాముజెప్పిన దంతయు

సత్యమైనది; నేను అజ్ఞానాంధకారమున మునింగి అనగానిమా టలు గోపాలుని పోనాడితిని; మానసము నిప్పులం బొరలినట్లు న్నది; యేమిచేయుదు నన్నుద్ధరింప తామేసమర్థులు; శ్రీకృ ష్ణుఁడు నన్నెట్లు మన్నింపఁగలఁడు? ఆతనిని ప్రసన్నునింగావించు కొను నుపాయమెయ్యది సెలవీఁడు?

నా అయ్యా! సకలైశ్వర్య సంపన్నుడవు నీకు గోపా లుని అనుగ్రహమేల?

స. మునీంద్రా! నన్నేల డెప్పెదవు తెలియకచేసిన తప్పులు తమబోంట్లు లెక్కగొనరు గదా?

నా నాకు తెలియదు ఆయననే శరణువేడుము.

స. స్వామీ! తాము రాఁ లయు?

నా. నేనెందులకు? గోపాలు నవమానించునాఁడు నే నుంటినా?

స. దేవా! నేనపరాధిని, నన్ను మన్నింపవలయు మణిని శ్రీకృష్ణుని పాదారవిందములపై నిడి క్షమాపణ వేఁడు కొందును.

నా. యీమణి ఆమహామహున కేండుకు?

స. కన్యామణియగు 'సత్య' నొసంగి జామాతనుఁగావించుకొని తర్వాత అల్లునికి 'అరుణముగా' శమంతము నొసంగి, భక్తిమయి పాదముల కెరంగెదను.

నా. సత్రాజిత్తూ! కృతకృత్యుఁడ వయ్యెద వట్లు గావింపుము.

సత్రాజిత్తు అట్లుగావించి కృతార్థుఁ డయ్యెను.

కావున- అర్థార్థుఁడును తుదకు భగవానుని కరుణకు పాత్రుఁడు గాఁగలఁడు. యిదియు నొకసోపానము!

భగవానుని పాదారవిందసౌధము చేరుటకు 'రాధాదేవి'

మధురభక్తి సోపానము నధిష్టించిన అత్యంత భక్తురాలు.

శ్లో. అథచిర పరిభుక్తా శౌరిణా ఖండరూపా
నిజసుఖ పరితృప్తా బ్రహ్మవిద్యేవ రాధా
వ్రజయువతిభిః రుచ్చైః ప్రార్థితా సాభిలాషం
హరి పరతరభావం దర్శయంతీద మాహ.

(కృష్ణలీలాతరంగిణి)

శ్రీకృష్ణుని ఏకాంతస్థలమున నారాధించి బ్రహ్మజ్ఞాని యుంబోలె, మిగుల ఆనందమును పొందియున్న యా త్రిలోక సుందరి 'రాధ' శ్రీకృష్ణ పరతత్వము నందు లీనమయినది.

ఆయానందమును తన సోదరీమణులగు 'గోపికలకు' ప్రబోధగావించినది.

ప్ర. భక్తియన భగవాను నారాధించుటయేగదా!

ఉ. అవును.

వ్రి ఆరాధించుటకు సోపానము లని తాముచెప్పెను యిన్నిమార్గము లేల?

ఉ. లోక మెప్పుడును ఒకేమార్గము ననుసరింపదు. త్రిగుణములచే నావరింపఁబడి యుండుటవలన భిన్నమార్గముల ననుసరించు చుండును "భగవానులు తనగీత యందు గుణము ననుసరించిన పూజలే మానవులు చేయుదురని చెప్పియున్నారు"

గీ. 17 అ 4. శ్లో.

శ్లో. యజంతే సాత్వికా దేవాన్ యక్షరక్షాంసిరాజసాః
ప్రేతాన్ భూతగణాం శ్చాన్యే యజంతే తామసాజనాః.

తా. సాత్వికులు మోక్షసుఖమునకై దేవతలను పూజింపుచున్నారు; రామకృష్ణా ద్యవతారములను పండో, నీరో, దళమో, పుష్పమో యిచ్చి. రాజసికులు ఇహలోక సుఖమునకై యక్ష రాక్షసుల పూజింపుచున్నారు; భూతబలుల నిచ్చి తామసికులు యితరులను బాధించుటకయి భూత ప్రేతములను

పూజింపుచున్నారు; ఘోరమగు బలులు. భయంకరము లగు తపస్సులుచేసి, శాస్త్రములలో చెప్పఁబడినవి గాక, అహంకారముతో కూడిన పూజలు కుమార్గములు అనేకము లున్నవి; కుమార్గములువదలి సన్మార్గములను తెలుపున దగుటచే భక్తి మార్గము అతిపవిత్రమైన దని ముముక్షువులు కొనియాడిరి.

ప్ర. యక్షులను, రాక్షసులను ఆరాధించుట సైతము భక్తి కాదా?

ఉ. భక్తియే! కానీ- అల్పకోరికల నిచ్చు యక్షులు; ఆదియగు క్షుద్రారాధన ప్రశస్తమయినది కాదు.

ఒకవిద్యార్థి యున్నా డనుకొనుము; వానిపాఠములయందు సందేహము, సంశయముఁ కలిగినప్పుడు, తనకంటె పైక్లాసువాని నడుగుట కన్నను, అందరికంటెఁ బెద్దవారును, అన్నిక్లాసులకు పాఠములు చెప్పువా రగు ఉపాధ్యాయుని ఆశ్రయించినచో, యిప్పుడుఁగలిగిన సంశయము వీడును; ఇంక సందేహములు రాకుండునట్లు పాఠములు బోధపరచును.

అలాగే చిన్నచిన్న కోరికలు మనస్సున నుంచుకొని క్షుద్రారాధనలుచేసి జన్మపరంపరలు పొందుట కంటెను, సర్వ ప్రభువగు భగవాను నారాధించి కోరిక లడుగుము; మోక్షము నడుగుము; లేక ఫలరహితముగా నారాధింపుము; వాకిటనుండు ద్వారపాలకుల నాశ్రయించుట కన్నను, ప్రభువు నాశ్రయించుట మేలుకదా!

యెన్నిమార్గములచే నయినను 'భగవాను' నారాధింప తగును.

కావున— సాత్త్వికుడు; యెప్పుడును క్షుద్రకోరికల కోరడు; క్షుద్రారాధన చేయడు.

రాజసుడెప్పుడును నీచకోరికలు నీచాశ్రయం కలిగియుండును.

ఇక తామసుడన్ననో చౌర్యము, వ్యభిచారము, వాని దుండగములకు మేరలేదు. వానికోరిలు, ఆరాధనలు మహా ఘోరములు.

ప్ర. అయిన రాజస, తామసుల గతియేమి?

ఉ. గతియేమున్నది; కొంతకాలము కష్టముల ననుభ వింపగా, అనుభవింపగా మనస్సు విసుగుపడి "తామసుడు రాజసుఁడై, రాజసుండు సాత్వికుఁడై, జిజ్ఞాసువగును; ఇట్లు పరమేశ్వర సృష్టియందు క్రమాభివృద్ధియగుచుండును.

గీ. 9. అ. 31. శ్లో.

శ్లో. అపిచేత్సు దురాచారో భజతేమా మనన్యభాక్
సాధు రేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః

శ్లో. క్షిప్రంభవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి నమే భక్త ప్రణశ్యతి.

అర్జునా! దురాచారుఁడైనను అన్యదేవతల నారాధింపక నన్నే భజించినచో వాఁడు ఆత్మతత్వము తెలిసిన నా భక్తుఁ డగుచున్నాడు; వాడే సదాచారుఁడని తెలియుము.

అట్టివాఁడు అచిరకాలముననే ధర్మాత్ముఁడై పరమ

శాంతినిఁ జెందుచున్నాడు; వాని కెన్నఁడును నాశనములేదని తెలియుము.

కావున నమ్మిచెడినవారు లేరను సామెత కలదుగదా?

శ్లో. యదృచ్ఛయా మత్కథాదౌ జాత శ్రద్ధస్తుయఃపుమాన్
నవిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగో స్యసిద్ధిదః
[భాగవతము]

తా. వైరాగ్య జ్ఞానము లించుక కొరంత గలిగియుండినను సంసారమునం దత్యంత సక్తతలేక; నాపరిసంగమునందు శ్రద్ధగలిగి యుండువానికి భక్తియోగము సిద్ధించు నని భగవానుడే నుడివి యున్నాడు.

తగు వైరాగ్యము గలిగి విద్యా జ్ఞానాదులచే నొప్పుచుండిన భగవత్కరుణ గలుగుటయు, భక్తి యలవడుటయు చిత్రమా?

ఇవన్నియు తెలియుటకు సత్సాంగత్యము, సద్గ్రంథ పఠ

నము, హరినామ సంకీర్తనము, సాధుసేవ, తీర్థసంసేవనము [సత్కర్మాచరణము] యివన్నియు [భగవానుని] భక్తిసోపానముల నధిరోహింప సాధన పంచక మందురు.

ప్ర) మానవుడెట్టి కర్మాచరణము గావింప వలయు; ధర్మశబ్దము న కర్థమేమి?

ఉ. (ధృ) అను ధాతువు నుండి ధర్మ శబ్ద ముత్పన్న మగుచున్నది. ధరించునది ధర్మమని విద్వాంసులు నిర్వచించి యున్నారు. విశ్వమంతయు ధర్మశబ్దమే! ధర్మాసక్తి లేని మానవు డెట్టికార్యమును జేయజాలడు.

వైశేషిక దర్శనము:

"యతోభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధిః తద్ధర్మః"

ఇహపరముల నున్నతిగ గలిగి తుదకెద్ది మోక్షప్రాప్తిని గలిగించునో యదియే మానవుని ధర్మము.

అహేతుక భక్తి గమ్యమే మోక్షము దీనికే మానవుడు రెడ తెరిపిలేక ప్రయత్నించుచుండవలయును.

బాహ్యాడంబర ములకన్నను ఆంతరంగిక మత్యావసరము సర్వభూతదయ పరదూషణా రాహిత్యము; సమత్వబుద్ధి [తైల ధారవలె] యెడ తెగని పరమేశ్వర ధ్యానము దీనికి ముఖ్యాంగములు, సత్యము ప్రాణము వంటిది. కావుననే వేదమాత; 'సత్యంవద ధర్మంచర' యని తన ధర్మసంతానమునకు ఆజ్ఞ చేసియున్నది.

అనగా సత్యము నేపలుకుము, ధర్మమునందే చరింపుము యిదియే మనకు భగవదాజ్ఞ.

ఆత్మసోదరులారా! భక్తి సోపాన గాములారా! సాధ్వీమతల్లులారా! దీనిని మాత్రము నెరవేర్చితిమా ధన్యులమగుదుము. ఫలాసక్తి వదలి సకలకార్యములు భగవదర్పణబుద్ధితో నాచరింపవలయు.

శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసియత్

యత్ప్రపశ్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణం.

ప్రతి మానవుడు తన జీవితమునకై చేయు నిత్య కృత్యములు సయితము భగవదారాధనగా భావించినచో భగవానునకు తనకు వేరుభావము వదలి ఐక్య మేర్పడును.

సీ॥ నే. భగవద్వైక్యమని కొందరు,
బ్రహ్మైక్యమని కొందరు,
జీవైక్యమని కొందరు,
అనేక భావాభేదములుగా పలుకుచుందురు.

యెట్లున్న నేమి? సర్వ జీవకోట్ల గమ్యస్థానమగు భగవానుని పొందుటయే మానవుని పరమావధి.

శ్లో. యత్పాదాబ్జయుగం సుగంధతులసీ లోభాద్భజంతోఽప్యహో
మోగీత్ప్రిష్యగతి ప్రకుంఠిసులభాః యద్భక్తిహీనాస్త్వథః
అబ్భక్ష్యాకిపవనాశనోఽపి మునయః సంసారచక్రే భృశం
భ్రామ్యంత్యేవగతాగతైః సముపాస్త్స్మైనమోవిష్ణవే.

భక్తిసోపానము.

సంపూర్ణము.

## యతిగీతము. (శ్రీ స్వామి వివేకానంద)

గీ. ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు
యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాడు॥

1. పుట్టెనీగీత మతిదూర భూమియందు।
విషయవాసన కందని విషయమందు।
కామధన కీర్తి కాంక్షల కలతగానని।
శాంతిమయకంఠ రారణ్య చయమునందు।
చాయతర సచ్చిదానంద చయమునందు॥
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాడు॥

2. పట్టిత్రెంపుము త్రెంపు నీ బంధనముల:
ఇనుపవేకాని మరియవి యేవియైన।
మించుబంగారువేకాని మించవుండు।
ద్వంద్వములు మంచి చెడ్డలున్ బంధనములె।
వైరరాగాదులునుగూడ బంధనములె।
గాన తెగద్రెంపవలయును వీనిగూడ।
కొట్టబడినను ప్రేమచే చుట్టబడిన
దాస్యమెట్లుండినను కూడ దాస్యమొకద।
కట్టజాలదె గొలుసు బంగారుదైన।
గాన తెగద్రెంపవలయును వీనిగూడ॥
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు॥

యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాడు॥

3. మినుకు మినుకను చీకటిగ మీదమీద।
సలుపుచుండెను కొరవిదయ్యంబు పగిది।
దనరు నజ్ఞానము నుబాపికొనుము వేగ।
జనన మరణమ్ములకు లాగికొనుచు నేగు।
జీవితపు తృష్ణ నార్పుము శీఘ్రముగను;
తన్ను దాగెల్చునట్టి వాడన్ని గెల్చు।
నీసి తెలియుము లోంగకు దేనికింక॥
ఎత్తి పాడుము కంఠము ఎత్తి పాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాడు॥

4 అవని జల్లిన దెద్దియో అదియె పండు।
కారణంబును బట్టియే కార్యముండు।
చెడ్డ చేష్టకును మంచిమంచికిని గల్గు।
దీనిఁ దప్పించుకొనుటకు తెరవు లేదు।
రూపుతో బంధనంబుండు రూఢముగను।
అన్నిటిని మీరియున్నది యాత్మగాన।
ఆత్మకును రూప నామ ధేయములు లేవు।
అదియె నీవను భావంబు మది నెరింగి॥
ఎత్తి పాడుము కంఠము ఎత్తి పాడు।
యతివరాధీర ఓమ్ తత్సదనుచు పాడు॥

5. తల్లియని తండ్రియని మరి పిల్లలనుచు।

భార్యయని మిత్రమని మరిబంధువను మా॥
కలువరించెడివారలు తెలియలేరు।
సత్యమేదియొ మరియు నసత్యమెదియొ।
ఆత్మకాలేదు స్త్రీపురుషాదిభేద।
మెవరికెవ్వ దండ్రి మరియాత డెవనిబిడ్డ।
ఎవనిశతృవు మరియాత డెవని సఖుడు।
ఒక్కడేయాత్మయంతట నొప్పుచుండు।
అంతయును నాత్మగాని య న్యంబులేదు।
అదియె నీవనుసత్యంబు మదినెరింగి॥
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచుబాడు॥

6. ఉండునదియెల్ల దానయై యొక్కటుండు।
నాతడేజ్ఞాతముత్తుండు నాత్మయతడె।
అతనికి రూప నామధేయములులేవు।
అతనిలోనొక్క మాయదా నలరుచుండు।
కలల నెన్నియొ యద్ది యేకనుచునుండు।
గాని యాయాత్మ సాక్షియై కాంచుచుండు।
నదియె నీవనుసత్యంబు మదినెరింగి।
ఎత్తిపాడుము కంఠము ఎత్తిపాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచుపాడు॥

7. ముజ్జగంబియ్యజాలని ముక్తికొరకు।
నెచట వెదకెదు మిత్రమా నెటువెదకెదు।

గ్రంథముల గుళ్ల వెదకిన గలదె ఫలము।
నిన్నుదాలాగికొని పోవుచున్న తాడు।
నీకరమునందెయున్నది నిజముగాను।
వగచుటనుమాని నీవింక వదలిడాని॥
ఎత్తి పాడుము కంఠము నెత్తి పాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచుపాడు॥

8. ఎట్టిపాత్రయు కాను ఏది ఇంచుకైన।
బడయకుండనుగాక యుపాయమెపుడు।
పై వసించెడు మరికి ద బాధచుండు।
అన్నిప్రాణులకును నాత్మ యైనవాడ।
ఇహపరంబుల జీవిత మొడలినాడ।
స్వర్గనరకాశ భయముల వదలినాడ।
ననుచు నీబంధనమ్ముల నట్టితెగ్గించి।
శాంతిపార మొసంగుచు సర్వమునకు।
ఎత్తి పాడుమి కంఠము నెత్తి పాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచుపాడు॥

9. కాయమేమైన లక్ష్యంబు సేయబోకు।
దానిపనిదీరెగావున దానిపట్టి
కొనిపోవు కర్మమే గట్టుకేని।
దాకగుపట్టి మండనదండనముల।
ని కేసిరు నెంచకు మేనియనకు।
పొ బడువాడు మరియును పొగడువాడు।

తిట్టుబడువాడు మరియును తిట్టువాడు।
నొక్కఁడై యుండ స్తుతి నిందలున్న చెప్పుము।
స్వాంతమున నిర్విరోధంబున శాంతినుంచి॥
ఎత్తి పాడుము కంఠము నెత్తి పాడు॥
యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాడు॥

10 కామమును మోహలోభముల్ గలుగుచోట।
నుండు నేసత్య మెన్నడు నుండబోదు।
ఇంతినిఁ దనపత్నిగా నెన్నునట్టి।
పురుషు డెన్నడు పూర్ణత బొందలేడు।
తనదనుచు నెంత చిన్న దేఁ దలచువాడు।
ఆగ్రహగుణంబుచే బద్ధుడైనవాడు।
తథ్యముగ మాయగుమ్మము దాటలేడు।
గాన నీదుర్గుణంబుల మాని వేసి॥
ఎత్తి పాడుము కంఠము నెత్తి పాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచు పాడు।

11. నీకు నిల్లేల నినుబట్టు నిలయమున్న।
గడ్డియెవరుండు పాన్పు ఆ కసమొకప్పు।
చిక్కినదె తిండి మంచిదేన్ చెడ్డదేని।
మంచిచెడ్డల మదిలోన నెంచబోకు।
తన్ను దెలిసిన మహితాత్మ కెన్నడేని।
నమరునె కళంక మన్నపానముల చేత।
ఎత్తి పాడుము కంఠము నెత్తి పాడు।

యతివరా ధీర ఓమ్ తత్సదనుచుపాడు॥

12. కొందరే సత్యమెరుగుచు నుందురిలను।
గాన తక్కినవారకలు ఘనుడనుచు।
జేరినవ్వాన లక్ష్యంబు సేయుబోరు।
ముక్తిదారెల్ల కడలకు బోయిబోయి।
మోదమునకయి వెదకక ఖేదమునకు॥
భయపడకయుండి రెంటిని వదలిచనుచు।
మాయ తెరతీసి జనుల తమమ్ముబాపి।
ఎత్తిపాడుము కంఠము నెత్తిపాడు।
యతివరా ధీర ఓమ్ తత్సదనుచుపాడు॥

13. సర్వకర్మఫలంబులు సమయువరకు।
ననుదినంబివ్విధంబున జనుచునుండి।
నీవు నీయాత్మకొసగుము నిత్యముక్తి।
అప్పుడుండదు నీవు నేననుటగాని।
జననమును దేవ మానవు లనుటగాని।
ఆత్మ పరమాత్మలకు భేదమనుటగాని।
ఆదియెయానందమును మరియదియెనీవు॥ యొ॥ (అ. ఆ।సో)

# యతిగీతము
సంపూర్ణమ్

